# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు : (1938-1972)

9-15 జనవరి, '87

శ్రీ అక్షయ నామ సం. పుష్య శు. దశమి.

సంపుటము 79 : సంచిక 19

ముఖ్య సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు :

మతుకుమల్లి మాధవరావు

విడి ప్రతి వెల రు. 2.75

పోస్టులో 6నెలల చందా రు. 78.00

పోస్టులో 12నెలల చందా రు. 156.00

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి : రమ్యకృష్ణ

(ఫోటో : జగ్‌మోహన్)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :






## ముఖచిత్రం

నటి "మందాకిని" ముఖచిత్రంతో వెలువడిన 12–18 డిసెంబరు' 86 సంచిక చాలా అందముగా, ఆకర్షణీయముగా ఉన్నది.

టి. ఎస్. రాజు, తగరపువలస

## సీరియల్స్

"రసరాగ వాహిని" సీరియల్ బాగుంది. టైటిల్‌కు తగ్గట్టుగా కథ నడుస్తోంది. కళ్యాణి పాత్ర బాగుంది.

ఎం. లలిత, కామేశ్వరి, బల్లకురవ

★ ★ ★

"ఒడిలో చెలి మోహనరాగం" సీరియల్ ఇప్పుడు క్రొత్త మలుపు తిరిగింది. మంజీరని ఊహించుకుంటే బాధగా ఉంది.

జి. రాజేశ్వరి, గోదావరి ఖని

★ ★ ★

'ఆరోహణ' సీరియల్ ఆసక్తిదాయకంగా వుంది.

డి. రమేష్, ఉద్దవోలు

★ ★ ★

"తేజోవతి" గారి "ఒకటి ఒకటీ మూడు" సీరియల్ ఆసక్తికరంగా సాగుతున్నది.

పి. అరుణ, కాకినాడ

## శీర్షికలు

"మందాకిని" ముఖచిత్రంతో వెలువడిన (12.12.86) పత్రిక చాలా ఆకర్షణీయంగావుంది. "గర్భస్థ శిశువు చెప్పిన కథలు" అనే శీర్షికలో "జ్ఞానోదయం, అమ్మో! మేము రాము" చాలా బాగున్నాయి.

చిలకపాటి నాగరాజు, చిత్తూరు

★ ★ ★

12–18 డిసెంబరు నటి "మందాకిని" ముఖ చిత్రముతో వెలువడిన పత్రిక చాలా అందంగా ఆకర్షణీయంగా ఉంది. అభిమాన తారలపై అభిప్రాయాలు చాలా బాగున్నాయి.

ఎస్. వి. సత్యారావు, టెక్కలి

## సిగ్గుపడాల్సిన విషయం

12-18, డిసెంబర్, 1986 సంచికలోని హైదరాబాద్ నోట్‌బుక్ శీర్షిక చదివాను. మీరు ప్రచురించిన ఫోటోలోని డాక్టర్లు, నర్సులు నవ్వుతున్నారు. ఎంతటి కఠిన హృదయులనయినా కరిగించే అట్టి విషాద సంఘటనలో ఆ డాక్టర్లకు నవ్వు ఎలా వస్తున్నది. జోకులు వేసుకుంటున్నారా? లేక ఫోటో కోసం నవ్వుతున్నారా? ఈ దేశంలో, లోకం అంటే ఏమిటో తెలియని ఒక 8 సంవత్సరాల పాపకూడా చార్మినార్‌పై నుండి తనంతతానుగా దూకి ఆత్మహత్య చేసుకున్నదంటే అందరూ సిగ్గుపడాల్సిన విషయం.

- టి. పరమహంస, భద్రగిరి

## వ్యాసాలు

'మహోజ్వల క్షేత్ర కూటమి మహేంద్రగిరి' - ఒక ప్రత్యేకత! 'మహేంద్రగిరి' గురించి పూర్తి వివరాలు ఈ వ్యాసం ద్వారా తెలుసుకుని చాలా సంతోషించాను.

- యన్. కనకారావు, పర్లాకిమిడి

## కార్టూన్

మందాకిని ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో లలితగారి కార్టూన్ చాలా బాగుంది. కొన్నాళ్లకు 'దేహి' అన్న పేరు కూడా అమ్మాయిలకు పెట్టేస్తారేమో...!

సి. కృష్ణవేణి, విజయనగరం

## ధర్మపథం

నటి "మందాకిని" ముఖచిత్రంతో వెలువడిన సంచిక "ధర్మపథం" శీర్షికలో "ఆహార భేదాలు" గురించి బులుసు వేంకటరమణయ్యగారు బాగుగా వ్రాసారు.

- వేణు గోపాలదాసు, ఇచ్ఛాపురం

## కథలు

అందాల నటి "మందాకిని" ముఖచిత్రంతో వెలువడిన "ఆంధ్రసచిత్ర వారపత్రిక" చాలా ఆకర్షణీయంగా ఉంది. "బరువు", "నిర్ణయం", "నీళ్ళ కావిడి" కథలు చాలా బావున్నాయి.

పి. శ్రీపతి, యం. శ్రీనివాస్, మహబూబాబాద్

★ ★ ★

"బరువు" కథ నేటి మధ్యతరగతి కుటుంబాల జీవితానికి ప్రతిబింబంగా ఉంది.

డి. జ్ఞానలక్ష్మి, కోయిలకుంట్ల

## స్మిత స్మృతి

గంజాయి వనంలో
తల ఎత్తిన తులసి మొక్కవు!
కాగితం పూలే
పువ్వులుగా
ప్రేక్షకుల ప్రాణాలు తోడేస్తుంటే
నవవికసిత రోజాగా పరిమళించి
నటనకు భాష్యం చెప్పావ్!
నీ చిత్రాలు
తైలవర్ణ చిత్రాలుగా
రసజ్ఞుల మదిలో
పచ్చ పచ్చగా నిలిచే ఉంటాయ్!
తారాపథం వెల వెల పోతోంది
నువ్వు లేని శూన్యంతో!
ప్రేక్షకుల గుండెలకు
కోత పెడుతూ......

–కొడిమెల శ్రీరామమూర్తి,

ఏలూరు □

సీరియల్

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

పాపారావు హైదరాబాదు నుంచి వస్తున్నాడు  రాత్రి పదకొండు గంటలయింది లైట్లు తీసేసారు బస్సులో పాపారావు పక్క సీట్లో ఒక పదహారేళ్ల అమ్మాయి కూర్చొని ఉంది ఆ ఒక్క సీటే ఖాళీగా ఉండటంతో తప్పనిసరిగా ఆ పిల్ల అక్కడ కూర్చుంది

ఎక్కిన దగ్గర్నుంచీ ఆమెను పరిశీలిస్తున్నాడు పాపారావు ఆమె ప్రవర్తన అనుమానాస్పదంగా ఉండటం  ఆ కళ్లలో బెదురు  పైట చెంగు తలచుట్టూ కప్పుకుని మొహం చాటు చేసుకోవాలనే ఆ ప్రయత్నంలో తడబాటు . నెర్వస్‌నెస్ ఇదంతా పాపారావు టైగర్‌లాంటి మనసు తేలిగ్గా పసిగట్టేసింది.

ఆ అమ్మాయి అందం  ముగ్ధత్వం అతని మనసును ఊరిస్తున్నాయి చిలకమ్మలా ఉన్న ఆ పిల్లను అనుభవించని జన్మెందుకు అనుకుంటూ ఆమెను జాగ్రత్తగా ట్రాప్ చెయ్యటానికి పథకం ఆలోచించసాగాడు పాపారావు తన తెలివితేటలన్నీ ఈ విషయంమీదే కేంద్రీకరించాడు

ఏ వూర్నించి వస్తున్నావమ్మా'? మృదువుగా అడిగాడు పాపారావు

అతని అప్పియరెన్స్ ఎలాంటిదంటే  ఆపదలో ఉన్నవాడికి సైతం చాలా ఆత్మీయుడిగా  సౌమ్యంగా కనిపిస్తాడు అందుకు తగిన హావభావాలు ప్రదర్శించగల నైపుణ్యం అతనికుంది

సోందేవిపల్లి  బెదురుగా చెప్పిందా అమ్మాయి

హైదరాబాదెందుకొచ్చావ్?

"

చెప్పమ్మా!

'నాకు నీలాంటి కూతురుండేది తల్లీ  ఎవడో వెంట తీసికెళ్లి నమ్మించి నట్టేట్లో ముంచాడు నీ అంత వయస్సున్న అమ్మాయిల్ని చూస్తే ఆ సంఘటన గుర్తొచ్చి నా మనసు విషాదంగా మారిపోతుంటుంది వాళ్లు ఏ ఆపదలో ఇరుక్కుంటారోనని తహతహలాడిపోతుంటాను

నీ మొహం చూస్తుంటే నువ్వేదో ఆపదలో చిక్కుకున్నట్లనిపిస్తోంది

నీ తండ్రిలాంటివాడిని  నాకు చెప్పమ్మా నేనేమైనా పరిష్కరించగలనేమో చూస్తాను  అన్నాడు పాపారావు తియ్యగా

ఆధారం హఠాత్తుగా కూలిపోతే  గాలికి తూలుతున్న చిరు తీగలా ఉన్నదామె. ఏ ఆసరా దొరికినా అమాయకంగా అల్లుకునేలా ఉందామె పరిస్థితి

రెపరెపలాడుతున్న కళ్లతో బేలగా చూసిందామె

"చెప్పు తల్లీ! పాపారావు కుడి చెయ్యి ఆమె జుట్టును ఆప్యాయంగా స్పృశించింది

'మా ఇంటి పక్కకు ఓ కుటుంబం అద్దెకు దిగింది వాళ్లకూ మాకూ స్నేహం ఏర్పడింది ఆ ఇంటాయన బావమరిది ఢిల్లీనుంచి వచ్చాడు అతనూ నేనూ ప్రేమించుకున్నాం  పెద్దవాళ్లకు తెలిస్తే ఊరుకోరని  అతను నన్ను ఢిల్లీ తీసుకెళ్లి పెళ్లిచేసుకుంటానన్నాడు  ఇద్దరం హైదరాబాదొచ్చాం  కొంచెం పనుంది అని చెప్పి  హోటల్‌లో రూం తీసుకున్నాడు ఇక్కడ రెండు రోజులున్నాం ఆ రెండు రోజులూ అతను నా పట్ల అసభ్యంగా ప్రవర్తించలేదు మూడో రోజు ఉదయం నేను లేచి చూసేసరికి అతను లేడు నా నగలూ లేవు

హోటల్‌లో ఉన్నవాళ్లెవరో నా వెంటపడబోతే . పారిపోయి రిక్షా ఎక్కాను రిక్షా అతను ఎక్కడికని అడిగితే  బస్టాండుకని చెప్పాను నాకు తెలిసిన పేరు అదొక్కటే  ఇక్కడ ఈ బస్సు కదులుతుంటే ఇందులో ఎక్కేసాను భయంతోనూ, దుఃఖంతోనూ ఒణుకుతోందామె గొంతు

'ఎక్కడికెళదామని?' అన్నాడు పాపారావు

"తెలీదు"

జరిగిన కథ –9 . మంజీర ప్రణీత్‌ల వివాహానికి పెద్దలు తాంబూలాలు పుచ్చుకుంటారు మంజీర ప్రణీత్‌లు ఒకరి మనసు నొకరు అర్థం చేసుకుని ప్రేమైక జీవులవుతారు మంజీర తండ్రి బాబూరావు అక్రమాలు చేసి ఎం ఎల్ ఏ గా ఎన్నికయి మినిస్టరవుతాడు ప్రణీత్ సబిన్‌స్పెక్టర్‌గా పైడిపల్లికే వస్తాడు పెళ్ళి గురించి అడగడానికి వెళ్ళిన ప్రణీత్ తండ్రి వెంకట్రామయ్యను బాబూరావు అవమానిస్తాడు ఈ పెళ్ళి జరగదనీ, మంజీరను ఆర్థిక మంత్రి కొడుక్కి ఇవ్వడానికి నిశ్చయించుకున్నాననీ అంటాడు ఆందోళన చెందుతున్న మంజీరను హైమ, తాతగారు, శార్వాణి ఓదారుస్తారు రాజకుమార్ సాయంతో ప్రణీత్ మంజీరను రహస్యంగా పెళ్ళి చేసుకుని బాబురావు దగ్గరికి వస్తాడు నవ వధూవరుల్ని బాబూరావు అవమానించి వెళ్ళగొడుతాడు మంజీరతో సంబంధాలు పూర్తిగా తెంచుకోవాలని, ఏమాత్రం సంబందం పెట్టుకున్నా తాను చనిపోయాననుకోవాలని బాబురావు ఇంట్లో కట్టడి చేస్తాడు మంజీర క్షేమసమాచారం హైమ ద్వారా శార్వాణికి తెలుస్తుంది బాబూరావుకు ప్రణీత్ మీద ద్వేషాన్ని పెంచేందుకు పాపారావు ప్రయత్నిస్తుంటాడు

ఆ పిల్ల ఎంత అమాయకురాలో అర్ధమయింది పాపారావుకు బహుశా దీన్ని ఎత్తుకొచ్చినవాడు మగతనం లేనివాడయి ఉంటాడు అందుకే దీన్ని ఒదిలేసి నగలుచ్చుకు పారిపోయాడు

తన పంట పండింది దీనికి తనే కన్నెరికం చెయ్యబోతున్నాడు! తన బావాల్ని అణిచేసుకుంటూ 'గమ్యం లేకుండా ఎక్కడికెడతావమ్మా!' అన్నాడు మార్దవంగా

'ఏం చెయ్యను? ఎక్కడో ఓ చోట దిగిపోయి . ఎవరింట్లోనేయినా ఏదయినా పని చేసుకు బ్రతుకుతాను ఇంటికేముఖం పెట్టుకుని వెడతాను? మా వాళ్ళు చంపుతారు'

'నీలాంటి అందమయిన అమ్మాయి అనాదగా తమ ఇళ్ళలో పనిచేస్తుంటే ఆ ఇంటి మగాళ్ళు ఊరుకుంటారా! నిన్ను రాబందుల్లా పీక్కు తినరూ?'

ఆ పిల్ల భయంగా చూడ్డం గమనించి రెట్టించిన ఉత్సాహంతో చెప్పుకుపోయాడు పాపారావు

ఆ అమ్మాయి ఎంత భయపడిందంటే ఆ క్షణంలో పాపారావు ఏం చెయ్యమన్నా . ఎదురు ప్రశ్నించకుండా చేసేదానిలా తయారయింది

నాతో పాటు మా ఊర్లో దిగిపోమ్మా నేనూ, నా భార్యా నిన్ను కన్నబిడ్డలా చూసుకుంటాము కాస్త ఈ గొడవ చల్లారాక నేనే నిన్ను మీ ఇంటికి '

అమ్మో! నేను ఇంటికెళ్లను మా నాన్న చంపేస్తాడు మధ్యలోనే అడ్డుకుంటూ భయంగా అన్నదామె

'సరే! నీ యిష్టం మాతోనే ఉండిపోదుగాని నేనే ఓ మంచి సంబంధం చూసి నీకు పెళ్ళి చేస్తాను నీలో మా కూతుర్ని చూసుకుంటాం'

మాటి మాటికీ పాపారావు వాడుతున్న 'కూతురు" అనే పదం పసివాడి ముందు మిఠాయి పెట్టినట్లుందా పిల్లకు మారుమాట్లాడకుండా పైడిపల్లిలో దిగిపోయింది

ఆ అమ్మాయి పేరు దాక్షాయణి

బెదురు బెదురుగా చూస్తూ పాపారావు వెనక ఇంట్లోకి అడుగుపెడుతున్న దాక్షాయణిని ఆమె పాలు కారే ముఖాన్నీ వింతగా చూసింది హరిణి

మామూలుగా పాపారావు తెచ్చే ఆడవాళ్లకు, ఈ పిల్లకూ గల తేడానామె గుర్తించింది

హరిణీ! ఈ అమ్మాయి దాక్షాయణి మన బిడ్డలాంటిది. ఇప్పుడీ పిల్లనేం ప్రశ్నించకు నువ్వు అసలే మనసు దెబ్బతిని ఉంది ' తనతో కలుపుగోలుగా చెపుతున్న పాపారావును చూసి ఈ పిల్లను దొంగ మాటలతో మోసగించి తెచ్చి ఉంటాడని గ్రహించింది హరిణి

పరాయి ఆడపిల్లను తన కన్నకూతురులా పాపారావు చూడగలడంటే ఛస్తే నమ్మదామె

దాక్షాయణి చాలా అమాయకురాలని మొదటి చూపులోనే అర్ధమయింది హరిణికి ఏమయినాసరే ఆ పిల్లను తన భర్త బారి నుంచి కాపాడాలని నిశ్చయించుకుందామె అందుకే పైకి పొక్కకుండా రామ్మా! మొహం కడుక్కుని కాఫీ తాగుదుగాని అన్నది హరిణి ఆప్యాయంగా

అది చూసి పిచ్చి ముండ ఇదికూడా నమ్మేసింది తన మాటల్ని నిజంగానే ఆ పిల్లని తను కూతురిలా చూసుకుంటాడనుకుంటోంది" అని నవ్వుకున్నాడు పాపారావు అతనికి చాలా హుషారుగా ఉంది

అమ్మాయ్ దాక్షాయణీ! కాఫీ తాగు . టిఫిన్ తిను . ఇది నీ పుట్టిల్లే అనుకో . ." అంటున్న పాపారావును చూస్తుంటే అసహ్యమేస్తోంది హరిణికి

ఈ అమ్మాయినెలా రక్షించాలి?

చీకటిపడ్డాక తన మొగుడు గుర్రమెక్కేసి తన నిజరూపం బయట పెట్టేలోగా ఈ పిల్లనిక్కడి నుండి తప్పించాలి

తప్పించి ఎక్కడ దాచాలి? ఈ పిల్లనీ ఊరు దాటించాలంటే . తన ఒక్కదానివల్ల కాదు ఇందుకెవరి సహకారమయినా కావాలి

తనకెవరు సహకరిస్తారు?

అనవసరంగా నేలను పోయేది నెత్తికి రాసుకుని . తన భర్తతో వైరం తెచ్చుకోటానికి ఊర్లో ఏ ఇంటివాళ్ళూ సిద్ధపడరు. తనకెవరూ సాయం చెయ్యరు.

మరెలా?

సగంమంది తన భర్తకు భయపడి తిరస్కరిస్తే ... మరికొందరు



కొత్త శీర్షిక

# రచయిత్రి జవాబులు



ప్రముఖ రచయిత్రి శ్రీమతి ఆదూరి సావిత్రి తమ సీరియల్ నవల 'ఒడిలో చెలి మోహనరాగం'పై పాఠకుల ప్రశ్నలకి సమాధానాలు ఇస్తారు. ఈ అవకాశాన్ని వినియోగించుకో దలచుకున్నవారు తమ ప్రశ్నలని 'రచయిత్రి జవాబులు" శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520003 అనే చిరునామాకి పంపవచ్చు వాటిలో రచయిత్రి ఎంపిక చేసిన ప్రశ్నలని, వాటికి ఆమె ఇచ్చిన సమాధానాలని వారం వారం ఈ సీరియల్ పేజీలలో ప్రచురిస్తాము. ప్రతివారం రచయిత్రి ఉత్తమంగా ఎంపిక చేసిన ప్రశ్నని పంపిన వారికి ఆమె రాసిన నవలలలో ఏదో ఒకదానిని బహుమతిగా ఇవ్వటం జరుగుతుంది ఈ అవకాశాన్ని పాఠకులు వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము

– సంపాదకుడు

## ఒడిలో చెలి మోహనరాగం

ఎందుకొచ్చిన గొడవలెమ్మని తిరస్కరిస్తారు

మరి ఎలా?

ఇదే ఆలోచన హరిణికి

పాపారావు వినకుండా నెమ్మదిగా ఆ పిల్లనుంచి వివరాలు రాబట్టిందామె కానీ తన భర్త ఇలాంటివాడని ఆ పిల్లకు చెప్పలేదు దాక్షాయణి పాపారావుతో చనువుగా, నిస్సంకోచంగా మాట్లాడుతోంది తనీ విషయం చెపితే బెదిరిపోతుంది

ఆ బెదురునతడు తేలిగ్గా పసికడతాడు అందుకు కారకురాలైన తనను శిక్షించటంతో పాటు ఆ పిల్లను అప్పటికప్పుడే చెరుస్తాడు

అందుకే తనేం చెయ్యాలో ఆలోచించుకున్నాక కాస్త ముందుగా మాత్రమే దాక్షాయణికీ విషయం తెలియజెయ్యాలని నిర్ణయించుకుంది హరిణి

'గూట్లో చేరిన పిట్ట ఎక్కడికి పోతుందిలే తీరికగా రాత్రికి చూసుకోవచ్చు" అనుకుంటున్నాడు పాపారావు సాయంత్రానికి హరిణి ఒక నిర్ణయానికొచ్చేసి కాస్త నిశ్చింతగా ఉంది

ఆరు దాటాక ఈ విషయం దాక్షాయణికి చెప్పింది. హడలిపోయి ఏడుపు ముఖం పెట్టిన దాక్షాయణిని ఓదారుస్తూ-

"నువ్విలా ఏడ్చి గోల చేస్తే ... ఇహ నిన్ను రక్షించటం నాతరంకాదు ఆయనకు అనుమానం రాకుండా . ఉదయం నుంచీ ఎలా ఉన్నావో అలాగే ఉండాలి నువ్వు నీకేం భయంలేదు

సమయం చూసి నిన్ను ఇక్కడ సబిన్స్పెక్టరుగా పనిచేస్తున్న ప్రణీత్‌కుమార్ ఇంటికి చేరుస్తాను. అక్కడ తప్ప ఈ ఊర్లో ఇంకెక్కడా నీకు నా భర్త బారి నుంచి రక్షణ లభించదు తెల్లవారిన తరువాత అతనే నిన్ను మీ ఊరికి చేరుస్తాడు ఆవిషయం అతను చూసుకుంటాడు'. అన్నది హరిణి

'ఈ రాత్రికి నేనతని ఇంట్లో ఉండాలా?' దిగులుగా అన్నది దాక్షాయణి

ఔను మీ ఊరెళ్లటానికి రేపటిదాకా బస్సులు లేవు అదీకాక నువ్వు ఒంటరిగా వెళ్లటం మంచిదికాదు ఈయన మనుషులు నిన్ను నీడలా వెంటాడి పట్టుకొస్తారు ఈ రాత్రి క్షేమంగా గడవాలంటె నువ్వు అతని ఇంట్లోనే ఉండాలి నువ్వలా దిగులుపడకు మామూలుగా ఉండు ఈయన కనుమానమొస్తే ఇహ నీ పని అయిపోయినట్లే

ప్రణీత్ చాల మంచివాడు నీకేం భయంలేదు అన్నది హరిణి

హరిణి చెప్పినట్లు బలవంతంగా నటిస్తోంది దాక్షాయణి

నేనలా పెరట్లోకెళ్లొస్తాను అంటూ చెంబు తీసికెళ్లాడు పాపారావు

ఆ అవకాశం కోసమె ఎదురు చూస్తోంది హరిణి కనీసం అరగంటదాకా రాడతను

దాక్షాయణిని వెంటబెట్టుకుని దొడ్డి దార్న వెంటబడి, రహస్యంగా ప్రణీత్ ఇంటికి చేరుకుంది హరిణి అతనింటికి తాళం వేసి ఉంది

ఒక్కసారిగా నిస్పృహ, నిస్సత్తువా ఆవరించిందామెను మోకాళ్లు వచ్చుపడ్డట్లయ్యాయి

దాక్షాయణి కళ్లు వర్షించసాగాయి

"ఎవరు కావాలమ్మా?" అంటూ వచ్చాడు అప్పుడే బయట నుంచొచ్చిన రాంబాబు

అతను ప్రణీత్‌కి ఫ్రెండు స్పేఎన్ రైటరు

'ఎస్ ఐ గారు లేరా?' అన్నది హరిణి

లేరు అన్నాడు రాంబాబు

'ఇంట్లోవాళ్లు?

అంతా కలిసి పెళ్లికెళ్లారమ్మా మా ఎస్ ఐ గారు మాత్రం ఈ రాత్రికి వచ్చేస్తారు మీకేం కావాలి? మీరెవరు?

'నేను పాపారావు భార్యని'

ఆశ్చర్యంగా చూశాడు రాంబాబు

ఈవిడకి ఎస్ ఐ గారితో ఏం పని! ఈ పిల్లెవరు?

దాక్షాయణి గురించి తన భర్త గురించి చక చకా చెప్పింది హరిణి

"ఎస్ ఐ గారు లెరు ఇప్పుడు నేనేం చెయ్యాలి? అన్నది

'మీరేం భయపడకండి ఇంటి తాళాలు నాకు ఇచ్చి వెళ్లారు వాళ్లు నేను తలుపు తీస్తాను ఈమెను నిశ్చింతగా ఎస్ ఐ గారి రూంలో పడుకోమనండి తలుపేసుకుని నేను బయటనే పడుకొంటాను కానిస్టేబుల్ కూడా ఉంటాడు ఏ అర్ధరాత్రికో ఆయన రానే వస్తారు మిగతా విషయాలు ఆయన చూసుకుంటారు" అన్నాడు రాంబాబు

"ఈ విషయం రహస్యంగా ఉంచాలి ముఖ్యంగా ఈమెను నేనే ఇక్కడికి తెచ్చినట్లు ఎవరికీ తెలియకూడదు

అలాగేలేమ్మా ఈమెనిక్కడుంచి మీరు నిశ్చింతగా వెళ్లండి"

వెళ్లిపోతున్న హరిణి చెయ్యి పట్టుకుంది దాక్షాయణి-

'ఇక్కడ భయముండదా?' అంటూ

'ఏం భయముండదు ఆయనచాలా మంచివారు నువ్వు హాయిగా నిద్రపో నే వెడతాను ఆలస్యమయితే మళ్లీ మా ఆయన కనుమానమొస్తుంది.' అని, రాంబాబు నింకోసారి హెచ్చరించి వెళ్లిపోయింది హరిణి

తలుపు తాళం తీసి "నువ్వీ గదిలో పడుకోమ్మా లోపల బోల్టు వేసుకో నేను బయట పడుకుంటాను తెల్లారేలోగా మా ఎస్. ఐ గారొచ్చేస్తారు" అని దాక్షాయణికి ప్రణీత్ గది చూపించి, బయట మంచం వేసుకుని పడుకున్నాడు రాంబాబు .

★ ★ ★ ★ ★ ★

క్షణం తీరిక లేనిదానిలా వంటపనిలో మునిగిపోయింది హరిణి ఆమె మనసు మాత్రం పాపారావు రియాక్షన్ కోసం టిన్షన్‌గా ఎదురు చూస్తోంది.

ఇద్దరు పిల్లలు సీరియస్‌గా హాల్లో కూర్చుని పెద్దగా చదువుకుంటున్నారు

పాపారావు దొడ్లోకొచ్చి కాళ్లు కడుక్కుంటున్న అలికిడి వినగానే .. ఆఖరు పిల్లను ఒక్కటంటించింది హరిణి ఆ పిల్ల ఆరున్నొక్క రాగం అందుకుంది

"ఏమిటే? ఏమిటా గొడవ?' తువ్వాలుతో కాళ్లు తుడుచుకుంటూ అన్నాడు

## “క్రింద పడిపోతే నన్ను పట్టుకుంటావా, నాన్నా?”



తనంతట తనే క్రింద పడటంలోని ఆ ఉద్రేకం
ఏదైనా తప్పు జరిగినప్పుడు మీరు సహాయ
పడతారనే ఆ విశ్వాసం. పిల్ల ఎప్పుడూ
నిన్నే చూస్తూ ఉంటుంది. ఆటలో చదవటంలో
ప్రేరణ, భద్రతల కొరకు వాటి నన్నిటిని
మీరు సమకూర్చగలరా? జీవితం లోని
అత్యంత కీలకమైన దశలో మీ సహాయం
సిద్ధంగా ఉంటుందా? పెద్ద చదువులు
చదవటానికి, జీవితంలో స్థిరపడటానికి,
వివాహం మున్నగు వాటికి సమయం వచ్చి
నప్పుడు? నేడే భీమా చేయండి.
మీ కుటుంబానికి భద్రత
చేకూర్చడానికి నేటి ఆలోచనపైననే
భవిష్యత్తు ఆధారపడి ఉంటుంది.
జీవిత భీమా—మీ ప్రేమకి—మీ
ఆప్తులు, ప్రియ పాత్రుల కొరకు
అర్థవంతమైన రూపం.

NPS-LIC-TE

**అధిక బోనసుతో జీవిత భీమా**
**ఇప్పుడు మరింత ఆకర్షకరం**




## లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా

**30 సంవత్సరాల ప్రజల సేవలో**

# గడుసులోకం —బాపు







## ఒడిలో చెలి మోహన రాగం

పాపారావు

'ఏముంటుంది నా శ్రాద్ధం! కాళ్ళకీ వేళ్ళకీ అడ్డంపడుతూ ఒక్క క్షణం నిశ్చింతగా ఉండనివ్వదిది ఈ ఇంట్లో వెధవ చాకిరీ ఎంత చేసినా తరగదు గంట నుంచీ వంటింటినే కావలించుక్కూర్చున్నా ఇంకా వంటయి చావలేదు. వెధవ సంత" పెద్ద గొంతుతో విసుక్కుంది హరిణి

"ఇలాతే దాన్ని అన్నాడు పాపారావు.

"కాసేపు పిల్లను పట్టుకోమనండి. మీరేం ఎత్తుకుంటారుగానీ" అన్నది హరిణి.

"దాక్షాయణీ", అంటూ హాల్లోకెళ్ళి .. వరండాలో, గదిలో, వాకిట్లో చూసి, హరిణి దగ్గరకొచ్చి 'ఆ పిల్లేదీ?' అన్నాడు పాపారావు

'ఇందాకట్నుంచీ తనూ పిల్లలదగ్గరే కూచుని వుంది గదిలోకెళ్ళి పడుకుందేమో చూడకపోయారా?" అన్నది హరిణి

'చూశాను లేదు

"ఆ కుర్ర వెధవల్నడగండి!"

పిల్లలదగ్గరకెళ్ళి అడిగాడు పాపారావు

"బయటకెళ్ళింది నాన్నా ఎవరో ఒచ్చి పిలిచారు' అన్నారు వాళ్ళు.

"ఎవరొచ్చారు? ఈ ఊర్లో దానికెవరు తెలుసని? బయటకు దేనికెళ్ళింది?" ఆదుర్దాగా అన్నాడు పాపారావు

"ఏమో . అన్నారు వాళ్ళు

"పిలిచిందెవరూ? ఆడా మగా?"

"ఎవరో మగాయనే

"ఎంతున్నాడు?'

'కీనీడలో మాకు సరిగ్గా కనపడలేదు'

"మీతో ఏం చెప్పింది?"

"మళ్ళీ ఇప్పుడే వచ్చేస్తాను మీరు చదువుకుంటూ వుండండి" అని చెప్పింది"

"ఆ సంగతి లోపల చెప్పక్కర్లా?"

"మాకేం తెలుసు? ఆవిడ చెప్ప లేదుగా? మాకు రేపు ఎగ్జామ్ ఉంటే చదువుకుంటున్నాం'

పొంగివస్తున్న నవ్వును బలవంతాన ఆపుకుంటోంది హరిణి.

"పర్లేదు! పిల్లలు బాగానే యాక్ట్ చేస్తున్నారు" అనుకుంటూ తనూ ఆదుర్దాప్రకటిస్తూ హాల్లోకెళ్ళింది హరిణి

"వాళ్ళ వాళ్ళెవరన్నా వచ్చారేమో. చెప్పి వెళ్ళొచ్చుగా? చొక్కా వేసుకుని వెళ్ళి అలా వీధి చివరిదాకా చూసి రండి' అని, భర్తకు సలహా యిస్తూ పిల్లలవేపు తిరిగి "ఎంతసేపయిందిరా వెళ్ళి?" అన్నది హరిణి.

"అయిదు నిముషాలు కూడా కాలేదు". అన్నారు వాళ్ళు.

బయటకెళ్ళి ... ఒక గంట తరువాత దిగులుగా తిరిగొచ్చాడు పాపారావు

"ఏమయింది?" అన్నది హరిణి

"లేదు" అన్నాడు పాపారావు.

"ఇంతలో ఎక్కడికి పోతుంది?"

"ఏమో దరిద్రపు ముండ. బస్టాండులో మన మనుషుల్ని పెట్టి వచ్చాను. ఎటు పోయి చస్తుందిలే. ఎక్కడికెళ్ళినా. తిరిగి తిరిగి బస్టాండుకు రావలసిందే గదా. మన వాళ్ళకి దొరక్కపోదు. దొరకనీ . దాన్ని గుంజక్కట్టేసి కంట్లో కారం కొడతాను " కసిగా అన్నాడు పాపారావు

చిక్కినట్టే చిక్కి అంతలో చేయి జారిపోయిన దాక్షాయణినీ . ఆమె అందాన్ని తలుచుకుంటే నిరాశగా.. ఉక్రోషంగా ఉందతనికి.

అంత క్రిత మెప్పుడూ ఇలాంటి పనులు చెయ్యలేదు గనుక హరిణి మీద అనుమానం రాలేదతనికి పిల్లల మాటలు కూడా ఆ అనుమానం రాకుండా అడ్డుపడ్డాయి..

ఆ రాత్రి తెగతాగి తిట్టిన తిట్టు తిట్టకుండా దాక్షాయణిని బంద బూతులు తిడుతూ కూర్చున్నాడు పాపారావు ఈ అవమానం అతనిలో అగ్నిని రగిలిస్తోంది. ఏ క్షణంలో తనవాళ్ళు పిల్లను పట్టి తెస్తారా అని ఎదురు చూస్తూ కూర్చున్నాడు.

"ఎంతసేపు దాక్కోగలదు? తననుకాదని ఈ ఊర్లో ఎవరూ దానికి ఆశ్రయం ఇవ్వరు.

అల్ప్పాల్! ఒక దిక్కులేని అడపీనుగు! తనకే టోకరా ఇచ్చి పోతుందా! పదిమందితో వరసగా రేప్ చేయించాలి దాన్ని. అప్పటికిగానీ తన పగ చల్లారదు

ఈ రాత్రి తలుచుకుని ఎంత మురిసి పోయాడు ఉదయం నుంచీ! ఇప్పుడిహ చచ్చినట్టు హరిణి ముండతో గడపక తప్పదు. థూ!" అనుకుంటూ నాన్ కోపరేటర్‌లా, తన అధికారాన్ని ధిక్కరించి పారిపోయిన దాక్షాయణిని తలుచుకుని ఉడికి పోతున్నాడు పాపారావు...

అతని ఆలోచనలను పసిగడుతున్న హరిణి ఉప్పెనలా వస్తున్న నవ్వును అణచుకోలేక అవస్థ పడుతోంది .

ఇన్నాళ్ళకి తను కూడా మొగుణ్ణి ఏడిపించగలిగింది!

"ఎక్కడికిపోయి ఉంటుందంటావ్? అసలు . ఉన్నట్టుండి దానికా బుద్ధెందుకు పుట్టింది ఆ వచ్చిన వెధ వెవడు?" అన్నాడు పాపారావు.

తెగ తాగేసి, చెడ వాగడం అలవాటతనికి..

"ఏమో! ఎవడో ఆ పిల్లకు తెలిసినవాడే అయిఉంటాడు. వాడూ మిమ్మల్ని ఫాలో అయివచ్చి.. .. పొద్దు గూకిందాకా వేచిఉండి చీకటిపడ్డాక వచ్చి

తీసికెళ్ళాడేమో! అయినా... ఈ ఊళ్ళో ఎక్కడ దాక్కోగలరు? అమాయకంగా అన్నది హరిణి.

"ఎక్కడికి పోతుందిలే! ఏ అర్ధరాత్రికో బయటపడుతుంది ఇదేమన్నా సిటీనా? మనవాళ్ళు మేకపిల్లను మోసుకొచ్చినట్లు మోసుకొచ్చి పడేస్తారు అప్పుడిహదాన్ని నాతోనే చెలగాట మాడుతుందా! చూపిస్తా నా తడాఖా!" అని బుసలు కొడుతున్న మొగుణ్ణి చూస్తూ నీ మొహంలే అవతలి ప్రత్యర్థి ప్రణీత్ అతన్ని నువ్వేం చెయ్యలేవు ఆ పిల్ల మీకు దొరకటం కల్ల ఈ సంగతి తెలిస్తే గుండె పగిలి అవమానంతో చస్తావ్!" అనుకుంటోంది హరిణి

"అన్నంపెట్టనా?" అన్నదామె

"ఒద్దు తిండితింటే కిక్కుపోతుంది ఆ ముండ దొరికి దాన్ని చీల్చి చెండాడే వరకూ ఈ కిక్కిలాగే ఉండాలి"

హరిణికి నిద్రొస్తోంది కానీ పాపారావు తనను నిద్రపోనివ్వడు తాగినప్పుడు తన వాగుడును భరించటానికో తోడుండాలతనికి

ఒంటరిగా కూచుని నోర్మూసుకు తాగలేడు ఎవరూ లేకపోతే చచ్చినట్లు హరిణి అతని ఎదురుగా కూర్చుని ఆ వాగుడును భరించాల్సిందే లేకపోతే నానా రభసా చేస్తూ పిశాచంలా ప్రవర్తిస్తాడు

మనిషి ఈ తాగుడును దేనికి ఆశ్రయిస్తాడో అర్థంకాదు హరిణికి.

"తనలో ఉండే ఆటవిక ప్రవృతిని వెలికితీసి... లోపలదాగిఉన్న అసహ్యపు ఆలోచనల్ని బయటకులాగి, ఎదుటి మనిషికి వికారాన్నీ జుగుప్సనీ కలిగించే గుణం ఈ తాగుడుకుందని తెలిసీ దాన్నే ఎందుకాశ్రయిస్తాడు?

అన్నిటినీ సహనంగా భరించే భార్యకూడా తన నసహ్యించుకునే స్థితి కెందుకు దిగజారతాడు?

ఎన్నాళ్ళో కష్టపడి నిర్మించుకున్న ఒకస్థాయినీ. గౌరవాన్నీ మంటకలిపి తన మీద తనే కంట్రోల్ పోగొట్టుకునేలా చేసి, తనకు బానిసను చేసుకుని వెర్రి వెధవలా ఆడించే ఈ ఆల్కహాల్‌ను మనిషి ఎందుకింతగా కోరుకుంటాడు? గొప్పకోసమా? అదో స్టేటస్ సింబలా? దాన్నాశ్రయిస్తే తప్ప కిక్కు రానంత అసమర్థుడా మనిషి?

కష్టపడే వాడినీ ప్రశ్నవేస్తే తన కష్టాన్ని మర్చిపోవటానికి తాగుతున్నానంటాడు!

ఏం మర్చిపోతున్నాడు? తాగివచ్చి, పెళ్ళాన్ని తిట్టీ, తన్నీ బజార్న పడేసి, ఇల్లంతా భీభత్సం చెయ్యటంలో తన కష్టాన్ని మర్చిపోతున్నాడా?

సంపాయించిందంతా కల్లుపాకలో బోర్లించి, తెల్లారి తనతోపాటు పెళ్ళాం బిడ్డల్ని కూడా పస్తుంచటంలో కష్టాన్ని మర్చిపోగలుగుతున్నాడా?

భార్య కష్టపడి కూలీనాలీ చేసి సంపాయించిన డబ్బుల్ని కూడా తన తాగుడుకివ్వమని వేధించి, హింసించటంలో కష్టాన్ని మర్చిపోతున్నాడా?

ఎందులో మర్చిపోతున్నాడు?

ఒకస్థాయిలో ఉన్నవాడి నడిగితే మానసికమైన ఒత్తిడినించి తప్పించుకోటానికంటాడు

మందుకొట్టి, కామ్‌గా పడుకుని, ఆ ఒత్తిడి నుంచి తప్పించుకుని రిలాక్సేషన్ పొందే వాళ్ళెంతమంది ఉన్నారు?

తాగి, కొంపను రణరంగంగామార్చి, రాక్షసుడిలా తల్లిని పీక్కుతినే తండ్రుల్ని చూసి జడుసుకుని, అసహ్యించుకునే స్థితికి తమ బిడ్డల్ని దిగజార్చే మగవాళ్ళే ఎక్కువ ఈ సమాజంలో గర్భశతృవైన తాగుడునే ఆత్మీయుడిగా, మిత్రుడిగా ప్రాణంగా భావించి తన సంపాదననూ, మానాభిమానాల్ని దానికే ధారపోసి మానసికమైన మార్దవాన్ని కోల్పోయే మూర్ఖత్వం ఈ మనుషుల్లో ఎప్పటికి నశిస్తుంది?

తనలాంటి హరిణుల చరిత్రల్లో ఎప్పటికి వెలుతురొస్తుంది?'

పాపారావు ఎదురుగా కూర్చుని యాంత్రికంగా అతని మాటలకు ఊ కొడుతున్న హరిణి ఆలోచనలెప్పుడూ ఇలాగే ఉంటాయి.

అతనిమీద ఏవగింపు పెరగటమేతప్ప ఇందుకు పరిష్కార మార్గం తోచదామెకు.

(ఇంకా ఉంది)


అలా ముందుకెళ్ళు బాబూ—
ఇది నాగార్జున సిమెంట్‌తో
కట్టిన ఇల్లు!!
MAM-44

## వ్యక్తిగతం



కేంద్ర న్యాయ శాఖా మంత్రి శ్రీ అశోక్‌సేన్ (72) స్వయంగా ఒక వివాదంలో చిక్కుకున్నారు. కలకత్తాలో సంపన్న వర్గాల వారు నివసించే అలీపూర్ ప్రాంతంలో ఆయనకు గల ఆరంతస్తుల విలాసవంతమైన పెన్‌కోర్ట్ అనే భవనానికి సంబంధించిన ఆస్తి పన్ను వగైరాల కింద ఆయన కలకత్తా మునిసిపల్ కార్పొరేషన్‌కు ఏడులక్షల తొంభైవేల రూపాయలు బాకీ పడ్డారు. ఆ భవనం పక్కనే మరో పదకొండు అంతస్తుల భవనాన్ని నిర్మించేందుకు ఆయన భార్య శ్రీమతి అంజనా సేన్ సంపాదించిన అనుమతి తప్పుడు సమాచారం ఆధారంగా సంపాదించారని మునిసిపల్ కార్పొరేషన్ భావిస్తున్నది. శ్రీమతి అంజనాసేన్ నిర్మించే భవనంవల్ల తాము 'పెన్‌కోర్ట్'లో కొనుక్కున్న నివాస గృహాల వసతులు దెబ్బ తింటాయని, ఆ నివాసులు పెట్టుకున్న దరఖాస్తును అలీపూర్ జిల్లాజడ్జి ఆమోదించారు. శ్రీమతి అంజనాసేన్ తలపెట్టిన భవన నిర్మాణాన్ని ఆపివేయాలని ఆదేశించారు... □



నెహ్రూ కుటుంబానికి మిత్రుడు, సన్నిహితుడు ఐన మహమ్మద్ యూనస్ ప్రస్తుతం ట్రేడ్ ఫెయిర్ అథారిటీ అధ్యక్షుడుగా ఉన్నారు. ఆయన కుమారుడు ఆదిల్ షార్యాన్‌కు చట్ట వ్యతిరేకంగా పేలుడు పదార్థాలు తయారు చేసినందుకూ, ఒక నౌకను పేల్చివేయడానికి ప్రయత్నించినందుకూ అమెరికాలో 35 సంవత్సరాల జైలుశిక్ష విదించారు మూడు సంవత్సరాలు శిక్ష అనుభవించాక, 1985 జూన్ 11 న ప్రధాని రాజీవ్ గాంధీ అమెరికా పర్యటన సందర్భంగా అమెరికా ప్రభుత్వం ఆదిల్‌కు క్షమాబిక్ష ప్రసాదించి విడుదల చేసింది నిన్నటి పేలుడు పదార్థాల తయారీదారు నేటి కంప్యూటర్ పారిశ్రామికవేత్త అయిపోయాడు తండ్రి అధ్యక్షుడుగా ఉన్న ట్రేడ్ ఫెయిర్ ఆవరణ ప్రగతి మైదాన్‌లో ఆయన 'ఇందిరాగాంధీ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కంప్యూటర్ ఎయిడెడ్ నాలెడ్జ్ అనే సంస్థను తెరిచాడు తనకూ, తన తండ్రికీ ఉన్న పరపతినంతా వినియోగించుకుని ఆయన కంప్యూటర్ల దిగుమతిపై కస్టమ్స్ సుంకాన్ని తప్పించుకున్నాడు లాభం ఆశించని సంస్థగా ప్రచారం చేసుకునే ఈ సంస్థ కేంద్ర ప్రభుత్వ ఎలక్ట్రానిక్స్, టెలిఫోన్స్, ఆర్థిక, వాణిజ్య, విదేశ వ్యవహారాల శాఖలనుంచి ఉచిత సహాయాన్ని పొందింది కాని లాభంకోసమే నడుపుతున్నామని చెప్పుకునే సంస్థల్లో ఫీజులకూ ఇక్కడ ఫీజులకూ తేడా ఏమీలేదు... □

## వారఫలం

### 9-1-1987 శుక్రవారం మొదలు
### 15-1-1987 గురువారం వరకు

★ **మేషం:** అయిదారు విధాలా మేలు జరుగుతుంది పది మందిలో ప్రతిష్ఠ అధికమవుతుంది బారీ వ్యాపారం చేసేలాగైతే సర్వానుకూలత చేకూరుతుంది ధన లాభానికి అనువైన దినం. ధనవంతుల ప్రాపకం చిక్కుతుంది స్త్రీలకు వృత్తి యందు ప్రగతి, సాహస కార్యాలకు తగిన శక్తి యుక్తులు చేకూరుతాయి

★ **వృషభం :** మంచి గ్రహానుకూలత గల వారం ప్రసిద్ధులను కలిసే అవకాశమున్నది వృత్తి యందు అనుకూలత గలదు రాజకీయవాదులకు చెప్పరాని యిబ్బందులుండగలవు గమనించాలి స్త్రీలకు ఆశించిన విదంగా మేలు చేకూరటం, అభిమానించే వారి వలన మేలు చేకూరుట గమనించాలి

★ **మిథునం :** ఎవరి చేతనో చిక్కిన డబ్బు వసూలు చేసికొనుటకు అవకాశం ఏర్పడుతుంది కళారంగాన సదవకాశాలు లబ్యమయ్యే మార్గమున్నది మాటకు గౌరవం ఏర్పడుతుంది సాటివారిలో ప్రసిద్ధి ఏర్పడుటకు అవకాశమున్నది అన్నివిదాలా అనుకూల స్థితి ఏర్పడుట గమనింపదగిన అంశం స్త్రీలకు రాజకీయంగా ఏమాత్రం బాగుండదు, ఆదాయ లోపం కనిపిస్తుంది

★ **కర్కాటకం :** గ్రహానుకూలత గల వారం వెనుక, మధ్యలో వదిలిన వ్యవహారాలు గాని, కార్యక్రమం గాని, సానుకూలమయ్యే వారం చాల విధాల మేలు చేయగల వారి సహాయ సంపత్తులు అమరుతాయి ఆరోగ్యం కూడా క్రమాభివృద్ధినందుట గమనించాలి 'లాటరీ'లందు విజయం కొందరకు చెప్పదగిన ముఖ్యాంశం స్త్రీలకు ఉద్యోగ రీత్యా ప్రగతి

★ **సింహం :** మాటకు విలువ పెరుగుతుంది సభా మర్యాద కొందరకు చెప్పదగిన అంశం పదిమందిలో ప్రతిష్ఠకు ఆకరమైన వారం ప్రయాణ మూలంగా కూడా ఏదో మేలు జరుగుట గమనింపదగిన అంశం వృత్తి యందు వికాసమున్నగి మాటకు విలువ పెరుగుట గమనింపదగిన అంశం స్త్రీలకు అనుకొనని ప్రయాణాలకు, విందు వినోదాలకు ఆస్కారం

★ **కన్య :** దూరబారాల నుండి బందువులు గాని మిత్రులు గాని యింటికి రావచ్చు శుబకార్య ప్రస్తావనలతో కాలక్షేపం కొందరకు హటాత్తుగా ప్రయాణాలు తగులుట కూడ గమనింపదగిన అంశం స్త్రీలకు ఆర్థికంగా మేలు, వృత్తి యందు ఆనందం, ఆరోగ్యమందు అభివృద్ధి

★ **తుల :** నూతన విధానమేలున్నది. కృషి రాణిస్తుంది ప్రత్యర్థుల గొడవ తగ్గుతుంది సభా మర్యాద, పత్రికా ప్రశంసలకు అవకాశమున్నది వృత్తి యందు అంతో యింతో మేలు చేకూరుతుంది రాజకీయంగా ఏ విదంగా మేలు కాదని గ్రహించాలి సంఘ సేవాపరాయణత్వంతో కాలం వ్యయించకండి దేనికైనా పరిమితి అవసరం స్త్రీలకు వస్తు సేకరణ, ఉద్యోగంలో అనుకూలం

★ **వృశ్చికం :** ప్రయత్నించి ఒకానొక వ్యవహారమందు విఫలురు కాగలరు అందినట్లే అంది డబ్బు జారిపోతుంది చేజిక్కిన అవకాశాలు జారిపోతాయి ఇరుగుపొరుగు గొడవలు ఉండవచ్చునేమో! స్థితిగతులందు లోపం ఏర్పడవచ్చు, ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిది స్త్రీలకు వస్తు సేకరణకు అనుకూలం కళారంగాన ఉపకారం జరుగుతుంది, గ్రహించండి

★ **ధనుస్సు :** గ్రహించండి శని ప్రభావం మీ మీద పడుతున్నది చాల మందికి ఆరోగ్య లోపం చెప్పవచ్చు కొందరకు ఎంతో కాలంగా అనుకొంటున్న శస్త్రచికిత్సకు అవకాశమున్నది ఏవైనా వస్తువులు, యిరుకు యిబ్బందులకు కొందరు అమ్మగలరేమో! నిదానించి చూడాలి స్త్రీలకు ఉద్యోగ రీత్యా బాగుండదు గడ్డు వారంగా కనిపిస్తుంది

★ **మకరం :** మీ కార్యదీక్ష ఫలిస్తుంది 'గురు, శనులు' సహాయకారులు సర్వాభీష్ట సిద్ధికి దోహదం చేస్తారు ఎంతటి మహత్కార్యమైనా సాధించి తీరుతారు 'సినీ' రంగాన మీ ప్రతిభ భాసించు అవకాశాలున్నాయి మీరు రచయితలా? పత్రికాధిపతులా? గాయకులా? ఇలాంటి వర్గానికి చెందిన వారైతే సర్వాభీష్టం చేకూరుతుంది స్త్రీలకు రచన, నటన, నాట్య విధానాలందు మేలున్నది

★ **కుంభం :** చెప్పరాని ఖర్చులు తగులుతాయి కొన్ని పుణ్యకార్యాలకే కావచ్చు గ్రామాల నుండి బంధుమిత్రులు రానున్నారు యత్న కార్యసాధనకు యింకా కొంత కాలం పట్టవచ్చు ముఖ్య విషయాలు పరిష్కారం కూడా ఈ వారం జరుగుతుందనే నమ్మకం లేదు స్త్రీలకు వృత్తి యందు సంకటం, ధన లోపం, అనవసరంగా గొడవలు

★ **మీనం :** విశాలమైన, చాల బరువైన, కష్టసాధ్యమయిన ఊహలుంటాయి అమలు చేయటం కష్టసాధ్యం కారణం ధనలోపం, కార్యదీక్షా లోపం అంతా 'రాహు' గ్రహచర్య స్వల్పంగా ధనాదాయముంటుంది స్థితిగతులందు లోపం ఏర్పడుట, యిలాంటి పరిస్థితులలో సహజమే కదా! స్త్రీలకు నగలు గాని, వస్తువులు గాని, చివరకు ముఖ్య కాగితాలు గాని పోగొట్టుకొంటారేమో! జాగ్రత్త!

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి




అవధానుల సుధాకర రావు

ఇది ఉపోద్ఘాతమా? లేక కథలో భాగమా? అన్న మీమాంస అనవసరం, అప్రస్తుతం 'దీపావళి కథల పోటీ' ప్రకటన చూడ్డంతోనే - కావేరి నా మనసులో మెదిలింది ఆమె మా మామయ్యగారి కూతురు నాకంటే వయసులో రెండేళ్లు పెద్దది ఆమె జ్ఞాపకాలు నా గుండెని ఆర్ద్ర పరుస్తాయి మొదట్నుంచీ నే నామెని నా కథా వస్తువుకి పనికొచ్చే ఓ ముఖ్య పాత్రగా భావిస్తూ, ఆమె గురించి నిశితంగా ఆలోచిస్తూ వచ్చాను ఆమె గురించి కథ రాయడానికి పూనుకోవడం - రచయితగా నా శక్తిని నేను పరీక్షించుకోవడమే నా ప్రతిభకి ఇదొక 'సవాలు' అనొచ్చునేమో కూడా' కారణం. కావేరి జీవిత కథ సాధారణమైంది కాదు ఆమె అంతరంగపు లోతుల్లో దాగిన వ్యథ వేదన . ఆవేదన - కాగితంమీద పరచి, కథా రూప మివ్వడం కత్తిమీద సాములాంటిది

మామూలు మనుషులకి కావేరి ఓ సామాన్య యువతి ఆమెలో ఎలాంటి ప్రత్యేకతా లేదు ఆమె తల్లిదండ్రులకి మొదటి సంతానంగా జన్మించింది ఆ తరువాత వరుసగా నలుగురూ ఆడపిల్లలే మగ సంతానం కోసం ఎదురు చూసి, చూసి - ఆశ నిరాశ చేసుకుని తమకా ప్రాప్తం లేదని సరిపెట్టుకున్నారు మొదటిసారిగా జన్మించిన ఆడపిల్ల 'మహాలక్ష్మి' సమానురాలు - అనే ఓ (పిచ్చి) నమ్మకం మనవాళ్లలో ఇంకా మిగిలి వుండ టంవల్ల - కావేరి బాల్య జీవితం మహా వైభవంగా సాగిపోయింది అంతే ఆమె జీవితంలో మంచి రోజులు, అదృష్ట రేఖలు అన్నీ ఆ పసితనంలోనే అంతమయ్యాయి ఐదేళ్ళ చిరుతప్రాయంనుండే ఆమెకి విషమ పరిస్థితులు, గడ్డు సమస్యలు ఎదురవడం ప్రారంభమయింది కన్న తల్లిదండ్రులే ఆమెని నిరాదరించి, ఈసడించుకునే దురదృష్టం పట్టిం దామెకి అందుకు ముఖ్య కారణం - వాళ్ళకి రెండో సంతానంగా జన్మించిన హిమబిందు ఆ పిల్ల చక్కదనంలో చందమామతో పోటీ పడుతుంది. ఆ అమ్మాయి పుట్టిన తర్వాత - కావేరి కురూపితనం, అనాకారితనం వాళ్ళకి స్పష్టంగా, భూతద్దంలోంచి చూపెట్టినట్లుగా కన్పించసాగింది అది నిజం కూడా చూసినవాళ్ళు కూడా ఆ పిల్లలిద్దరూ ఒక తల్లికి పుట్టినవాళ్లే అంటే అపనమ్మకంగా చూసేవారు కావేరిని ఐదోఏట గవర్నమెంటు స్కూల్లో చేర్పిన ఆ తల్లిదండ్రులే - హిమబిందుకి మూడో ఏడు రాగానే బోలెడు డబ్బు 'డొనేషన్' కట్టి ఆ పిల్లని మంచి పేరున్న ఇంగ్లీషు మీడియం స్కూల్‌లో 'నర్సరీ'లో చేర్పించి తమ పక్షపాతబుద్ధిని ప్రదర్శించుకున్నారు అంతటితో ఆగలేదు ఇంటికొచ్చిన ప్రతివాళ్ళకి 'హిమబిందు'ని చూపించి 'మా రెండో అమ్మాయి " అంటూ గొప్పగా చెప్పుకునేవాళ్లు "చాలా తెలివిగలది లెండి ఐ ఎ ఎస్ కాని, డాక్టర్ కోర్సు కాని చెప్పిస్తాం అంటూ తమ ఆలోచనలు కూడా బయటపెట్టేవాళ్లు

మరి మీ పెద్దమ్మాయి మాటేవిటి?" అని ఎవరైనా ప్రశ్నిస్తే - "ఆఁ దానిమొహం! దాని గురించి ఇప్పట్నుంచే ఆలోచనలు ఎందుకండీ? పెద్దయ్యాక గంతకుతగ్గ బొంతని చూసేసి ముడి పెట్టేస్తే సరి. మా బాధ్యత తీరిపోతుంది అని సమాధాన మిచ్చేవాళ్ళు. అప్పుడు కావేరి వాళ్ళ పక్కనే వుండేది ఆమెకి ఊహ తెలిసి, వాళ్ళ మాటల సారాంశం బోధపడివుంటే - ఆ అమ్మాయి తట్టుకోగలదా .? తల్లడిల్లిపోకుండా వుండేదా . ?

మొత్తం ఐదుగురు ఆడపిల్లల్లో - హిమబిందుదే మహర్జాతకం ఓ యువ రాణిలా చూస్తారు ఆ అమ్మాయిని యాదృచ్ఛికంగా కొన్ని శుభాలు జరగడంతో - ఆ అమ్మాయి పుట్టిన వేళా విశేషం గొప్పదని, అదృష్ట దేవత తమ రెండో సంతానంగా తమ యింటి గడప తొక్కిందని - వగైరా, వగైరా నమ్మకాలతో హిమబిందుకి ఎక్కడలేని ప్రత్యేకతనీ ఆపాదించేరు

ఆమె తర్వాత పుట్టిన ముగ్గురాడపిల్లలకీ కూడా తగు మోతాదుల్లో ప్రేమాభిమానాలు అందచేయబడ్డాయి

అందర్లోకి ఒక్క 'కావేరి' మాత్రమే శాపగ్రస్తురాలయింది తను చేసిన తప్పేమిటో ఆ అమ్మాయికి ఎంత ఆలోచించినా అర్థమయ్యేది కాదు

స్కూల్‌లో అందరికంటే తనకి అత్యధిక మార్కులొచ్చినప్పుడు - ఆ సంతోషాన్ని యింట్లో అమ్మ, నాన్నలతో పంచుకోవాలని ఆశగా, ఆరాటంగా తను పరుగెత్తుకు వచ్చి ఆయాస పడుతూ చెప్పినప్పుడు - వాళ్ళు కసిరి కొట్టడంలో గల ఆంతర్యం ఆ పసి మనసు కెలా తెలుస్తుంది?

'ఓస్ ఇంతేనా' ఈమాత్రం దానికే ఇంత సంతోషపడాలా ? వెళ్ళి వంటింట్లో పని చూడు " అంటూ పుల్ల విరుపుగా మాట్లాడేసరికి - కావేరి కళ్ళలో నీళ్ళు సుడులు తిరిగేవి ఆమె తల్లి యింట్లో ప్రతి పనికీ కావేరినే సాయం కోరేది మిగతా నలుగురు పిల్లలు హాయిగా ఒకచోట చేరి, కబుర్లు చెప్పుకుంటూ, సరదాగా కాలక్షేపం చేసేవాళ్ళు . ఆ పిల్లలు కూడా కావేరి తమ అక్క అని, తమ కంటే

# ఓ అమ్మాయి కథ

పెద్దదని ఏమాత్రం అభిమానం చూపేవాళ్ళు కాదు "ఒసే ... కావేరీ - నా బట్టలు ఇస్త్రీ చేసి పెట్టవే. " అని ఒకళ్ళు పురమాయిస్తే - మరొకరు "ఏయ్ కావేరీ - మా ఫ్రెండ్ శారదా వాళ్ళింటికి వెళ్ళి కెమిస్ట్రీ నోట్సు అడిగి పట్రా. " అంటూ ఆర్డరేసేవారు ఇలా అందరి పనులతో ఆమె విశ్రాంతి తెలియని యంత్రంలా మారిపోయింది

కావేరిది స్వతహాగా చురుకైన బుర్ర ఆమె ఏకసంథాగ్రాహి ఏ విషయమైనా ఒక్కసారి చెబితే చాలు - ఇట్టే మెదడుకి పట్టేస్తుంది

మిగతా నలుగురు పిల్లలకీ అంత తెలివి, తేటలు లేవు వాళ్ళందరూ కూడా 'ఇంగ్లీషు బడి'లో చదివినా తనకంటే తక్కువ మార్కులే వస్తాయి

కావేరి ప్రోగ్రెస్ కార్డులో అన్నీ ఎనభై మార్కులే అయినప్పటికీ - తండ్రి సణుక్కుంటూ సంతకం పెడతాడు "శ్రద్ధగా చదవకపోతే మాన్పించేసి యింట్లో కూర్చోబెడతా. ." అంటూ బెదిరించేవాడు అదే హిమబిందుకాని, మిగతా పిల్లలు కాని - నలభై మార్కులు తెచ్చుకుంటేనే అదో గొప్ప విషయంగా వాళ్ళని మెచ్చుకుంటూ, 'గుడ్ గాళ్' అంటూ బుగ్గలమీద ఓ ముద్దు పెట్టి, అభినందిస్తాడు . ఈ తేడాలు, తారతమ్యాలు కావేరి మనసుని బాధ పెట్ట సాగేయి

ఆ యింట్లో ప్రతి ఏటా నలుగురు అమ్మాయిల 'బర్త్ డే'లు ఘనంగా, అట్టహాసంగా జరుగుతాయి. మరి తనూ వాళ్ళకి పుట్టిన బిడ్డేకదా! తనని వాళ్ళతోపాటు సమానంగా చూడరెందుకని? ప్రతి పండుగకి కొత్త బట్టలు తెచ్చినప్పుడు - ముందుగా హిమబిందుకి బాగా ఖరీదు పెట్టి మంచి నాణ్యమయినవి కొంటారు ఆ తరువాత ముగ్గురికీ ఒక మోస్తరైన రకంవి, తనకి అంతకంటే చౌక రకంలో మరీ నాసిగా, ఎబ్బెట్టుగా వుండే బట్టలు కొనడానికి ఆ తల్లిదండ్రులకి అసలు ఎలా మనసొప్పిందో .. ?

* * * * * * *

పదమూడో ఏట కావేరి యుక్త వయసులోకి అడుగు పెట్టింది. అది ఆమెకో శాపంగా పరిణమించింది ఆమె తల్లిదండ్రులు కావేరిని బడికి వెళ్ళొద్దని ఆజ్ఞాపించేరు అప్పటి కామెకి వయసంటే ఏమిటో తెలీదు పాపం. చదువుకోవాలని తన కెంత ఉత్సాహం, ఉబలాటం ! హఠాత్తుగా తనకీ శిక్ష ఏమిటో ఆమెకి అర్థం కాలేదు. తల్లితండ్రుల్ని బ్రతిమి లాడింది ప్రాధేయపడ్డది "మీరు చెప్పిన అన్ని పనులు చేస్తూ, ఇంటి పనికి ఏ ఆటంకమూ కలుగకుండా నేను చదువుకుంటాను..." అని వేడుకుంది. ఫలితం శూన్యం వాళ్ళు నిర్దయగా, మొండితనంగా - కావేరి చదువుని ఎనిమిదో క్లాసుతో గట్టెక్కించేరు అప్పట్నుంచీ ఆ అమ్మాయి బ్రతుకు మరింత అధ్వాన్న మయింది. హీనాతిహీనంగా మారింది

'ఫుల్ టైం" పనిమనిషిలామారింది

సరిగ్గా ఆ సమయంలోనే నేను వేసంగి శలవులకి వాళ్ళ ఊరికి వెళ్ళాను అప్పుడు నేను డిగ్రీ స్టూడెంట్‌ని ఆ యింట్లో కావేరి స్థానం ఏమిటో, ఆమె పరిస్థితి ఏమిటో - ఒకరు చెప్పకుండానే నాకు తెలిసిపోయింది. ఆమె పట్ల బేధభావం చూపుతున్న మా అత్తయ్య, మామయ్యల్ని మనసులో అసహ్యించుకున్నాను అక్కడ ఎక్కువ రోజులుండటానికి నా మనసు అంగీకరించలేదు. కావేరి నా మనోభావాల్ని చదివింది రమేష్! నా గురించి బాధపడి నువ్వు మనసు పాడుచేసుకోకు నాలుగు రోజులు సరదాగా గడిపి వెళ్దామని వచ్చావు. నువ్వు సంతోషంగా వుండకపోతే నా కెలాగో వుంటుంది. " అందామె ఆమె మానసిక ఔన్నత్యానికి ముగ్ధుడినయ్యాను. తనమూలంగా ఇతరులు ఇబ్బంది పడకూడదు. అనే భావన ఎంత గొప్పది! ఆ సంస్కారం ఎంతమందికి వుంటుంది!

మా కాలేజీ 'మ్యాగజైన్'లో అచ్చయిన నా కథ చదివింది కావేరి "బాగానే రాసావు రచయితగా భవిష్యత్తులో రాణిస్తావు. ' అంటూ తన అభిప్రాయం చెబుతూ ఇలా అంది 'రమేష్! నా జీవితాన్ని కథా వస్తువుగా ఉపయోగించుకోడానికి నీకు అనుమతి నిస్తున్నాను అయితే ఇప్పుడుకాదు. రచయితగా నీవు కాస్త అనుభవం సంపాదించి చెయ్యి తిరిగేక .. అప్పుడు నా కథ రాయి ఆ కథ నేను చూసినా, చూడకున్నా పర్లేదు. అప్పటికల్లా ఒకవేళ నేను చనిపోయినా - నీ కథవల్ల ఎప్పటికీ సజీవంగా వుంటాను కదా!

నీకు తెలీదు రమేష్! నా యిల్లే నాకు చెరసాల. నా వాళ్ళే నాకు శత్రువులు

ఓ పాత తెలుగు సినిమా పాట నువ్వు వినే వుంటావు

"ధరణికి గిరి భారమా . గిరికి తరువు భారమా .
కనిపెంచే తల్లికి - పిల్ల భారమా .

లోకంలో సహజమైన విషయాన్నే ఆ కవి తన పాటలో పొందుపరిచేడు కాని. రమేష్ విచిత్రం ఏమిటో - నా వరకూ వచ్చేసరికి ఆ సహజత్వం తిరగబడింది.... అంటూ తన దురదృష్టాన్ని



సూపర్‌స్టార్ **కృష్ణ** నటించిన



**విజయపద్మాలయా పిక్చర్స్**





# తండ్రీకొడుకుల ఛాలెంజ్

దర్శకత్వం
**ఎమ్.మల్లికార్జునరావు**

నిర్మాతలు
**ఎమ్.వి.రామారావు,ఎ.రాముదాసు**

సహనిర్మాత: ఎమ్.కృష్ణారావు • పరుచూరి బ్రదర్స్ • చక్రవర్తి • పి.ఎస్.ప్రకాష్ • కోటగిరి గోపాలరావు • సలీం.

PADMALAYA ADS.



**తాజా వార్తలకు**

**నిజమైన వార్తలకి**

**న్యాయమైన**

**వ్యాఖ్యలకి**

# ఆంధ్రపత్రిక

**చదవండి!**


# భారతి

## కథలు రాసేవారికి మనవి.....

భారతిలో ప్రచురణకి పరిశీలనార్థం చిన్న కథలు పంపవలసిందిగా రచయిత(త్రు)లకి మనవి చేస్తున్నాము.

రచనలు కాగితానికి ఒకవైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి.

కథలు 12 అరఠావు కాగితాలకి మించకుండా ఉంటే మంచిది.

అనువాదాలు, అనుసరణలు పంపరాదు.

ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా గల కవరు జతపరచి పంపాలి.

రచనలని సంపాదకుడు, భారతి, సాహిత్య మాసపత్రిక, ఆంధ్రపత్రిక కార్యాలయం, గాంధీనగరం, విజయవాడ – 520003. అన్న చిరునామాకి పంపాలి.

నిందించుకుంది కావేరి

* * * * * * *

కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి నా చదువు పూర్తి కావటం. అదృష్టం కొద్దీ వెంటనే 'సెక్రటేరియట్'లో వుద్యోగం రావడం ఆ తర్వాత వివాహం జరిగి జీవితంలో సెటిల్ కావడం కూడా జరిగేయి మరి కావేరి సంగతేమిటి? నో ఛేంజ్ ఏ మార్పు లేకుండా అలాగే అవివాహితగా మిగిలివుంది

ఆమె గురించి తల్చుకుంటే భయం. బాధ... దిగులు కారు మేఘాల్లా కమ్ముకుంటాయి నన్ను. ఆమె జీవితం అన్యాయమయిపోతుందే.. అన్న ఆందోళన నన్ను క్రుంగదీసేది

హిమబిందుకి బ్యాంకిలో 'ప్రొబేషనరీ ఆఫీసర్'గా వుద్యోగం వచ్చింది అప్పట్నుంచి ఆమె ఓ 'దేవత' అయిపోయింది మా అత్త మామయ్యలకి

హిమబిందు గర్విష్టి, అహం, పొగరు. ఆమె నర నరాన జీర్ణించుకుని వున్నాయి ఇప్పుడీ రకంగా తన దశ తిరగడంతో ఆమెకి కళ్ళు నెత్తికెక్కాయి.

ఉద్యోగ రీత్యా ఆమెని ఆదిలాబాద్ వేసారు అక్కడి కామె తనతో పాటు కావేరిని కూడా తీసుకు వెళ్ళింది. తనకి వేళ పట్టున వుండి వడ్డించడానికి తన పనులన్నీ చేసి పెడుతూ, కూలి దానిలా పడివుండా లక్కడ కావేరి

హిమబిందు తనతో పాటు బ్యాంకిలో పనిచేసే ఓ కుర్రాడితో ప్రేమలో పడింది ఇరు పక్షాల పెద్దలు పూనుకుని - వాళ్ళిద్దరికీ వివాహం జరిపేరు అమ్మాయి, అబ్బాయి పరస్పరం ప్రేమించుకున్నా కట్న, కానుకలు వగైరాలు అన్నీ యధావిధిగానే జరిగేయి హిమబిందు పెళ్ళికి మా మామయ్య మొత్తం 35 వేలు ఖర్చు పెట్టాడు

ఆ పెళ్ళికి నేను కూడా వెళ్ళాను. అప్పుడు కావేరిని చూసాను. బాగా లావెక్కింది చూడ్డానికి వికారంగా వుంది అంతా పెళ్ళి పందిట్లోవుంటే - నేను, ఆమె ఎక్కడో దూరంగా ఓ గదిలో కూర్చునివున్నాం

"చాలా విచిత్రంగా వుంది కదూ రమేష్! అక్కకి కాకుండానే చెల్లెలికి పెళ్ళయి పోయింది. మా నాన్న గట్టిగా పూనుకుంటే నా పెళ్ళి ఓ సమస్య కాదు. కాని.... ఆయనకు యిష్టం లేదు నేను అత్తవారింటికి వెళ్ళిపోతే - ఆయన నన్ను విడిచి వుండలేరేమో, నాకు సంబంధాలు చూడటం లేదు అలాగని పూర్తిగా పట్టించుకోకుండా వుంటే పలుగురూ ఏమన్నా అనుకుంటారని, బాధ్యతా రహితుడని తప్పు పడతారేమోనని మొక్కుబడి కోసం ఏదో ప్రయత్నం చేసానంటే చేసానన్నట్లు - సంబంధం చూస్తారు వాళ్ళు 15 వేలు చెప్తారు ఆయన 5 వేలంటాడు నేనేం అప్సరసనా - వాళ్ళు సరే.. . అలాగే అని ఒప్పుకోడానికి?

రమేష్. . సాధారణంగా ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు ఎందుకు కావో తెలుసా? వేలకి వేలు ఇవ్వలేని తల్లిదండ్రుల బీదతనం. ఆర్థికపరంగా అశక్తత....

కాని నా విషయంలో అలా కాదు. నే నొక ఇంటిదాన్ని కాకుండా నా తల్లిదండ్రులే

# మానవతా గీతం

ఈ గీతం విశ్వ సంగీతం  
వాగ్దేవి వరకచ్ఛపీ నాదం  
ఇది అనాదిగా ఆర్తుల మౌనగీతం  
దుర్నీతిపయోధ రధ్వంసక  
మహా ప్రభంజన గీతం  
అసుర ప్రకృతి నాశక  
పాంచజన్య సంగీతం  
వినువీధిని వెలుగొందే  
విశ్వశాంతి పతాక గీతం  
చెవి దగ్గర ఆగక  
ఎదదాకా సాగే అనుభూతి గీతం  
తీగలా పెన వేసుకుని  
పూవులా వికసించి  
తావిలా పరిమళాలు చిమ్మే  
మానవతా గీతం

—మునునూరు రఘువర్మ

## ఓ అమ్మాయి కథ

నిరోధిస్తున్నారు. నన్ను కన్నవాళ్ళే నా పెళ్ళికి అడ్డు తగులుతున్నారు

మా అమ్మ - బాగా ముప్పొద్దులా తిని, సుఖం మరిగి - విశ్రాంతికి అలవాటు పడి - నడుం వొంచి పని చేయలేని స్థితికి వచ్చింది

మా నాన్న - నేను పెళ్ళి చేసుకుని భర్తతో వెళ్ళిపోతే తన పెళ్ళాం చాకిరీతో సతమతమయిపోతుందనే ఆలోచనతో నన్ను 'కన్య'గా ఎప్పటికీ తన యింట్లోనే అట్టి పెట్టుకుందామనుకుంటున్నాడు.

రమేష్! ఇప్పుడు నా వయసెంతో తెలుసా? 28 ఏళ్ళు. అంటే సగం యవ్వనం దాటిపోయిందన్నమాట! ఇక నా పెళ్ళి ఓ పగటి కల! పెళ్ళి కాలేదని కొర్కెలు నిద్రపోవుకదా! ఎలా? ఏం చెయ్యను? నిగ్రహంగా వుండలేక - తెగించి తప్పు చెయ్యలేక ఎంత సంఘర్షణ అనుభవిస్తున్నానో... !" అంటూ సిగ్గు విడిచి చెప్పుకుంది తన పరిస్థితిని! అభిమానం చంపుకుని తన బ్రతుకు నిజ స్వరూపం నాకు చూపించింది ఆఖరికి.... తను ఓ ఆడపిల్ల అనే విషయాన్ని సైతం విస్మరించి - తనకి ఒంటరితనం ఎంత బాధాకరంగా వుందో - నాతో చెప్పుకునే స్థితికి వచ్చిందంటే, అదెంత దయనీయమో మీరే ఆలోచించండి

* * * * * * *

కావేరి జీవితంలో ఇంకా ఎన్నెన్నో మనసుని కదిలించే సంఘటన లున్నాయి.

హిమబిందు ఓ ఆడపిల్లకి తల్లయింది ఆ పసి పిల్లని సాకే బాధ్యత అంతా కావేరి మీదనే పడింది ఎంత విచిత్రం! పెళ్ళి కాకుండానే, గర్భం లేకుండానే ఓ బిడ్డని కన్న తల్లికంటే మిన్నగా ఆలనా, పాలనా చూడటం.... అదో వింత అనుభవం. ఆ పరిస్థితిలో నే. . హిమబిందు 'డెలివరీ'వల్ల స్త్రీ సుఖం కోసం మొహం వాచి వున్న హరిప్రసాద్ ఆత్రం కొద్దీ కావేరిని ఏదో చెయ్యబోతే ఆమె ఎదురు తిరిగింది అప్పుడు హిమబిందు అక్కనే తప్పు పట్టింది ఏం - మా ఆయనకేం తక్కువైంది? అసలు మా ఆయన నీ మీద మోజు పడటమే విశేషం అడిగిందే తడవు సంతోషంగా ఒప్పుకోవలసింది పోయి - ఎందుకలా యాగీ చేస్తావు? ఒకసారి లొంగిపోతే ఏమీ అరిగిపోవులే అంటూ భర్తకి వత్తాసిచ్చి, అతడికి వంత పాడింది కావేరి మాత్రమే కాదు.. అభిమానం వున్న ఏ ఆడపిల్ల కూడా అందుకు ఒప్పుకోదు

హరిప్రసాద్ పట్టుదలవల్ల కావేరి అక్కడ్నుంచి తల్లి దండ్రుల యిల్లు చేరింది

కావేరికి రెండో చెల్లెలయిన మంజులకి పెళ్ళి కుదిరింది

'మేమే నిన్ను ఇక్కడికి పంపించమని బిందుకి లెటర్ రాద్దామనుకుంటున్నాం ఆ అవసరం లేకుండా నువ్వే వచ్చేసావు అంటూ ఆ క్షణం నుండే ఆమెకి పెళ్ళి పనులన్నీ అప్పగించేరు కావేరి పనిలో చాలా చురుకు ఎంత పనయినా నిమిషాలమీద చేసేస్తుంది పదిమంది మనుమల పెట్టు ఆమె

కేవలం కావేరిని చూట్టం కోసమే నేనా పెళ్ళికి వెళ్ళాను ఎప్పట్లాగే - పెళ్ళి సమయానికి మేమిద్దరం అందరికీ దూరంగా అప్పు డామె అంది 'రమేష్! నాచేత వీళ్ళు చాకిరీ చేయించుకుంటున్నారని - నా కెలాంటి బాధ లేదు అయినా నా చెల్లెలు పెళ్ళికేగా నేను చేస్తోంది ?

కాని నేను మొగుడు చచ్చిన విధవముండనా? నన్ను పందిట్లోకి రావద్దంటా రెందుకు? హిమబిందు పెళ్ళప్పుడూ అంతే ఇప్పుడూ అంతే! ఏం నా చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు చూసే అదృష్టం నాకు లేదా? లేకపోతే అసూయ పూరితమైన నా చూపులు ఆ కొత్త జంటకి కీడు చేస్తాయని భయమా?" అంటూ ప్రశ్నించింది ఆవేదనగా

"ఛ అదేంకాదు కావేరి! ఎందుకో చెప్పనా - నువ్వు పెళ్ళి పందిట్లో తిరుగుతుంటే వచ్చిన వాళ్ళందరి దృష్టిలో పడతావు అప్పుడు వాళ్ళంతా చెవులు కొరుక్కుంటారు మీ నాన్నని తప్పు పట్టడమూ, ఇన్నేళ్ళొచ్చినా పెళ్ళి కాలేదంటే ఏదో వుందని నీ గురించి కథలు ప్రచారమవుతాయి ముఖ్యంగా మీ నాన్న 'సేఫ్'గా వుండాలని - నిన్ను అజ్ఞాతంగా వుంచుతున్నాడు ' అంటూ ఆమెకి సమాధానం చెప్పాను కావేరి భారంగా నిట్టూర్చింది నాకు ఆమెని చూస్తుంటే సానుభూతి వెల్లువలా పొంగింది. ఇక ఈమె జీవితం ఇలా వృధాగా గడిచిపోవలసిందేనా? కావేరి జీవితంలో ఉగాదులు లేవు. ఉదయాలు లేవు ముప్పయి ఏళ్ళ జీవితంలో తనకంటూ ఏ అనుభూతులు మిగుల్చుకుంది.. అసలు ఆమెకి తనకంటూ ఓ జీవితం వుంటేగా. !

మా మామయ్య ఎంత దుర్మార్గుడు! ఏ కన్న తండ్రీ ఇలా ప్రవర్తించడు అవినీతి మార్గంలో. .. లంచాలు పట్టి వేలకి వేలు బ్యాంకు బ్యాలన్సు పెంచుకుంటూ పోతున్నాడు ఆర్థికంగా ఎంతో

ఎదిగిపోతున్నాడు తల్చుకుంటే ముగ్గురాడపిల్లల పెళ్ళిళ్ళు ఒకే పందిరిక్రింద చెయ్యగల స్థోమత ఆయనకుంది ఇప్పుడు ఓ 30 వేలు పారేస్తే - బంగారంలాంటి సంబంధం తేవచ్చు కావేరికి కాని ఆయన కిష్టం లేదు కావేరి జీవితాంతం తన యింట్లో పడి వుండాలని ఆయన ఉద్దేశం అందుకే ఆమెకి చదువు కూడా సరిగ్గా చెప్పించలేదు క్వాలిఫైడ్ అయి వుంటే - వుద్యోగం వెతుక్కొని తన దారి తను చూసుకుంటుందని వారి భయం'

కావేరి మరో ఉదంతం కూడా చెప్పింది ఇంతమటుకూ ఏ ఆడపిల్లకీ అలాంటి దురదృష్టకర సంఘటన ఎదురై వుండదు

ఆ రోజు మా మామయ్యా వాళ్ళపై అధికారి ఒకాయన్ని ఇంటికి వెంటబెట్టుకు వచ్చాడట ఆయన్ని తమ 'బెడ్‌రూం'లో కూర్చోబెట్టి, బయటికొచ్చి - కావేరిని పిలిచి, కాస్త ఆయనకు కాఫీ, టిఫిన్ ఏర్పాట్లు చూడు అని ఆదేశించాడట ఇలాంటి పనులు తనకి కొత్త కాదు కదా! ఓ ట్రేలో టిఫిన్, మంచినీళ్ళ గ్లాసు పెట్టుకుని వెళ్ళిందట కాని అతను వాటినందుకోకుండా కావేరిని దగ్గరకు తీసుకున్నాడు ఆమె కోపంతో కాళికావతార మెత్తింది. విసురుగా బయటి కొచ్చిన కూతుర్ని ఆ తల్లి దండ్రులు ఏమైందని అడిగేరు ఆమె బావురుమంటూ విషయం చెప్పింది కాని, ఆ తరువాత జరిగింది లోకంలో ఇంతమటుకు ఎక్కడా కనీ, వినీ ఎరగం

"ఈమాత్రం దానికే ఇంత రాద్ధాంతమా? ఇంకా ఏమిటో అనుకున్నాం నువ్వు ఆడదానివి అతనలా ఆశపడటం సహజం పాపం . అతను చిన్నబుచ్చుకుంటాడు వెళ్ళి క్షమాపణ చెప్పుకుని, అతడు చెప్పినట్లు నడచుకో ఈ మాటలంది ఆ అమ్మాయి కన్న తండ్రి.

కావేరికి లోకం తల్లక్రిందులయినట్లు తోచింది

'అమ్మ కూడా ఆడదే ఆమెని వెళ్ళమనంది తన అసహ్యాన్నంతటినీ ఆఒక్క మాటలో వ్యక్తం చేసింది.

ఫలితంగా చెంప చెళ్ళుమంది

అనుకున్న ప్రకారం జరగనందుకు మామయ్యా చాలా 'అప్‌సెట్' అయ్యాడు పాపం తన బ్రతుకంతా ఆ ఆఫీసరు చేతిలో వుంది ఆయన్ని సంతోషపెట్టడానికి, 'ఖుషీ' చెయ్యడానికి ఇంకో దారి వెదుక్కున్నాడు

'డియర్ రమేష్' నేను ఎదుర్కొన్న రక రకాల అనుభవాల్లో ఇది చాలా ముఖ్యమైంది ఆడపిల్ల గడప దాటి, కాలు బయట పెడితే 'రక్షణ' వుండదంటారు కాని నా విషయంలో మరి అలా జరిగిందేమిటి? సొంత ఇంట్లోనే జన్మ నిచ్చిన జననీ జనకులే చేతులారా నన్ను పతనం చెయ్యాలని 'పాపం' అనే ఊబిలోకి నెట్టాలని ప్రయత్నిస్తున్నారు ఎందుకని?

ఆమె ప్రశ్నకి నా దగ్గర సమాధానం లేదు

ఏ తల్లి దండ్రులయినా - సవతి పిల్లల్ని అక్రమ సంతానాన్ని సరిగ్గా చూడక, ద్వేషం పెంచుకుంటున్నారంటే అందులో కొంత ఔచిత్యముంది కాని ఇదేమిటి ? కావేరి విషయంలో ఇలా ఎందుకు జరుగుతోంది .?

ఎది ఏమైనా - ఆమె ఇంకా ఆ యింట్లో వుండటం శ్రేయస్కరం కాదనిపించింది ఆ క్షణంలో నేనొక నిర్ణయానికి వచ్చాను కావేరి బాధ్యత నాది. ఆమెని ఈ పంజరంలోంచి తప్పించి, ఆమెకి సరికొత్త జీవితాన్ని ప్రసాదించాలి దానికి ముందుగా ఆమె యిష్టం కనుక్కున్నాను కావేరి ఆశ్చర్య పోయిందీ రమేష్! ఇన్నాళ్ళూ నువ్వొక అభ్యుదయ రచయితవే అనుకున్నాను ఆదర్శాలు సంస్కరణలు కేవలం కాగితం మీదనే కాదు - వాస్తవ రూపం దాల్చి, జీవితాల్ని కూడా ప్రభావితం చెయ్యాలి అనే నీ తాపత్రయం అర్థం చేసుకుని హర్షాతిరేకంతో పులకితమవుతున్నాను

సరే - శాప విమోచనం కలిగించి, పునర్జన్మ నిస్తానంటే కాదనేదేముంది? నా జీవితం నీ చేతుల్లో పెడుతున్నాను నువ్వే నిర్ణయం తీసుకున్నా శిరసావహిస్తాను అంది

* * * * * * *

హైదరాబాద్ రాగానే కృష్ణమూర్తిని కలిసాను అతను మా 'సెక్రటేరియట్'లో వున్న ఎస్ బి హెచ్ బ్రాంచిలో క్యాషియర్ నాకు మంచి స్నేహితుడు కావేరి గురించి అతనికి తరచూ చెప్తుంటాను సూటిగా అడిగేసాను - 'కావేరిని పెళ్ళి చేసుకుంటావా?' అని వాడి సమాధానం - ఒరే ఇడియట్! ఆ అడగటం ఏమిటి? నన్ను నువ్వు 'రిక్వెస్ట్' చెయ్యాలా? నా మెడలోంచి కూర్చోపెట్టి, పెళ్ళి చేసే అధికారం . హక్కు నీకుంది అన్నాడు నేను ముగ్ధుడి నయ్యాను మా స్నేహ సంబంధం ఎంత పటిష్టమయినదో ఇంక ప్రత్యేకించి చెప్పనవసరం లేదనుకుంటాను

'థాంక్స్ రా, మూర్తి!' కాని, అన్నీ వివరంగా మాట్లాడుకుంటే మంచిది ఫస్టాఫ్ ఆల్ - మా కావేరి బాగుండదు కనీసం కొద్దిపాటి ఆకర్షణ కూడా ఆమెలో వుండదు. కాని - ఆమెమనస్సు, గుణ, గణాలు వగైరా విషయాల్లో ఏ ఆడపిల్లకీ ఆమె తీసిపోదు చిన్నప్పట్నుంచీ కష్టాలే తన నేస్తాలుగా పెరిగిందా అమ్మాయి ఆమెని చేసుకున్న మగాడు ప్రశాంతంగా వుండగలుగుతాడు గొడవలు స్పర్థలు లేకుండా - ఆ సంసారం స్వర్గంలా వుంటుందని హామీ ఇవ్వగలను

నువ్వు బాహ్య సౌందర్యానికి, శారీరకపు మెరుగులకి ప్రాముఖ్యతనిచ్చే మనిషివి కాదని తెలిసి, నీతో ధైర్యంగా ఈ విషయం మాట్లాడగలుగుతున్నాను మనిద్దరి అభిప్రాయాలు ఒక్కటే నీలాంటి సంస్కారవంతుడి సాహచర్యంలో కావేరి సుఖపడుతుంది

చివరి అంశం - నీకు నా అన్న వాళ్ళెవ్వరూ లేరు దాదాపు కావేరి పరిస్థితి కూడా అంతే ఆమె వివాహానికి వాళ్ళింట్లో ఎవ్వరూ ఒప్పుకోరు కాబట్టి ముందు రహస్యంగా పెళ్ళి జరిగేక, తరువాత ఈ విషయం అందరికీ తెలుపుదాం 'అన్నాను

మరి నాకు కాళ్ళు కడిగి కన్యాదానం ఎవరు చేస్తారు?

"నేనేరా! కావేరి నా కూతురనుకో కాసేపు '

వాడు తేలిగ్గా నవ్వేసాడు అంతా సిద్ధమయిపోయినట్లే కావేరికి లెటర్ రాసాను అన్ని వివరాలతో ప్రోగ్రాం కూడా నేనే రూపొందించేను ఆమెని ఫలానా 'ట్రైన్'కి బయల్దేరిరమ్మని, నేనిక్కడ సికింద్రాబాద్ స్టేషన్‌లో ఆమెని 'రిసీవ్' చేసుకుంటానని అందులో రాసేను వెంటనే తిరుగుటపాలో నేను కోరిన ప్రకారం ఆమె దగ్గర్నుంచి 'రిప్లయ్' వచ్చింది టిక్కెట్టు రిజర్వు చేయించుకున్నానని రాస్తూ - కంపార్టుమెంటు నెంబరు, వగైరాలు రాసింది ఇదంతా రహస్యంగా జరిగిపోతోంది నాకు చాలా సంతోషంగా వుంది జీవితంలో ఓ గొప్ప పని చేస్తున్న తృప్తి కలిగింది

* * * * * * * *

అనుకున్నరోజు సమీపించింది కావేరిని 'రిసీవ్' చేసుకోడానికి చాలా ముందుగానే స్టేషనుకి వెళ్లాను నాతో పాటు కృష్ణమూర్తి కూడా వున్నాడు వాడు మాటి మాటికి వాచీ చూసుకుంటుంటే-'ఏరా ఆరాటంగా వుందా?

ఇటీవల భారత్ కల్చరల్ ఇంటిగ్రేషన్ కమిటీ (మద్రాసు) టాటానగర్, భిలాయ్ పట్టణాలలో బాలాజీ కళ్యాణోత్సవాలు జరిపినప్పుడు వర్ధమాన గాయని కుమారి భాగ్యలక్ష్మిని డాక్టర్ బాలమురళీకృష్ణ, శ్రీమతి జానకి ప్రశంసించి ఆశీర్వదించారు ఆ సందర్భంగా శ్రీమతి జానకి అభినందనలు అందుకుంటున్న కుమారి భాగ్యలక్ష్మిని చిత్రంలో చూడవచ్చు



అంటూ ఆట పట్టించేను ఇద్దరం కాఫీలు తాగేం బిల్లు నేనిస్తుంటే 'కట్నం లేకుండా ఉత్త కాఫీలు తాగించి మంచి అల్లుణ్ని కొట్టేస్తున్నావు " అంటూ వాడు నన్ను ఎదురు దెబ్బ కొట్టాడు మేమిలా హాస్యాలాడుకుంటూండగానే ట్రైన్ వచ్చి ఫ్లాట్‌ఫాంమీద ఆగింది వేలకొద్దీ జనం పెట్టె, బేడతో బిల బిలమంటూ దిగుతున్నారు మే మిద్దరం 'డీ కంపార్టుమెంటు దగ్గర కెళ్లి కావేరి కోసం గాలింపు ప్రారంభించాం క్షణాలు గడుస్తున్నాయి క్రమ క్రమంగా 'కంపార్టుమెంటు' మొత్తం ఖాళీ అయి, ఆఖరికి ప్లాట్‌ఫాం కూడా . మళ్ళీ ఎప్పట్లా పల్చబడిపోయింది ఏదీ కావేరి జాడ కన్పించదేం? ఆమె రాలేదా ? రాకుండా ఎందుకుంటుంది? ఒకవేళ ఏ అవాంతరం ఎదురైనా తప్పించుకుని రాగల చాకచక్యం ఆమెకి వుంది ఆదిలోనే హంసపాదు ఇలా జరిగిందేం? నా మనసు మనసులో లేదు ఏదో ఆరాటం ఆందోళన మూర్తి నా భజం తట్టాడు "డోంట్‌వర్రీ! ఏ కారణంవల్లనో ప్రయాణం వాయిదా పడి వుంటుంది లెటర్ రాసి కనుక్కో " అన్నాడు. ఇలా జరుగుతుందని ఊహించకపోవడంవల్ల తదుపరి కర్తవ్యం ఏమిటో నిర్ణయించుకోలేకపోయాను కావేరి రాకపోతే పోయింది పోనీ అక్కడున్నా సురక్షితంగా వుందా? ఈ అనుమానం తీర్చుకోవడానికి వెంటనే వాళ్ల ఊరికి వెళ్లాలనిపించింది కాని ఒకవేళ అక్కడ కావేరి లేకపోతే, వాళ్ళు నన్ను అనుమానిస్తారేమో! ఓ నాలుగు రోజులాగి ఈలోపు ఎలాంటి సమాచారం తెలియకపోతే అప్పుడు ఆ పని చెయ్యొచ్చుని సమాధానపడ్డాను

ఆ మరుసటి రోజు దినపత్రిక తిరగేస్తున్నాను పేపరులో ప్రతి వార్తని క్షుణ్ణంగా చదవటం నా అలవాటు ఆ ప్రయత్నంలోనే ఆరో పేజీలో ఎక్కడో మూలగా ప్రచురించిన ఓ వార్త నా కంట బడింది "మామూలుగా అయితే, యధాలాపంగా పేపరు తిరగేసేవాళ్ళు ఆ వార్తని చూసే అవకాశం లేదు దోర్నకల్ స్టేషన్‌లో యువతి కిడ్నాప్ "

# ఓ అమ్మాయి కథ

ఆమెకి ముప్ఫయి సంవత్సరాల వయసుండొచ్చు

పేరు, వివరాలు తెలియలేదు కాని - మనిషి అనాకర్షణీయంగా వుంటుందని హైదరాబాద్‌కి వెళ్తున్నట్లు ప్రత్యక్షసాక్షుల కథనం '

ఆపైన చదివేందుకు ఏమీ లేదు ఆ యువతి కావేరి అవును సందేహం లేదు అయ్యో ఎంత పని జరిగి పోయింది! ఆమె ఏ దుర్మార్గుల చేతిలో పడిందో ఇక ఆమె జీవితం సర్వ నాశనమే సామూహిక మానభంగం పైశాచికంగా ఆమెని చెరచి - ఆ తర్వాత ఏ వ్యభిచార గృహానికి అమ్మివేస్తారో !

ఏదైతే అదే అవుతుందని - నేను విషయం నిర్ధారించుకోవడానికి వెంటనే వాళ్ల ఊరికి బయల్దేరాను

కావేరి యింట్లో లేదు రెండు రోజులయిందట కన్పించక అంటే నా మనసు బాధగా మూలిగింది ఒరేయ్ రమేష్! ఆ అప్రాచ్యురాలు ఒళ్ళు బలిసి, మదమెక్కి ఎవడితోనో లేచిపోయిందిరా!" అని అత్తయ్య వాపోతే - మామయ్యేమో, మాతో ఒక్కమాట చెప్పివుంటే పెళ్లి చేయలేకపోదుమా? అప్పుడీ తలవంపులు వుండేవికావు ' అన్నాడు నాకు అసహ్యంగా అన్పించింది

ఒక్కమాట చెప్పాలట! ఏమని చెప్పాలి? "నాన్నా నాకు ముప్ఫయి ఏళ్లు నా పెళ్లి సంగతి మర్చిపోయావా ?' అని గుర్తు చెయ్యాలా – లేక, "నాన్నా నా శరీరం మగ తోడుని కోరుతోంది కోరికలని నిగ్రహించుకోలేకుండా వున్నాను అంటూ నిర్లజ్జగా తండ్రికి విన్నవించుకోవాలా? అయినా, తన మిగతా నలుగురు కూతుళ్లు అలా బరితెగించి అడిగితేనె వాళ్లందరి పెళ్లిళ్లు చేసాడా ? పోనీ కోర్కెల గురించి తెలియని మగాడా ఆయన? రిటైర్‌మెంటు దగ్గర పడుతున్నా – భార్యతో సరిపెట్టుకోక, పరస్త్రీల పొందుకోరే ఆ శృంగార పురుషుడికి – ముప్ఫయి ఏళ్ల యవ్వనంలో వున్న తన కూతురికి ఏదో ఒక దారి చూపాలని ఎందుకు తోచదు?

మా బంధువర్గం మొత్తం ప్రాకిపోయింది ఈ వార్త కావేరి లేచిపోయింది అంటూ అందరూ విడ్డూరంగా చెప్పుకున్నారు మరేం చేస్తుంది పాపం ఎంతకీ తండ్రి పెళ్లి చెయ్యడాయె .' అంటూ కొంతమంది దొంగ సానుభూతి చూపుతూనే - రోజులు మరీ పాడయిపోయినాయి, ఆడపిల్లలు వయసొచ్చినప్పట్నుంచీ ఎప్పుడెప్పుడా అని, ఆకలిగా అవురావురంటూ వుంటారు . అని మరోపక్క నుండి తప్పు పట్టేవారు ఆ వ్యాఖ్యలన్నీ చెవినబడుతుంటే నా మనసు విలవిల్లాడిపోయేది అయ్యో ఆమెని ఏమీ అనకండి కావేరి ఏ తప్పు చెయ్యలేదు పాపం ఆమెని నిందించకండి . ఆమె ఎవరితోనూ లేచిపోలేదు అంత సంస్కారహీనురాలు కాదు ఆమె సెక్సు కోరికల్ని అణచుకోలేక - ఏ మగవాడినో చూసుకుందని వాడితో పరారయిందని ఎందుకనుకుంటారు?ఒకవేళ ఆమె నిజంగా ఆ పని చేయదల్చుకుంటే ఇప్పుడా? 18 సంవత్సరాల యవ్వనం వృధాగా గడిచేక - ఇప్పుడు తొందర పడిందని ఎలా నమ్ముతున్నారు ? అని గొంతెత్తి అరవాలని పించేది నాకు అంతేకాదు - 'ఇందుకు నేనే పూర్తి బాధ్యుడిని నా వల్లనే ఇలా జరిగింది ఆశలు చంపుకుని బ్రతుకుతున్న ఆమెకి నేనే జీవితంమీద ఆశలు కల్పించేను పాపం ఆ ఆశలు తీర్చుకుందామని పరుగెత్తుకు వస్తుంటే దారిలో పొంచి వున్న ఏ క్రూర మృగమో, విష సర్పమో ఆమెని కబళించి వేసింది కావేరి దేవత ఆమెకి ఏ పాపం తెలీదు ఆమె మనసులో స్వచ్ఛతే తప్ప - కల్మషం, కుళ్ళు వీటికి తావులేదు కావేరి పేరు లాగానే మనిషి కూడా పవిత్రమైన నదీమతల్లిలాంటిదిరా! ఆమె గురించి నీచంగా మాట్లాడితే నోరు పడిపోతుందిరా!" అంటూ ఆమె నిరపరాధం గురించి ఎలుగెత్తి చెప్పాలనిపించేది నాకు అలా చెయ్యడమూ ప్రమాదకరమే అప్పుడు నాకు, ఆమెకీ అక్రమ సంబంధం అంటగడుతుందీ లోకం ఆమెని వీడు సమర్థిస్తూ వెనకేసుకు వస్తున్నాడంటే - ఇద్దరి మధ్యనా 'ఏదో గ్రంథం నడిచే వుంటుంది . ' అంటూ నా మాటలకి వక్రభాష్యం చెప్పుకుంటారీ మనుష్యులు

ఇదే నేను మీకు చెప్పదల్చుకున్న - 'ఓ అమ్మాయి కథ'

ఆ తరువాత - కావేరి గురించి మీ కెంత తెలుసో, నాకూ అంతే ఎక్కడో... ఏ వ్యభిచార గృహంలోనో నికృష్ట జీవితం గడుపుతూ ... లేదా మరణించి ఉండనూ వచ్చు. ఒకవేళ అదే నిజమయితే ఆమెని నా కూతురిగా మళ్లీ పుట్టించమని దేవుణ్ని వేడుకుంటాను. అందుకే... నాకు ఇద్దరు మగ పిల్లలు వున్నప్పటికీ 'ఫామిలీ ప్లానింగ్' గురించి ఆలోచించదల్చుకోలేదు. నా కోరిక తీరితే - ఆ పుట్టిన పాపకి నేను పెట్టబోయే పేరు - 'కావేరి ' □



# కార్టూనిస్టులకు సూచనలు !

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !

★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.


గ్వాలియర్ మిల్స్ ప్రెస్టేజ్ షోరూమ్
మీరు డబ్బు ఆదా చేయాలంటే అపూర్వ అవకాశం!
ప్రెస్టేజ్ షోరూం కలిగిస్తోంది
షర్టింగ్స్, సూటింగ్స్ ట్రవుజర్స్ & షర్ట్సుపై
పండుగలకు
10%
ప్రత్యేక తగ్గింపు!
GWALIOR SUITING
ప్రెస్టేజ్
మెయిన్‌రోడ్, బ్రాడీపేట
గుంటూరు-2
DARPAN
BABU ADS



కంప్యూటర్ సిమెంట్...
ప్రియా సిమెంట్
మా శ్రద్ధంతా మీ కోసమే
OPC
Priya cement
అయ్యో! ముహూర్తం బలమైనదే పెట్టాను! మీరు బలమైన సిమెంట్ వాడలేదు! అందుకే... కూలింది!
బలమైన సిమెంటా?
అవును! ఈ సారి ప్రియా సిమెంట్ వాడదాం! రండి.. డాడీ..
MARUTI/PRIYA/TL 1
పైన కార్టూన్‌లో నటీనటులు ఎవరు? ఏ చిత్రంలో అన్నది కార్డుపై వ్రాసి తెలపండి. ప్రియమైన బహుమతులు గెలుచుకోండి!
MADRAS-600 017



# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్యప్రముఖుని సమాధానాలు

**ఎ. శ్రీనివాసు, థాణే (మహారాష్ట్ర)**

ప్ర నా వయస్సు 56 సం నాకు ఒక సం నుండి తెల్ల కామెర్లు వచ్చినవి అప్పటి నుంచి ఎక్కిళ్ళు, జీర్ణశక్తి లోపం, శరీరం అనారోగ్యంగా వున్నది ఏదైనా మందు సలహా ఇవ్వండి?

జ బైద్యనాథ్ స్వర్ణమాక్షిక్ భస్మం ఒకగ్రాము తేనెతో రెండు సార్లు తీసుకోవలెను భోజనం అయిన తరువాత బైద్యనాథ్ అశ్వగంధారిష్ట మరియు ద్రాక్షసవ స్పెషల్ రోజుకి రెండుసార్లు 40 రోజులు తీసుకోవలెను

**కె. లక్ష్మి, అనంతపురం**

ప్ర. తలవెనుక భాగమున నొప్పి ( వస్తుంది ఆ నొప్పి వారం రోజులు వుంటుంద ఉదయం 6 గం నుండి 12 గం వరకు వుంటుంది ఏ మందు వాడాలి?

జ బైద్యనాథ్ సిర్‌సులాధ వజ్రరాజ్ రసం బిళ్లలు ఉదయం ఒక బిళ్ల సాయంత్రం ఒక బిళ్ల నీళ్లతో వేసుకొనవలెను 40 రోజులు వాడవలెను

**కె. పృథ్వీరాజ్, సత్తుపల్లి**

ప్ర నా వయస్సు 35 సం నాకు చెవిలో ఏయ్‌మని శబ్దం 5 నెలలనుండి వచ్చుచున్నది ఏదైనా మందు చెప్పండి

జ బైద్యనాథ్ క్షార తైలం రెండు చుక్కలు చెవిలో వేయవలెను

**పి. గోవిందరావు, ఖరగ్‌పూర్**

ప్ర నా వయస్సు 21 సం నేను భోజనం చేసినప్పుడు సరిగా ఆకలిగా వుండదు.మిగతా సమయంలో ఆకలి వేస్తుంది ఏదైనా పనిచేస్తే ఆయాసం వస్తుంది మందు ఏదైనా చెప్పండి

జ బైద్యనాథ్ ద్రాక్షసవ స్పెషల్ మరియు మృత సంజీవిని సుర రెండు చెంచాలు మందు భోజనంకు ముందు రోజుకి రెండుసార్లు తీసుకోవలెను. 40 రోజులు మందు వాడవలెను. బైద్యనాథ్ చ్యవనప్రాస లేహ్యం స్పెషల్ రోజుకు రెండు సార్లు పాలతో తీసుకోవలెను

**బి. సరళ, విజయవాడ**

ప్ర నా వయస్సు 18 సం నాకు మొటిమలు, పొక్కులు ఎక్కువగా వున్నవి దానికి ఏదైనా మందుచెప్పండి?

జ బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగ్ రోజుకు మూడుసార్లు రెండు చంచాలు ఉదయం మధ్యాహ్నం సాయంత్రం నీళ్లతో తీసుకోవలెను మరియు బైద్యనాథ్ రక్తసోధక్‌బటి బిళ్లలు రోజు రెండు సార్లు తీసుకోవలెను 40 రోజులు వాడవలెను ఉడుకు పదార్థములు వాడకూడదు కారం వగైరాలు వాడరాదు

**ఆర్ విశ్వనాథం, కాకినాడ**

ప్ర నా వయస్సు 40 సం లు నాకు వివాహం అయి 15 సం అయింది నాకు చాలా నీరసంగా మరియు ధాతుశక్తి తక్కువగా వున్నది ఏదైనా మందు, సలహా ఇవ్వండి

జ. బైద్యనాథ్ విటాఎక్స్ ఒక బిళ్ల చొప్పున రోజుకు రెండుసార్లు 40 రోజులు వాడవలెను మరియు

బైద్యనాథ్ చ్యవనప్రాస స్పెషల్ రోజుకు రెండు సార్లు చొప్పున పాలతో తీసుకోవలెను

**యు. శారద, విశాఖపట్నం**

ప్ర నా వయస్సు 30 సం నాకు 6 నెలలనుండి తెల్ల బట్ట చాలా నీరసంగా వుంటుంది మీ సలహా ఏమిటి?

జ బైద్యనాథ్ సుందరికల్ప ఫోర్టు మూడు చెంచాలు రోజుకు రెండుసార్లు ఉదయం సాయంత్రం నీళ్లతో వాడవలెను మరియు బైద్యనాథ్ ల్యూకోనిల్ బిళ్లలు రోజూ ఒక బిళ్ల చొప్పున రెండుసార్లు వేసుకోవలయును బైద్యనాథ్ చ్యవనప్రాసా స్పెషల్ రోజూ రెండుసార్లు ఉదయం, సాయంత్రం పాలతో తీసుకోవలెను 40 రోజులు వాడవలెను

**ఎం. సురేష్, విజయవాడ –3**

ప్ర : సాధారణంగా మొటిమలు ఎందుకు వస్తాయి? అవి రాకుండా తీసుకోవలసిన జాగ్రత్తలు ఏమిటి? నా ముఖము, వీపుపై మొటిమలు ఉన్నాయి. అవి తగ్గి మళ్లీ వస్తున్నాయి. నల్లగా మచ్చలు ఏర్పడ్డాయి. సరైన మందు ఆయుర్వేదంలో ఉన్నదా?

జ : మొటిమలు యుక్తవయస్సుకు చిహ్నములు. వాటి జోలికి పోకుంటే నష్టము లేదు. తీపి, కొవ్వు పదార్థాలు ఎక్కువగా తినకూడదు. సబ్బుతో అనేక సార్లు శుభ్ర పరచుకొనుచూ తడి లేకుండా తుడుచుకుంటూ బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగ్‌ను నాలుగు చెంచాలు అంతే నీటితో కలిపి భోజనానికి అరగంట ముందుగా తీసుకొనవలెను.

**కె. నల్లయ్య, నాగార్జున యూనివర్సిటీ**

ప్ర : నా వయస్సు 25 సంవత్సరాలు పెళ్లి అయి మూడు సంవత్సరాలు అయింది. నాకు గుండె వీకుగా ఉంటున్నది.

జ . గుండె వీక్‌గా ఉన్నవారు బైద్యనాథ్ పునర్నవా మండూరం ఒక బిళ్లను ఉదయం, సాయంత్రం అన్నం తిన్న తర్వాత తీసుకుంటూ రాత్రికి బాదం పాక్ (బైద్యనాథ్) ఒక స్పూను పొడరు పాలతో సేవించగలరు. □

---

### కూపన్

### ఆంధ్ర సచిత్ర వారపత్రిక

### బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

ప్రశ్న :...........................................

...............................................

...............................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :

# అందాలు చిందే ఫ్రెస్కా.
# సుగంధాలు చిమ్మే ఫ్రెస్కా.



గోద్రెజ్ సమర్పణ—

అద్భుతమైన లగ్జరీ సబ్బు.

ఫ్రెస్కా. విలాసవంతమైన, విలువైన సుగంధ పరిమళ భరితమైన సబ్బు.

ఎంతో నురుగు—పాల మీగడ తరగలా. త్వరగా తరగనిది, అరగనిది ఫ్రెస్కా.

లగ్జరీ సబ్బు. మీకు నచ్చే, మిమ్మల్ని ఆశ్చర్య పరిచే తక్కువ ధరలో.




**గోద్రెజ్ వారి 3 రూపాయల* అద్భుతం**



సీరియల్

# ఆరోహణ

## శైలకుమార్

(గత సంచిక తరువాయి)

చక్రవర్తి రాజీనామా ఇచ్చాడన్న విషయాన్ని మొదట్లో ఎవరూ నమ్మలేదు నిజమని తెలిసిం తరువాత ఉన్నట్టుండి ఎందుకు రాజీనామా చేశాడా అన్న సందేహం పట్టుకుంది అందరికీ. చక్రవర్తి తమను వదలి వెళ్ళిపోతున్నాడని అందరిలోను లీలగా బాధ.

తన కేమీ పట్టని వాడిలా తన సీటులో మౌనంగా కూర్చున్నాడు చక్రవర్తి! ఎందుకు రాజీనామా చేశారని అడిగిన అందరికీ ఒకే సమాధానం చెప్పాడు 'ఆ ఉద్యోగం తన కిష్టం లేదని' ఆ సమాధానంతో ఎవ్వరూ తృప్తి పడలేదు కొందరు ప్రభాకర్‌ను అడిగారు. అతనూ తన కేమీ తెలియదని సమాధానం చెప్పాడు

ఆ రోజే చక్రవర్తి రాజీనామా చేస్తాడని ప్రభాకర్ కూడ అనుకోలేదు ఎంత చెప్పినా విననందుకు అతనికీ బాధగా వుంది

మేనేజరు పిలిచి ఆలోచించుకొమ్మని చెప్పినప్పటికీ తన నిర్ణయాన్ని మార్చుకోలేదు చక్రవర్తి అతనికి ఆ ఊరు వదలి వెంటనే మద్రాసు వెళ్ళిపోవాలని వుంది.

చక్రవర్తి రాజీనామా పట్ల ఆఫీసులో ఒక్కొక్కరూ ఒక్కో రకంగా అనుకోసాగారు. ఎప్పుడూ ఏదో ఒక మాట విసిరే రేఖ మాత్రం మౌనంగా వుండిపోయింది

ఆఫీసు నుంచి చక్రవర్తికి రావలసిన డబ్బు దాదాపు నాలుగు వేలు వచ్చింది. అది తీసుకుని తాను సాయంత్రం సప్తగిరి రైలుకు మద్రాసు వెళ్ళిపోతున్నట్టు చెప్పి బయట పడ్డాడు చక్రవర్తి అందరూ పార్టీ ఇస్తామన్నా అంగీకరించలేదు.

ఊరు విడిచి వెళ్ళిపోతున్నట్టు నీలిమకు చెప్పాలనుకున్నాడు చక్రవర్తి రావద్దని తాను అంత కఠినంగా చెప్పినపుడు ఎలా వెళ్ళగలడు. అయినా ఆమెను మరచి పోవాలనే కదా తాను వెళ్ళిపోతున్నది.

తన రచనలు, బట్టలు సర్దుకుని రూము ఖాళీ చేశాడు చక్రవర్తి

చక్రవర్తిని సాగ నంపటానికి రేఖతో సహా ఆఫీసు స్టాఫ్ అంతా వచ్చారు స్టేషనుకు కంపార్టుమెంటులో సామాను సర్దుకుని ప్లాట్‌ఫారం మీదికి దిగాడు చక్రవర్తి.

తిరుపతి వదలి వెళ్ళిపోతున్నందుకు అతనికి ఎంతో బాధగా వుంది. ఆ వీధుల్లో తిరిగాడు ఆ వీధుల్లో పెరిగాడు కష్టాలు కన్నీళ్ళు కలబోసుకుని బ్రతికాడు అక్కడ. ఓడిపోయిన వాడిలా ఒంటరిగా అక్కడ నుంచి వెళ్ళిపోతున్నందుకు చెప్పలేని బాధ.

"తొందర పడ్డావేమో" బాధగా అన్నాడు ప్రభాకర్.

"లేదు ఆలస్యంగా మేలుకున్నాను "

చక్రవర్తి చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు ప్రభాకర్ చక్రవర్తి దూర మౌతున్నందుకు అతనికీ బాధగా వుంది

"చక్రవర్తీ ఎప్పుడు ఏ అవసరం వచ్చినా నేనున్నానని గుర్తు పెట్టుకో" చక్రవర్తి కళ్ళు చమర్చాయి.

"ఆ మాట చాలు ప్రభాకర్" కౌగిలించుకున్నాడు అతన్ని

దూరంగా నిలబడి వాళ్ళను గమనిస్తోంది రేఖ. వెళ్ళిపోతున్నానని చెప్పటానికి రేఖ వద్దకు నడిచాడు చక్రవర్తి

"ఎందుకు చక్రవర్తీ ఇంత హఠాత్తుగా వెళ్ళిపోతున్నావు' ఆత్మీయంగా అడిగింది రేఖ

"కారణం ఏమీ లేదు. వెళ్ళిపోవాలనిపించింది "

"ఏ కారణం లేకుండా ఎందుకు వెళతావు. చెప్పటానికి మేము ఆత్మీయులం కాము గదా" నిష్ఠూరంగా అంది.

బరువుగా నవ్వాడు చక్రవర్తి

"మళ్ళీ ఎప్పుడు వస్తావు "

"ఇక ఎప్పటికీ రానేమో రేఖా

అతని కళ్ళల్లోకి సూటిగా గుచ్చి గుచ్చి చూసింది రేఖ

"ఇన్నాళ్ళలో నీ మనసు బాధ పెట్టి వుంటే క్షమించు" కళ్ళ నిండా నీళ్ళతో అంది

ఆమె అలా అంటుందని గాని, కన్నీళ్ళు పెట్టుకుంటుందని గాని ఊహించలేదు చక్రవర్తి

"అవేం మాటలు రేఖా "

'జ్ఞాపకం వుంటానా

"ఎలా మరచిపోతాను" నవ్వుతూ అన్నాడు

ఎవరో పిలిచారు చక్రవర్తిని, కదిలాడు ఆమె దగ్గర నుంచి

శాశ్వతంగా ఆ ఊరు వదలి వెళ్ళిపోతున్న తనని సాగనంపటానికి నీలిమ

జరిగిన కథ –5 : తిరుపతిలో సన్మానానికి వచ్చిన సినీకవి చక్రవర్తికి నీలిమ కలుస్తుంది. ఇద్దరూ ఒకరి సంగతుల నొకరు కనుక్కుంటారు చక్రవర్తికి పదేళ్ళ క్రింది స్మృతులు మదిలో మెదులుతాయి ఆఫీసులో హేళనలకు గురవుతుండే కవి చక్రవర్తి ఊరట కోసం కపిలతీర్థం కెళ్ళి అక్కడ ఒక శ్రావ్యమైన గొంతులో తన పాట వింటాడు. ఆ పాట పాడిన నీలిమతో పరిచయం చేసుకుంటాడు చక్రవర్తికి స్నేహితుడు ప్రభాకర్ తోడు నిలుస్తాడు చక్రవర్తి తన రచనలన్నీ నీలిమకిచ్చి ఆమె అభిప్రాయం అడుగుతాడు రోడ్ల మీద రంగుల బొమ్మలు వేసే రవిని చక్రవర్తి ఆదరించి మంచి సలహా చెపుతాడు నీలిమ చక్రవర్తి రచనల్ని మెచ్చుకుంటుంది. ఇద్దరి మధ్య సాన్నిహిత్యం పెరుగుతుంది. ప్రభాకర్ విషాద గతాన్ని చక్రవర్తి విచిత్ర పరిస్థితుల్లో తెలుసుకుంటాడు నీలిమ తన భర్త, ప్రమాదంలో కాళ్ళు పోగొట్టుకున్న సుధాకర్‌ను చక్రవర్తికి పరిచయం చేస్తుంది నీలిమ చక్రవర్తి విడిపోవలసి వస్తుంది ఎడబాటు వల్ల తల్లడిల్లి పోతున్న మనసును కుదుట పరచుకోవడానికి మద్రాసు వెళ్ళడానికి నిశ్చయించుకుంటాడు చక్రవర్తి

రాకూడదూ. వచ్చి చివరి సారిగా కనిపించి వీడ్కోలు ఇవ్వకూడదూ అనుకున్నాడు ఎలా వస్తుంది తను వెళ్ళిపోతున్న విషయం ఆమె కెలా తెలుస్తుంది. గాఢంగా నిట్టూర్చాడు.

సిగ్నల్ ఇచ్చారు. కూత వేసింది రైలు అందరికీ చెప్పి కంపార్ట్మెంటులోకి ఎక్కి వాకిలి దగ్గర నిలబడ్డాడు. కదిలింది రైలు క్షణక్షణానికి వాళ్ళ నుంచి అతన్ని దూరం చేస్తూ కదలింది. ప్రభాకర్ రేఖ అందరూ చేతులు ఊపుతున్నారు వాళ్ళు కనిపిస్తున్నంత దూరం చేయి ఊపుతూనే వున్నాడు చక్రవర్తి

ఆ సాయంత్రం వరండాలో కుర్చీ వేసుకుని ఎదురు చూస్తూ కూర్చుంది నీలిమ చక్రవర్తి రాడన్న విషయం ఆమెకు స్పష్టంగా తెలుసు కాని ఎక్కడో ఏ మూలో దాగిన చిన్న ఆశ కనీసం కపిల తీర్థానికి ఈ రోడ్డు మీద నడిచి వెళ్ళడా అన్న భ్రమ చక్రవర్తి శాశ్వతంగా ఆ ఊరు వదలి వెళ్ళిపోయాడని ఆమెకు తెలీదు తెలిస్తే స్టేషనుకు అయినా వచ్చి వుండేదేమో

రాత్రి చాలా పొద్దు పోయే వరకు అలానే కూర్చుని వుండిపోయింది నీలిమ.

రూముకు వచ్చాడు ప్రభాకర్ అతని ఆలోచనలన్నీ చక్రవర్తి చుట్టే తిరుగుతున్నాయి మద్రాసు మహానగరంలో అందులోను సినిమా ప్రపంచంలో లౌక్యం తెలియని చక్రవర్తి ఎలా బ్రతకగలడో అనుకున్నాడు

బాధ భరించటానికన్నట్టు విస్కీ సీసా తెరిచాడు సుడిగాలిలా రూములోకి



# ఆరోహణ

వచ్చింది రేఖ. ప్రభాకర్ అనుకోలేదు ఆమె ఆ సమయంలో వస్తుందని.

అతన్నే చూస్తూ అతనికి ఎదురుగా కూర్చుంది రేఖ.

"ఎందుకు వెళ్ళిపోయాడు చక్రవర్తి" అడిగింది మాటిగా.

"ఏమో నాకూ తెలీదు" పొడిగా అన్నాడు

'నీకు తెలుసు తెలిసీ చెప్పటం లేదు నువ్వు."

చక్రవర్తిని ఎప్పుడూ విమర్శిస్తుండే రేఖ ఎందుకు అతని గురించి తెలుసుకోవాలనుకొంటోందో అర్థం కాలేదు ప్రభాకర్‌కు

"అతని స్వంత విషయాలు నీ కెందుకు "

ఒక్క క్షణం మౌనంగా ప్రభాకర్ కళ్ళల్లోకి చూసింది రేఖ.

'అతనంటే నా కిష్టం" చెప్పింది నిజాయితీగ.

"ఎలాంటి ఇష్టం" వ్యంగ్యంగా అన్నాడు

'ఎవరంటేను లేనంత ఇష్టం" స్థిరంగా అంది

ఆశ్చర్యపోయాడు ప్రభాకర్ ఆమెకూ ఇష్టాలున్నాయా అని.

"ఎందుకు '

"మీలా అతడు నన్ను కోరుకోనందుకు, కొనుక్కోనందుకు."

మత్తు హఠాత్తుగా దిగిపోయినట్లనిపించింది ప్రభాకర్‌కు. స్త్రీని అర్థం చేసుకోవటం చాలా కష్టం అనుకున్నాడు.

మౌనంగా తాగసాగాడు తాను కోరిన సమాధానం రాక పోవటంతో లేచింది రేఖ వెళ్ళటానికి ఆమె చేయి పట్టి లాగాడు ప్రభాకర్. అది ఊహించని రేఖ అతని ఒళ్ళో పడింది తమకంగా ఆమెను ముద్దు పెట్టుకుని గాఢంగా కౌగిలించుకున్నాడు.

"వద్దు" విడిపించుకుంటూ అంది

ఏం" అడిగాడు అలవాటైన ఆమె ఎందుకు వద్దంటూ వుందో అర్థం కాక.

"ఇప్పుడు ఇష్టం లేదు.'

'పర్వా లేదు రా" హత్తుకుని మంచం వైపు నడిపించాడు.

'ప్లీజ్ నా మనసేం బాగలేదు" విడిపించుకుని వెళ్ళిపోయింది. ఆమె అలా ఎందుకు చేసిందో అర్థం కాలేదు ప్రభాకర్‌కు. "ఈ ప్రపంచంలో నమ్మకూడనిది ఏమైనా వుందీ అంటే అది ఆడది' అనుకున్నాడు

అసహనంగా మంచంపై వాలిపోయాడు

★ ★ ★ ★ ★ ★ ★ ★

రాత్రి పదిగంటల సమయం మద్రాసు సెంట్రల్‌లో దిగాడు చక్రవర్తి అతనికంతా కొత్తగా, అయోమయంగా వుంది అంతకుముందు ఒకటి రెండు సార్లు స్నేహితులతో మద్రాసు వచ్చాడు కాని అప్పుడు అన్ని విషయాలూ స్నేహితులే చూసుకున్నారు




ప్లాట్‌ఫారం మీద బెరుగ్గా భయంగా నిలబడ్డాడు చక్రవర్తి. భాష కూడ అర్థం కాకపోవటం వల్ల అదేదో తనకు తెలియని ప్రపంచంలా వుంది. స్టేషను బయటికి ఎలా వెళ్ళాలో కూడ తెలియలేదు చక్రవర్తికి. ఎక్కువ మంది జనం ఎటు పోతున్నారో అటు నడిచి బయటికి రాగలిగాడు. లగేజి పెద్దగా లేకపోవటం మేలైంది అనుకున్నాడు

ఎక్కడికి వెళ్ళాలి? ఎక్కడ వుండాలి? ఎవరి ద్వారా ప్రయత్నించాలి? అవీ అతని సమస్యలు ఏమీ పాలుపోవటం లేదు చటుక్కున అతనికి గుర్తొచ్చింది సినిమా వాళ్ళకు కేంద్రం పాండీ బజారు అని ఏదో సినిమా పత్రికలో చదివాడు ఆ విషయాన్ని. కాని ఆ పాండీ బజారు ఎక్కడ వుంది ఎలా వెళ్ళాలి.

"పాండీ బజారు ఎక్కడండీ" ఎదురుగా వస్తున్న ఎవరినో అడిగాడు.

'టి నగర్‌లో" నిర్లక్ష్యంగా సమాధానం చెప్పి చక్రవర్తిని పట్టించుకోకుండా వెళ్ళిపోయాడతను

"టి నగర్ ఎక్కడ" మళ్ళీ సందేహం చక్రవర్తిలో.

"టి నగర్ పోవాలా సార్" అంటూ చక్రవర్తి సందేహాన్ని ఓ ఆటో వాడు తీర్చాడు

'ఔను' అన్నట్లు తల ఆడించాడు చక్రవర్తి.

"రండి సార్ ఆటో లో పోదాం" లగేజి అందుకుంటూ అన్నాడు ఆటో వ్యక్తి.

ఆటో ఎక్కాలా వద్దా అన్న సందేహం చక్రవర్తిలో. 'మద్రాసులో మోసాలు ఎక్కువ' అన్న ప్రభాకర్ మాటలు గుర్తొచ్చాయి. కాని ఇప్పుడు అంత కంటే మరో మార్గం లేదు మౌనంగా ఆటో ఎక్కాడు.

విశాలమైన మౌంట్ రోడ్డు మీదుగా పోతోంది ఆటో. ప్రకాశవంతంగా విద్యుద్దీపాలు వెలుగుతున్నాయి కార్లు, బస్సులు, ఆటోలతో రాత్రి పూట కూడా సందడిగా వుంది రోడ్డు. తిరుపతితో ఆ నగరాన్ని పోల్చుకుంటే ఏదో స్వర్గంలా వుంది మద్రాసు

రోడ్డు మీద అటూ ఇటూ మూసి వేసి కనిపిస్తున్న షాపుల్ని, సినిమా థియేటర్లని ఆసక్తిగా చూస్తున్నాడు చక్రవర్తి. జెమిని స్టుడియో దగ్గర మలుపు తిరిగింది ఆటో ఆ స్టుడియో బోర్డు చూసి ఎంతో సంతోష పడ్డాడు చక్రవర్తి హఠాత్తుగా తానెంతో పెరిగిపోయినట్లు భావన కలిగింది అతనికి.

వాణీమహల్ మీదుగా పానగల్ పార్కు దగ్గరకు వచ్చింది ఆటో.

"ఎక్కడికి వెళ్ళాల్సార్ "

పాండీ బజారు" చెప్పాడు చక్రవర్తి, ఎదురుగా కనిపించేదే పాండీబజారు అని తెలియక

నవ్వుకుంటూ మరికొంత ముందుకు తీసుకు వెళ్ళి చెప్పాడు ఆటో వాడు ఇదే సార్ పాండీబజారు "

ఆ రాత్రికి ఏదైనా హోటల్లో వుంటే మంచిదనిపించింది చక్రవర్తికి. ఆ విషయమే ఆటో వాడికి చెప్పాడు. దగ్గరలో వున్న ఓ హోటలుకు తీసుకెళ్ళాడతను.

రూము తీసుకున్నాడు చక్రవర్తి. ఒళ్ళంతా జిడ్డుగా అనిపించటంతో స్నానం చేసి మంచం మీద వెల్లకిలా పడుకున్నాడు సిగరెట్ వెలిగించాడు తల నిండా ఆలోచనలు

ఆ ప్రదేశం, ఆ మనుషులు, ఆ భాష అంతా కొత్తగా వుంది. తనకేమి తెలియని ఏదో కొత్త జీవితంలో ప్రవేశించినట్లు అనిపిస్తోంది చక్రవర్తికి. ఒక్క మనిషి కోసం అందరినీ వదలి, ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఏదో సాధించాలని ఎడారి బాటసారిలా ఇలా వచ్చేసిన తన జీవితం ఎలా ప్రయాణిస్తుంది ఏ మలుపు తిరుగుతుంది? ఏమీ అర్థం కాలేదు చక్రవర్తికి. అగమ్య గోచరంగా వుంది అంతా

మరో సిగరెట్ వెలిగించాడు. నిద్ర రావటం లేదు. అర్థంకాని ఆలోచనల గజిబిజి రేపేమిటి అన్న ప్రశ్న ఏం చెయ్యాలి అన్న సందేహం. ఎలా ముందుకు అడుగు వెయ్యాలి అన్న సంశయం సాఫీగా సాగిపోతున్న బ్రతుకులో విఫలమైన ఓ కోరిక చేసిన సాహసం ఎలా దారి తీస్తుంది. చివరికి ఏం చేస్తుంది.

సూట్‌కేస్ లోంచి డబ్బు తీసి లెక్క పెట్టుకున్నాడు. ఆ డబ్బు అయిపోయే లోపల తానేమైనా చెయ్యాలి తన భవిష్యత్తుకు మిగిలిన ఆఖరి ఆధారం అది. అది అయిపోయే లోపలే రాబడి వచ్చే మార్గాన్ని వెతుక్కోవాలి.

'ఏ భవిష్యత్తు పాడు చేసుకోకు' అన్న నీలిమ మాటలు. కళ్ళ ముందు

నీలిమ రూపం తన కసలు భవిష్యత్తు వుందా ఉంటే ఏ విధంగా! ఎన్నో ప్రశ్నలు ఇలా తను వచ్చేశానని తెలిస్తే నీలిమ ఏమనుకుంటుందో? ఎలా భావిస్తుందో, ఏమని ఆలోచిస్తుందో ఎలా తెలుస్తుంది తనకు

నీలిమ, ప్రభాకర్, రేఖ అందరి రూపాలూ కళ్ళ ముందు కదిలాయి ప్రపంచంలో తాను ఎవ్వరూ లేని ఒంటరివాడన్న భావం మనసును ఆక్రమించుకుంది ఏదో నిర్లిప్తం

రాత్రి చాలా సేపు మేలుకుని వుండటం వల్ల ఉదయం తొమ్మిది గంటలకు మెలుకువ వచ్చింది ఆలస్యంగా నిద్ర లేచిన కొత్త ఉదయం స్నానం చేసి పాండీబజారులోకి వచ్చాడు చక్రవర్తి పరిసరాలను పరిశీలిస్తూ ఓ చెట్టు నీడన నిలబడ్డాడు

ఎవరి దగ్గరికి వెళ్ళాలి తాను రచయితనని, సినిమాకు రచన చేసే అవకాశం ఇవ్వమని ఎవరిని అడగాలి అడిగిన వెంటనే ఇస్తారా? అనుకున్నాడు సిగరెట్ల కోసం జేబులో చేయి పెట్టాడు అయిపోయాయి

గీతా కేఫ్ ప్రక్కన వున్న బంకులో సిగరెట్లు కొని వెలిగించి తలెత్తాడు వివిధ తెలుగు తమిళ మలయాళ పత్రికలు వేలాడ గట్టి వున్నాయి వరుసగా

అందులో ఒక పుస్తకం చక్రవర్తిని ఆకర్షించింది అది తెలుగు సినిమా డైరీ సినిమారంగంలోని నటీనటుల, సాంకేతిక నిపుణుల అడ్రసులు, ఫోన్ నెంబర్లు అందులో వుంటాయి వెంటనే కొన్నాడా పుస్తకాన్ని

తిరిగి అదే చెట్టు క్రింద నిలబడి ఆ పుస్తకాన్ని పరిశీలించ సాగాడు

హలో ఏమిటి షూటింగ్ లేదా చక్రవర్తి ప్రక్కన వున్న వ్యక్తిని ఎవరో పలకరించారు

"లేదు నిన్నటితో అయిపోయింది కళ్యాణి వాళ్ళకు డబ్బింగు చెప్పాలి ఇవ్వాళ"

ఆ ఇద్దరినీ పరిశీలనగా చూశాడు చక్రవర్తి వాళ్ళను ఏ సినిమాలోనూ చూసినట్లు గుర్తుకు రావటం లేదు వాళ్ళ మాటలను ఆసక్తిగా వినసాగాడు

'ఎక్కడ"

"ఏ వి ఎమ్ లో '

డైరక్టరుగారు కొత్తది మొదలెట్టారటగా

'ఔను ఎల్లుండి రికార్డింగు '

డైరక్టరు గార్ని కలవాలి ఇందులో తప్పకుండా ఏదో ఒకటి చూస్తానన్నారు '

ఆ డైరక్టరు ఎవరో అర్థం కాలేదు చక్రవర్తికి కాని తన ప్రక్కన వున్న వాళ్ళకు సినీరంగంతో మంచి పరిచయం వుందనిపించింది 'వాళ్ళకు పరిచయం చేసుకుని తన విషయం చెబితే' అనుకున్నాడు

'ఓ 'టీ' కొడదామా" ఇంతలో మొదటి వ్యక్తి అన్నాడు

పద కదిలారు ఇద్దరూ

పాండీబజారు ఆ చివర నుంచి ఈ చివర దాకా అటూ ఇటూ తిరిగాడు చక్రవర్తి కనిపిస్తున్న షాపులను, మనుషులను ఆసక్తిగా చూస్తూ నడిచాడు రోడ్డు మీద పోతున్న ప్రతి కారునూ గమనించ సాగాడు సినిమా వాళ్ళు ఎవరైనా కనిపిస్తారేమోనని

రాజకుమారి థియేటరు దగ్గర ఆగాడు ఆకలి వేస్తున్నట్లు అనిపించింది ఎదురుగా వున్న ఏదో హోటలులో దూరి భోజనం చేశాడు సిగరెట్ వెలిగించుకుని నెమ్మదిగా తన హోటలుకు వచ్చాడు

విశ్రాంతిగా మంచం మీద వాలి 'సినిమా డైరీ'ని తిరగేయ సాగాడు చక్రవర్తి డైరక్టరు సత్యం ఫోటో కనిపించింది ఒక పేజీలో

సినిమారంగంలో సత్యానికి డైరక్టరుగా చాలా పేరుంది ఆయన తీసిన సినిమాల్లో చాలా భాగం బాగా ఆడి డబ్బు చేసుకున్నాయి ప్రేక్షకుల్లో కూడ సత్యం సినిమా అంటే ఒక ప్రత్యేక ముద్ర వుంది సినిమా ఫీల్డుకు ఎందరో కొత్త వారిని పరిచయం చేసిన, ఘనతా ఆయనదే ఆయన పరిచయం చేసిన నటీనటుల్లో చాలా మంది ఈ రోజు ఉన్నత స్థానంలో వున్నారు

ముందుగా డైరక్టరు సత్యాన్ని కలవాలనుకున్నాడు చక్రవర్తి ఆయన తన లాంటి రచయితకు తప్పక అవకాశం ఇస్తాడని నమ్మకం కుదిరింది అడ్రసు చూశాడు 'నాగార్జున నగర్' అని వుంది అదెక్కడో వెతుక్కుని ఇంటికే వెళ్ళాలి

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ కవరుమీద శీర్షికపేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి — హామీపత్రం జతచెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు — వారి స్వంత చిరునామాగల తగినన్ని **తపాలాబిళ్ళ** లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనేగాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటి పై నిర్ణయంకోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు. కాని— తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు — రచన పేరు — అది పంపినతేదీ, వాటి గురించి **వివరంగా తెల్పనిదే** పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్ళలంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్‌లు పంపేవారుకూడా ఎనిమిది వారాలలోగా మా మీద ఉత్తరాలదాడి చెయ్యకూడదు . . ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్‌ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలువెంబడి జరుగుతుంది.

★ రచయితలకు, కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తతిమ్మా అందరికి] అవి పడ్డ ''ప్రతు''లను — కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. **సం॥**




**వై. బి. డి. – హైదరాబాద్**

నా వయస్సు 18 సంవత్సరములు నాకు తరచు శరీరం అంతా నీరసంగా వుండి తరచు తల నెప్పి వస్తూ వుంటుంది

★ మీరు ప్రతి రోజు కాల్షియం, మల్టీ విటమిన్ మాత్రలు వేసుకోవటం మంచిది. ప్రతి రోజూ విధిగా రాగుల పిండితో చేసిన జావ త్రాగటం మంచిది.

**ఎ. ఎస్. ఆర్. – అనంతపూర్**

మా అమ్మాయి వయస్సు 40 సంవత్సరములు ఆయాసం, వళ్ళంతా వాచి పోవటం, చాలా ఆకలిగా వుండటం, నిద్ర పట్టక పోవటం, నీరసం మొదలైనవి వున్నాయి వీటికి ఏమైనా మందులు వున్నాయా? ఆపరేషన్ చేయించాలా?

★ బ్లడ్ షుగర్, యూరిన్ షుగర్ మొదలైన పరీక్షలు, బ్లడ్ ప్రెషర్, ఛాతీ ఎక్స్‌రే, ఇ. సి. జి., బ్లడ్ కొలెస్టరాల్ మొదలైన పరీక్షలు చేయించి డాక్టర్‌కి చూపించండి. రోగ నిర్ధారణ తర్వాత మందులతో తప్పక నయమవుతుంది శస్త్ర చికిత్స, ప్రమేయం లేదు.

**ఆర్. టి. కె. – హాలహర్వి**

నా వయస్సు 18 సంవత్సరములు అప్పుడప్పుడు నా నోటి నుండి దుర్వాసన వస్తుంది కొద్ది రోజులుంటుంది పళ్ళపై పేరుకొన్న పాచి పోవుటకు ఏమైనా లిక్విడ్ మెడిసిన్ వుంటే తెల్పండి

★ నోటి దుర్వాసనకి దంత రోగాలు, అజీర్తి, సెప్టిక్ టాన్సిల్స్ ముఖ్య కారణాలు. వీటికి గాను పరీక్షింప చేసుకొని తగిన మందులు వాడండి. దంతాలపై పేరుకొన్న 'పాచి' పోవటానికి దంత వైద్యుల చేత క్లీన్ చేయించుకో వలసి వుంటుంది. అటు పిమ్మట దంతధావనకి తగిన శ్రద్ధ వహించ వలసి వుంటుంది.

**పి. ఎస్. – విజయవాడ**

నా వయస్సు 25 సం లు పెళ్ళి అయి 2 నెలలు అయింది. రెండు సం ల వరకు పిల్లలు కావాలనే కోరిక లేదు నా భార్యకి లూప్ వేయించుకోవటం యిష్టం లేదు నేను నిరోధ్ వాడటం బాగా లేదు కావున టాబ్లెట్స్ చెప్పండి

★ ఒవ్యు లెన్, లేక ఒవ్రాల్ మొదలయిన మాత్రలు రోజుకి ఒకటి వంతున వాడండి. వీటి వాడకం ముందు వైద్యులు పరీక్ష చెయ్యటం మంచిది.

**ఎం. బి. – మచిలీపట్నం**

మా అమ్మాయి వయస్సు 16 సంవత్సరములు ఇంకా పెద్ద మనిషి కాలేదు నాకు చాలా విచారముగా వున్నది అమ్మాయి చాలా సన్నగా వుంటుంది దీనికి ఏమైనా మందులు వాడాలా?

★ కొందరు ఆలస్యంగా మెచూర్ అవటం సహజమే అయినా గర్భసంచీ మొదలయినవి సక్రమంగా పెరిగినదీ లేనిదీ లేడీ డాక్టర్లు రెక్టల్ ఎక్సామినేషన్ ద్వారా పరీక్షచేసి చెప్పగలరు. రోగం వున్నదీ, లేనిదీ తెలియకుండా మందుల అవసరం [illegible] ☐

## ఆరోహణ

అనుకున్నాడు.

ఆ పుస్తకమంతా తిరగేసి తాను ఎవరెవర్ని కలవాలనుకుంటున్నాడో వాళ్ళ అడ్రసులు, ఫోన్ నెంబర్లు పెన్నుతో గుర్తు పెట్టుకున్నాడు

ముందుగా హోటలు ఖాళీ చేసి వుండటానికి చవగ్గా ఏదైనా రూము వెతుక్కోవాలి తన దగ్గర వున్న డబ్బుతో హోటలులో నెల రోజులు కూడ వుండలేడు ఈ లోపల ఏ మార్గమూ దొరక్కపోతే ఆ తరువాత బ్రతుకు దుర్భరం అవుతుంది

ఆలోచనల్తో అలాగే నిద్రపోయాడు చక్రవర్తి తిరిగి మెలుకువ వచ్చేసరికి సాయంత్రం అయింది స్నానం చేసి పాండీబజారులోకి వచ్చాడు.

హమీదియాలో టీ తాగి దాని ప్రక్క సందులో వున్న ఆంధ్రా కిళ్ళీ షాపు వద్ద నిలబడి సిగరెట్ వెలిగించాడు రేపటి నుంచి ప్రయత్నాలు మొదలెట్టాలి. ముందుగా డైరక్టర్ సత్యాన్ని కలుసుకోవాలి అనుకున్నాడు

అటూ ఇటూ పరికించాడు చక్రవర్తి నలుగురైదుగురు ఒక చోట చేరి మాట్లాడుకుంటున్నారు అందరి మాటల్లోనూ సినిమా విషయాలే దొర్లుతున్నాయి సినిమాల్లో చిన్న చిన్న వేషాలు వేసే ఇద్దరు నటులు దూరంగా కనిపించారు చక్రవర్తికి వాళ్ళను పలకరించాలనుకున్నాడు

మరికొద్ది రోజుల్లో తానూ సినిమా పరిశ్రమలో ఒక భాగం అవుతాను కదా అని చిరునవ్వు నవ్వుకున్నాడు చక్రవర్తి.

చక్రవర్తికి ఎదురుగా ప్లాట్‌ఫారం మీద ఓ తోపుడు బండి నిలబడి వుంది. మరమరాలు, టమాటలు, నిమ్మకాయలు, ఉల్లిపాయలు, కొత్తిమెర అందంగా పేర్చి వుంది ఆ బండి మీద ఒక వ్యక్తి చకచకా అవన్నీ కలిపి ప్లేటులో పెట్టి అడిగిన వాళ్ళకు అందిస్తున్నాడు అక్కడే నిలబడి తింటున్నారు అంతా.

చక్రవర్తికీ తినాలనిపించి బండి దగ్గరకు వచ్చాడు. ఓ ప్లేటుకు ఆర్డరు ఇచ్చాడు. అన్నీ కలిపి మరమరాల పైన కోసిన టమాటా ముక్కల్ని అందంగా అమర్చి అందించాడు ఆ వ్యక్తి నెమ్మదిగా తిన సాగాడు చక్రవర్తి.

'ఏం గురూ ఎలా వుంది బిజినెస్సు" ఎవరో పలకరించారు బండి అతన్ని.

"ప్రమాదం" నవ్వుతూ అన్నాడు అరవంలో అరవంలో 'ప్రమాదం' అంటే బ్రహ్మాండం' అని అర్థం

'సినిమా కంటే ఇదే బావుందా."

"సినిమా హీరో కావటం ఆశయం గురూ అంతవరకు బ్రతకాలిగా. దానికిదో మార్గం" అన్నాడు ఆశగా బండివాడు.

ఉలిక్కి పడ్డాడు చక్రవర్తి ప్లాట్‌ఫారం మీద తిను బండారాలమ్ముకుంటున్న ఈ వ్యక్తి సినిమా హీరో కావాలని వచ్చాడా అని.

'ఏమైనా వేస్తున్నావా '

"ఆఁ తమిళంలో ఇద్దరు ఇస్తామన్నారు మంచి వేషాలే. రేపు నెల మొదలౌతాయి."

"మరి ఈ బండి, ఈ బిజినెస్సు" సందేహంగా అడిగాడు మొదటి వ్యక్తి

"వేషం దొరగ్గానే వ్యాపారం మూసేస్తాను ఖాళీగా వున్నపుడు మళ్ళీ తెరుస్తాను" అన్నాడు చాలా తేలిగ్గా, ఎంతో ఆశగా ఆ వ్యక్తి

ఆ మాటలతో ఒక పాఠం నేర్చుకున్నాడు చక్రవర్తి. ఆశ నడిపిస్తోంది అక్కడి మనుషులను నమ్మకం ఊపిరి పోస్తోంది అక్కడి ప్రాణులకు, ఈ రోజు ఎలా వున్నా రేపు బావుంటుందన్న ఊహే ప్రాణం వాళ్ళకు

కదిలాడు చక్రవర్తి అక్కడ నుంచి రాజకుమారి వైపు నడుస్తున్నాడు. దాదాపు అతన్ని రాసుకుంటున్నట్టుగా ప్రక్కగా ఆగింది ఓ కారు అందులోంచి ఓ స్త్రీ ఓ పురుషుడు దిగి ఎదురుగా వున్న బట్టల షాపులోకి వెళ్ళారు.

ఆమెను ఎక్కడో చూసినట్టు అనిపించింది చక్రవర్తికి వెంటనే గుర్తుకు రాకపోవటంతో షాపు బయటే నిలబడి ఆమెను పరిశీలనగా చూశాడు. కాసేపు చూసిం తరువాత గుర్తుకు వచ్చింది చక్రవర్తికి. ఆమె సినిమాల్లో తల్లి పాత్రలు వేస్తూ వుంటుంది. ముసలి పాత్రలు వేస్తున్నా వయసులోనే వుంది అనుకున్నాడు మెల్లగా అక్కడ నుంచి కదిలాడు చక్రవర్తి. (ఇంకా వుంది)

అనుమానాలు ఎక్కువ. ప్లీజ్.... ఆమె గురించి మీకేం తెల్సో దాచకుండా చెప్పండి...." అన్నాడు బ్రతిమాలు తున్న ధోరణిలో.

"........" సుందర్రావ్ మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తూ అన్యమనస్కంగా తినటంలో నిమగ్నం అయ్యాడు.

మళ్ళీ రఘురామ్ అన్నాడు.

సార్ ఒకవిధంగా నాది పొరపాటే మిమ్మల్ని ఇలా ఇబ్బంది పెట్టటం సమంజసం కాదు కాని . ఆమె.... మీ తోడబుట్టిన అక్కో చెల్లో కాదుకదా? నిర్మొహమాటంగా ఆవిడ గురించి మీ అభిప్రాయం చెప్పండి.. "

సుందర్రావ్ తినటం ఆపి చిన్నగా నవ్వాడు.

"స్వంత అక్కో చెల్లో అయితే తప్పకుండా చెప్పేవాడ్ని. భయపడవలసిన పని లేదు. కాని పరాయి ఆడవాళ్ళ గురించి చెడు చెప్పకూడదన్నది నా పాలసీ. ఎందుకంటే నాకూ ఇద్దరు ఆడపిల్లలు వున్నారు...."

"నిజమే అనుకోండి. మీతో నేను ఏకీభవిస్తున్నాను. కాని చూడండి..... మా అన్నయ్య తన కాబోయే భార్య గురించి మంచి చెడ్డలు విచారించటం తప్పులేదుకదా? పెళ్ళంటే నూరేళ్ళ పంట. మంచైనా చెడు అయినా పెళ్ళికి ముందే తెలిస్తే బాగుంటుంది. కాని తీరా పెళ్ళయ్యాక తెల్సి భార్యా భర్తల మధ్య మనస్పర్ధలు చెలరేగి.... వాళ్ళు విడిపోయేదాకా రావటం..... లేదా కీచులాటలు..... తగాదాలు.... అది మాత్రం ఏం మంచిది చెప్పండి?

ఒక వ్యక్తి గురించి అనుమానం అన్నది మనసులోకి రాకుండా వుండాలే గాని వస్తే అమితుమి తేల్చుకోవటమే మంచిదని నా అభిప్రాయం...."

"..... . .!"

"మీరు నిజంగా వసంత శ్రేయోభిలాషి అయితే ఆమెగురించి ఏదీ దాచకుండా మీ అభిప్రాయం చెప్పండి...."

సుందర్రావ్ చిన్నగా నిట్టూర్చాడు.

అయిష్టంగా తప్పదన్నట్లు అన్నాడు.

"సరే..... ఇంతగా అడుగుతున్నారు గనక చెప్తున్నాను. వసంత మా సెక్షన్‌లో గత మూడు సంవత్సరాలుగా పని చేస్తూంది మనిషి చాలా తెలివైనది. చాలా అందమైనది. కాని...."

". ..!?"



# ఇ·వేమన·పద్యాలు




పాల గలయు నీరు పాలయి రాజిల్లు
నదియు పానయోగ్యమైనట్లు
సాధు జనుల యొక్క సాంగత్యముల చేత
మూఢజనుడు మొనయ ముక్తి వేమ

"కాని ఆమెకి అందానికి తగ్గ అణకువ లేదు. మాట వాలా పెడసరం అంతేకాదు చాలా ఫ్రీ బర్డ్! మా సెక్షన్ మేనేజర్‌తో ఆమెకువాలా దగ్గర సంబంధాలు వున్నాయి. అతని కారులో తరచూ ఈవిడ సినిమాలు, షికార్లు చేస్తుంది. అంతేకాదు. బయట కూడా ఈవిడకి చాలామంది ఫ్రెండ్స్ వున్నారు ఆఫీసు వదిలే సమయానికి స్కూటర్లమీద వస్తారు. తల్లి తండ్రులు ఎక్కడో దూరంగా పల్లెటూళ్ళో వుంటారు. ఈ అమ్మాయి ఒంటరిగా హాస్టల్‌లో

## ప్రతీకారం

వుంటుంది పెద్దవాళ్ళ అదుపులేక అలా తయారయ్యిందని చాలామంది అంటారు..

అసలు ఇంతెందుకు సార్? ఒక్క మాటలో చెప్పాలంటే ఆమె ఇల్లాలిగా తగదు. గరల్ ఫ్రెండ్‌గా అయితే నెంబర్ వన్‌గా క్లాసుగా వుంటుంది. కాని ఉద్యోగం మాత్రం చాలా మంచిది. పన్నెండు వందలదాకా వస్తుంది. డిపార్ట్‌మెంటు టెస్టులన్ని పాసయింది తొందర్లోనే ప్రమోషన్ కొట్టు కుంటుంది కాబట్టి ఆపైన మీ ఇష్టం... ఆలోచించుకోండి " అన్నాడు చెప్పటం ఆపి దీర్ఘంగా నిశ్వసిస్తూ

రఘురామ్ మొఖం కత్తి వేటుకి నెత్తురు చుక్క లేనంతగా తెల్లగా పాలిపోయింది

సుందర్రావ్ ఖంగారు పడ్డాడు

సారీ సార్ మీరు బాధపడుతున్నారుకదూ? అందుకే చెప్పనన్నాను కాని.

బలవంతాన పెదవులమీదికి నవ్వు తెచ్చుకున్నాడు రఘురామ్

'ఇట్స్ ఆల్‌రైట్ సర్!" అంటూ మృదువుగా సుందర్రావ్ చేతిని స్పృశించి వదిలాడు

సుందర్రావ్ భోజనం ముగించి వాష్ బేసిన్ దగ్గరకి వెళ్ళి చేతులు కడుక్కొని వచ్చాడు

ఇంతలో రఘురామ్ లేచి వెయిటర్ అందించిన బిల్ తెసుకుని కౌంటర్‌లో 'పే' చేసి వచ్చాడు

ఎందుకుసార్! నేను ఇచ్చేవాడ్ని కదా? మీరు తిన్నది తక్కువ నేను తిన్నది ఎక్కువ." మొహమాట పడ్డాడు సుందర్రావ్

నో నో మీరు అలా ఫీల్ అవద్దు సార్. మీరు నాకు చేసిన సహాయం కూడా ఎక్కువే లైఫ్ స్ట్రగుల్ కాకుండా చేశారు వసంతతో మాచ్ చూసింది మా అన్నయ్యకి కాదు నాకే

ఆఁ !?

అవును ఖంగారు పడకండి మీరు నాకీ నిజం చెప్పి నా నెత్తిమీద పాలు పోశారు లేకపోతే ఆవిడ్ని పెళ్ళి చేసుకుని నా మెడకి నేనే ఉరితాడు బిగించుకుని వుండేవాడ్ని. థాంక్స్. " అంటూ గబగబా పాఠం అప్పచెప్పినట్లు చెప్పి మరో మాటకి ఆస్కారం లేకుండా గభాల్న లేచి వేగంగా వెళ్ళిపొయ్యాడు

వెళ్ళిపోతున్న రఘురామ్‌కేసి చూస్తూ జాలిగా చిన్నగా నిట్టూర్చాడు సుందర్రావ్.

మరో నిమిషం అతని కంటి కొసలు అవమాన భారంతో ఎర్రగా పదును తేరాయి.

పెదవులమీద క్రూరమైన చిన్న నవ్వు వికృతంగా కదిలింది

"వసంతా! ఆరోజు .. రికార్డ్ స్టోర్ రూమ్‌లో ఏదో కాస్త సరదాగా చెయ్యి పట్టుకున్నానని నా చెంపమీద కొట్టావ్‌కదూ? ఆఫీసులో పదిమంది ముందు గోల చేసి నా పరువు తీశావుకదూ? ఆఫీసర్‌కి చెప్పి నాకు "మెమో" ఇప్పించావు కదూ? .... ఇప్పుడు చూడు నీ బ్రతుకుమీద ఎలా దెబ్బ తీశానో ..."

కసిగా పళ్ళు కొరుక్కున్నాడు.

ప్రతీకార జ్వాలతో మండుతున్న అతని మనసుమీద చల్లటి నీళ్ళు కడవతో గుమ్మరించి నట్టు ప్రశాంతంగా అయ్యింది

మీసం మీద చెయ్యేసి మెలేస్తూ 'బ్రేవ్'మని తేన్చి చిద్విలాసంగా నవ్వుతూ కుర్చీలోంచి లేచి స్కూటర్ వైపు అడుగులు వేశాడు . ఇద్దరు ఆడపిల్లల తండ్రి ది గ్రేట్ సుందర్రావ్ ఫార్టీ ఇయర్స్ ఓల్డు!! ❑

# తను ఇచ్చే సలహా డాక్టరూ పాటిస్తారు!

డాక్టరు వృత్తి చాలా కష్టమైనది. తరచు అర్జంటు కేసులు వస్తాయి. రోగులని చూస్తూ
అనేక గంటలసేపు పని చేయవలసి వస్తుంది. రాత్రనక, పగలనక రోగులు వస్తూనే
ఉంటారు. కాదనకుండా వాళ్ళని చూడాలి. చెప్పలేనంత అలసట వస్తుంది.
అందుకే నేను హార్లిక్స్ మీదే ఆధారపడతాను.
హార్లిక్స్, పోషక శక్తినిచ్చే పదార్థాలు గల రుచికరమైన, ఉత్సాహాన్నిచ్చే పానీయం.
రోజంతా పనిచేసి అలసిపోయిన తరువాత హార్లిక్స్ త్రాగితే ఆ అలసటంతా పోతుంది.
అందుకే నేను రోజుకి రెండు సార్లు హార్లిక్స్ త్రాగమని ఎప్పుడు సలహా యిస్తాను.
నాకు బాగా తెలుసు. నేనుకూడా త్రాగుతాను.




ప్రపంచ మంతటా డాక్టర్లు నమ్మినది.

మాల్టెడ్ బార్లీ వెన్నతో కూడిన పాలు బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్ముతారు 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?




మంచి పుష్టికరమైనది

HMM-9239 TEL



# అభినేత్రి భానుప్రియ సమాధానాలు

. గోపాల్, విజయవాడ-4 ·

నటుడు గాని, నటి గాని కావాలంటే ఏది ముఖ్యం? బనా? అందమా?

ఆ రెండూనూ!

. నాగరాజు నాయుడు, మాగాండ్లపల్లి

చలన చిత్ర పరిశ్రమ నాట విశిష్టత, ఈనాటి ష్టతను గూర్చి తెల్పండి

నాడు నాడే - నేడు నేడే. విశిష్టత ిష్టతే!

'జమల్లు్య యాదవ్,

మీ చెల్లెలు రేఖ పేల్పులోకి అడుగు పెట్టింది కదా' ి మీకు పోటీ అయితే, మీ భవిష్యత్తు ఏమిటి?

అందరి భవిష్యత్తునూ నిర్ణయించేది ి భగవంతుడు!

ు. రాజేశ్వరి, చిత్తూరు-2

ుక కళాత్మకమైన చిత్రములో నటించునప్పుడు ఏ మైన అనుభూతికి లోనవుతారు?

కళాత్మకమైన అనుభూతికి

శ్రీనివాస్, హైదరాబాద్

ుువర్ పెర్ఫార్మెన్స్ ఇన్ 'మంచి మనసులు ఈజ్ స్టా ఆర్డినరి లెట్ మి నో హౌ కుడ్ యూ తూ ఇట్'

సై ఇన్‌వాల్వింగ్ ఇన్ ది కారెక్టర్ అండ్ స్ట్ది సోల్ ఆఫ్ ఇట్!

ఎ. శాంతిప్రియ, విజయనగరం

.పాపశిఁ పటాసులు కాలుస్తూ ఫోనులో మి లిఁ వినిపించినట్లు ఒక వీక్లీలో రాశారు మి లు మితోనే ఉన్నట్లు రాశారో ఇదెలా సాధ్యం?

ఆప్పుడు మా చెల్లి నా పక్క గదిలో ఉనుకోండి-

ధే వీర వెంకట శ్రీనివాసరావు, ర్యాపురం

ూ అభిమాన హీరో కమలహాసన్ సరసన మిరు ్ చూడాలని ఉన్నది నా కోరిక తీరుతుందా?

ారవచ్చు! మమ్మల్నెవ్వరైనా ఏ నిర్మాతైనా ి చేస్తే!

నరసింహకుమార్ దాసు, ఇచ్ఛాపురం

భానుప్రియగారూ!, మనదేశ సంస్కృతిని తెల్పే మన దేశంలో పుట్టిన నాట్యాల్ని మన వాళ్ళు ఆదరించరు ఇతర దేశాలలో ఆదరిస్తారు కారణం?

ఆదరించడం లేదని ఎవరన్నారు!

## ఉత్తమ ప్రశ్న

తోకల నారాయణరావు, మచిలీపట్నం

ఏ వయసుకు ఆ ముచ్చట అంటారు పెద్దలు ఐనా, సినిమాతారలు వయసు మీరిన తర్వాత వివాహం చేసుకుంటారుకదా? మీ అభిప్రాయమేమి?

వయసుకీ వివాహానికీ సంబంధం ఏమిటి?

జి. విజయకుమార్, మహబూబాబాద్

మీ దృష్టిలో నటన గొప్పా? నాట్యం గొప్పా?

రెండూ!

వై వి. రమణరావు, శ్రీకాకుళం

తెలుగు సినీరంగానికి భాను తేజముతో మీ పకు వచ్చిన మీ రాక ఆకస్మికమా, లేక బుద్ధి పూర్వక ప్రయత్నమా?

ఆకస్మికమైన బుద్ధి పూర్వక ప్రయత్నము.

సుఖము కొరకు కోరిక జనించును కోరిక నుండియే విరక్తి కలుగును మరల విరక్తి నుండియే కోరిక జనించును కామెంట్ ప్లీజ్?

మరల కోరిక నుంచి విరక్తి - దాని నుండి అనురక్తి వగైరా వగైరా... ఇదో చక్ర భ్రమణం!

ఎం విజయకుమార్, జబల్‌పూర్

ఈ నాటి యుగంలో జరుగుతున్న అన్యాయ అక్రమాలను అరికట్టడానికి, స్త్రీకి పూర్తి రక్షణ కల్పించడానికి పూనుకునే నాదుడున్నాడా?

లేడు.

కాళంగి వెంకటేశ్వర మల్లికార్జునరావు, ప్రత్తిపాడు

ఆశకలిగిన రోజు బ్రతకాలని కాంక్ష నిరాశ కలిగిన రోజు చావాలని కాంక్ష ఏ ఆశాలేని రోజు

ఏ కాంక్షా వుండదు

వై. నాగు, తుని

మీరు సినిమాలోకి రాకముందు ఏం చేసేవారు?

చదివేదాన్ని.

ఎంతవరకు చదివారు?

-మెట్రిక్ వరకూ.

ఎన్ టి ఆర్ గారిపైమీ అభిప్రాయ మేమిటి?

-గౌరవ మైనది.

గాలి నర్సింహారావు, హైదరాబాద్

చిత్ర పరిశ్రమలో స్థిర స్థానంలో ఉన్న మీరు ప్రేక్షకుల గుండెల్లో చిరస్థాయిగా (సావిత్రిలా) నిలిచిపోగలరన్న నా ఆశ తీరుతుందా?

తీరుతుంది. □

కూపన్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ____________________

____________________

____________________

పంపిన వారి పేరు ____________________

పూర్తి చిరునామా ____________________

____________________

# అభిమాన తారలపై అభిప్రాయం

నా అభిమాన నటుడు "చిరంజీవి" సినివినీలాకాశంలో తన ప్రతిభతో ప్రజల మనస్సును దోచుకొని చుక్కల్లో చంద్రుని వలె తారాపథానికి దూసుకు పోయే సూపర్ రాకెట్ "సుప్రీమ్ స్టార్".

"పునాది రాళ్ళు" చిత్రం నుండి రాక్షసుడు చిత్రం వరకు అనేక పాత్రలు ధరించి, ఉన్నత శిఖరాలను అధిరోహించి ఎందర్నో ఆకట్టుకున్న చిరంజీవి



అభినందనీయుడు.

కోటి రూపాయలతో 'చారిటబుల్ ట్రస్ట్' స్థాపించి సినీ పరిశ్రమలో ఉన్నత స్థానాన్ని ఆక్రమించిన చిరంజీవి ఇక ముందు కరాతకుడు వేట పంటి చిత్రాల్లో నటించవద్దని ఆయన అభిమానిగా కోరుకుంటున్నాను

—కె. మాణిక్యాలరావు, న్యూసింగ్‌నగర్,
విజయవాడ

★ ★ ★

నా అభిమాన హీరో "యువకిషోర్" వెంకటేష్ అతను నటించిన మొదటి చిత్రం 'కలియుగ పాండవులు"తో నే నటుడిగా చిత్ర సీమలో ప్రత్యేక స్థానము ఏర్పర్చుకొని, ఇటు ప్రేక్షక లోకములో ముఖ్యముగా యువతీరం మనస్సుల్లో "యువతరం డైనమిక్ హీరో"గా నిల్చిపోయాడు. ఇప్పుడు అతని రెండవ చిత్రముగా విజయ ఢంకా మ్రోగిస్తున్న "బ్రహ్మరుద్రులు"లో అతని నటన అగ్రశ్రేణి నటుల



స్థాయిలో వుంది యువతరం మనస్సుల్లో బ్రహ్మరథం పట్టించింది.

కేవలం మాస్ చిత్రాలకే పరిమితం కాకుండా, ప్రేమ, కుటుంబ పరమైన సెంటిమెంట్ చిత్రాలలో నటించి "సూపర్ స్టార్" కావాలని అభిమానిగా నా కోరిక.

-పి. శశిధర్, బచ్చుపేట,
మచిలీపట్నం.

నా అభిమాన కథానాయిక భానుప్రియ. ఆమె మొదటి సినిమా "సితార"తో నే నటనతో అందరి మన్ననలు పొంది, నాట్యంలో కూడా ప్రతిభ చూపించిన భానుప్రియ నా అభిమాన నటి. కళ్ళతో నే హావ భావాలు పలికించే చాల చక్కటి నటి ఆమె. 'అన్వేషణ' 'ప్రేమించు పెళ్ళాడు''విజేత', 'పవిత్ర', 'అనసూయమ్మ గారి అల్లుడు', 'చాదస్తపు మొగుడు' చిత్రాలలో ఎవ్వరికి తీసిపోని నటనను



ప్రదర్శించిన భానుప్రియ ఇక నుంచి నాట్య ప్రధానమైన చిత్రాలలో నటిస్తు ఉత్తమ నటిగా జాతీయ అవార్డు పొందాలని నా ఆకాంక్ష

-కె. ఉమ, రామానగర్, నిడదవోలు

★ ★ ★

యువకిశోరం బాలకృష్ణ గారంటే నాకు ఎనలేని అభిమానం

హీరోగా 'సాహసమే జీవితం'లో నటించి 'మంగమ్మగారి మనవడు' అయి కలక్షన్స్‌లో నూతన రికార్డులు సృష్టించి సురేష్ ప్రొడక్షన్స్ వారి 'కథానాయకుడు'గా విజృంభించి ఆ సంస్థకు ఎనలేని రికార్డులు సృష్టించి 'పట్టాభిషేకం' జరిపించుకొని ఇద్దరు ముద్దు గుమ్మల మధ్య "ముద్దుల క్రిష్ణయ్య" అనిపించుకొని ఆరుకోట్ల తెలుగు ప్రజలచే "అనసూయమ్మగారి అల్లుడు"గా



కొనియాడబడుతూ మొదటిసారిగా కోటి రూపాయలు మొదటి వారం చిత్ర పరిశ్రమకు చూపించి చిత్ర పరిశ్రమలో అందరి బాగోగులు గమనించి నూతన సంవత్సరంలో మరెన్నో మంచి పాత్రలు ధరించి ప్రేక్షకులలో చిరస్థాయిగా వుండాలని కోరుకుంటూ రాబోవు "భార్గవ రాముడు" రికార్డులు సృష్టించాలని భగవంతుని ప్రార్థిస్తున్నాం.

-పి. శ్రీనివాసరావు, శ్రీకాకుళం

నట బెబ్బులి, రెబల్‌స్టార్, గంభీర నటనకు పెట్టింది పేరు అని నిరూపించుకుంటున్న కృష్ణంరాజు నా అభిమాన నటుడు. "కట కటాల రుద్రయ్య" సినిమా చూసిన తరువాత ఆయన సినిమాలు ఎక్కువగా చూస్తున్నప్పుడు తెలిసింది ఆయన అభిమానిగా మారానని. అనాటి "అమరదీపం" మొన్నటి "బొబ్బిలి బ్రహ్మన్న" ఈనాటి "తాండ్ర పాపారాయుడు" ఆయన



నటనకు మచ్చు తునకలు 'తాండ్ర పాపారాయుడు' చిత్రంలోని ఆయన నటన అందరి మనసులలో నిలిచి పోయేలా చేసింది ఇకనుంచి ఆయన తన ప్రతిష్టకు తగ్గని నటనను ప్రదర్శిస్తూ, చారిత్రాత్మక చిత్రం 'విశ్వనాథ నాయకుడు'లో కృష్ణదేవ రాయ లు పాత్రను ఎంతో సమర్థవంతంగా అందరి అభిమానుల చేత శభాష్ అనిపించుకునేలా నటించాలని నా కోరిక

-ఎస్. కె. మున్నాఫ్, రాజమండ్రి

★ ★ ★

"కళారత్న నందమూరి కళ్యాణ చక్రవర్తి తొ[illegible] చిత్రంతో నే అందరినీ ఆకట్టుకున్న ఈ శుభ తరుణంలో కళ్యాణ్ గార్కి నా కళాభివంద[illegible]ములు

కళ్యాణ్ గారి తొలి చిత్రం "అత్తగారూ స్వాగతం[illegible] చూసిన అనేక మంది అభిమానులు, ఆశే[illegible] ప్రజానీకం 'అందగాడ స్వాగతం అంటు[illegible] ఆదరించిన అందరికి నా శుభాభివందనములు



కళ్యాణ చక్రవర్తిగారు ప్రేక్షకులను మెప్పిం[illegible] మంచి కథాబలం గల చిత్రాలను ఎన్నుకు[illegible] అందులోని పాత్రలకు ప్రాణం పోసి తన అ[illegible] "రికార్డుల రాజా" యువకిశోరం నందమూ[illegible] బాలకృష్ణ వలె నందమూరి అభిమానుల నంద[illegible] సంతోష లోకంలో ముంచెత్తాలని కోరుచున్నాను

-కె. హన్మంతు, వీరన్న పే[illegible]
పాలమూరు

## దాసరి "రొటేషన్ చక్రవర్తి"

"కూతుళ్ల పెళ్లిళ్లు చేయడానికి తల్లిదండ్రులు
ండే అవస్థ సునిశితమైన హాస్యంతో మేళవించబడిన
తివృత్తం. డిసెంబర్ 11 నుంచి జనవరి 11 వరకు
కే షెడ్యూల్‌లో పూర్తయింది మా గురువు
సరిగారి చిత్రాన్ని డైరెక్టు చేయడం నా పూర్వజన్మ
ుకృతం", అన్నారు రేలంగి నరసింహారావు ఈయన
దర్శకత్వంలో దాసరి పద్మ సమర్పించే తారకప్రభు ఫిలిమ్స్‌వారి పై చిత్రంలో దాసరి నారాయణరావు, శారద, కోట శ్రీనివాసరావు, కాశీ విశ్వనాథ్, సుధాకర్,



"దొంగ మొగుడు"లో
చిరంజీవి, భానుప్రియ

# శేషాలు

_జి.వి.జి.

పి. ఎల్. నారాయణ, నర్రా వెంకటేశ్వరరావు, మాడా, పిలేశ్వరం రంగా పాత్రధారులు. కాశీ విశ్వనాథ్ మాటలు, చక్రవర్తి సంగీతం, మోహన శిల్పం, నాగేష్‌బాబు నిర్వహణ, ఎ. శ్రీనివాస్ ప్రొడక్షన్, కృష్ణంరాజు కూర్పుతో కథ, స్క్రీన్‌ప్లే, గీతాలు, నిర్మాత: దాసరి నారాయణరావు.

## కృష్ణతో దాస్ దర్శకత్వంలో శ్రీ బాలాజీ ఆర్ట్ మూవీస్

"చేయని నేరానికి ముద్దాయిగా కృష్ణ, జైల్ సూపరింటిండెంట్‌గా శారద, డాక్టర్‌గా రాధ, లాయర్‌గా విజయశాంతి నటిస్తున్నారు. డిసెంబర్ నుంచి మార్చి వరకు నాలుగు షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది. సెంట్రల్ జైలు సన్నివేశాలను బెంగుళూరులోను, పాటలను మైసూరులోను పిక్చరైజ్ చేస్తాం, అన్నారు కె ఎస్ ఆర్. దాస్ ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో వడ్డె బాలాజీరావు నిర్మిస్తున్న శ్రీ బాలాజీ ఆర్ట్ మూవీస్ చిత్రంలో శరత్‌బాబు, గిరిబాబు, వేలు, కన్నడ ప్రభాకర్, రాజ్యలక్ష్మి, బేబీఅనూ ఇతర నటవర్గం. పరుచూరి సోదరుల మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, పుష్పాల గోపీకృష్ణ ఛాయ, బి చలం శిల్పం, సలీం నృత్యాలు, రాజు సాహసాలు, కె రంగారావు సంయుక్త దర్శకత్వం, ఆది ప్రొడక్షన్, వెంకటేశ్వరరావు కూర్పుతో ప్రత్తిపాటి పుష్పలత, వడ్డే పుల్లయ్యనాయుడు సహ నిర్మాతలు సమర్పణ వడ్డే అంజమ్మ.

## కృష్ణ సమర్పణలో కృష్ణంరాజు హీరోగా "మరణ శాసనం"

పరీక్షా కేంద్రాలలో విద్యార్థులు కాపీ కొట్టడం దగ్గర్నుంచి పోలీస్ లాకప్ మరణాల వరకు సమకాలీన సమాజంలోని మంచి చెడులను, మిట్టపల్లాలను ప్రేక్షకుల ఎదుట ఎత్తి చూపే "అవనాలి" అనే మలయాళ చిత్రం కేరళలో క్రిక్కిరిసిన జనసందోహాన్ని ఆకర్షిస్తోంది. ఈ చిత్రం ఆధారంగా కృష్ణ సమర్పణలో పద్మాలయ స్టూడియోసవారి మరో సంచలన చిత్రం "మరణ శాసనం" తయారవుతోంది. విధి నిర్వహణకు గంభీరమైన అర్థాన్ని నిర్వచించే పోలీసు అధికారి పాత్రలో కృష్ణంరాజు, ఇతర పాత్రలలో ప్రభాకరరెడ్డి, కోట శ్రీనివాసరావు, నూతన్‌ప్రసాద్, గిరిబాబు, శ్రీధర్, త్యాగరాజు, కెప్టెన్‌రాజు, జయసుధ, సుమలత, మాధవి నటిస్తున్నారు. "డిశంబర్ 21 నుంచి జనవరి 20 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు నిర్వహణ బాధ్యతలు వహించే జి. ఆదిశేషగిరిరావు. ఎం. వి. ఎస్. హరనాథరావు మాటలు, వేటూరి పాటలు, రాజ్-కోటి సంగీతం, మాధవరావు ఛాయ, కళాధర్ శిల్పం, కోటగిరి గోపాలరావు కూర్పుతో ఎస్. ఎస్. రవిచంద్ర స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు."ఫిబ్రవరి 26న మహాశివరాత్రినాడు విడుదల", అన్నారు నిర్మాత జి. హనుమంతరావు.



"దొంగోడొచ్చాడు"లో కృష్ణ, రాధ

## చిరంజీవితో కోదండరామిరెడ్డి దర్శకత్వంలో శ్రీదేవి చిత్రం

"డిసెంబర్ 6 నుంచి 10 వరకు మొదటి షెడ్యూల్ పూర్తిచేశాం. జనవరి, ఫిబ్రవరి, మార్చినెలల్లో 1-10 తేదీల మధ్య జరిగే తదుపరి షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు ఎ. కోదండ-మిరెడ్డి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో రాజేశ్వరీ అయ్యప్పన్ నిర్మిస్తున్న శ్రీలత క్రియేషన్స్ చిత్రంలో చిరంజీవి సరసన శ్రీదేవి నాయిక. యండమూరి వీరేంద్రనాథ్ కథ, మాటలు రాశారు. బప్పిలహరి సంగీతం, పి. ఎస్. ఆర్. స్వామి ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, సరోజ్ నృత్యం, మోహన్ ప్రొడక్షన్, డి. వెంకటరత్నం కూర్పు తెర వెనుక హంగులు.



"త్రిమూర్తులు" చిత్రంలో ఇద్దరు హీరోలతో
నిర్మాత టి సుబ్బరామిరెడ్డి



'సర్దార్ కృష్ణమ నాయుడు' లో కృష్ణ

## కె. ఎస్ ఆర్ దాస్ దర్శకత్వంలో శ్రావణా మూవీస్ మొదటి చిత్రం

హీరోగా నటి భారతి తమ్ముడు శశికుమార్‌ను హీరోయిన్‌గా స్వాతి అనే యువతిని పరిచయం చేస్తున్నాం జనవరి ఫిబ్రవరి మాసాల్లో 1 15 తేదీల మధ్య తలకోన అడవుల్లో ఆ చుట్టుపక్కల షూటింగ్ అన్నారు కె ఎస్ ఆర్ దాస్ ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో డాక్టర్ శ్రీమతి కె శ్యామలమ్మ సమర్పించే పై సంస్థ చిత్రంలో పి ఎల్ నారాయణ రామ్‌రాజ్ ముచ్చర్ల అరుణ నిర్మల తదితరా నటవర్గం సుదర్శనభట్టాచార్య మాటలు జాలాది పాటలు రాజ్-కోటి సంగీతం ఎన్ ఆర్ కె మూర్తి ఛాయ సూర్యకుమార్ శిల్పం అప్పారావు సాహసాలు శివశంకర్ నృత్యాలు కృష్ణకిశోర్‌రెడ్డి సంయుక్త దర్శకత్వం రమణారావు సహకార దర్శకత్వం జగన్ సహాయ దర్శకత్వం, కె రామమోహనరావు కూర్పుతో ఎస్ శ్రావణకుమారి నిర్మాత

## కె. బాలచందర్ దర్శకత్వంలో చిరంజీవి చిత్రం

శాస్త్రీయ సంగీతం మీద ఈ ఇతివృత్తం కొంతవరకు ఆధారపడి వుంది ముఖ్యంగా ఇది రెండు తరాల మధ్య - అంటే తండ్రీకొడుకుల మధ్య జరిగే సంఘర్షణ తెలుగు ప్రేక్షకులలో ఏ ఇమేజ్ లేని నటుడు తండ్రి పాత్ర వేస్తే బాగా నప్పుతుంది అంగుళే చిరంజీవి తండ్రిగా జెమినీ గణేశ్

## సినిమా

వేస్తున్నారు తమిళనాడులోని కుత్రాలం జలపాతం వద్ద డిసెంబర్ 22 నుంచి పది రోజులపాటు షూటింగ్ జరిపాం అన్నారు కె బాలచందర్ ఈయన కథ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో చిరంజీవి తల్లిగారి పేరిట నెలకొల్పబడిన అంజన ప్రొడక్షన్స్ సంస్థ 'చిత్రంలో చిరంజీవి శోభన

దర్మపత్ని లో రాజ్యలక్ష్మి



జెమినీగణేశ్ రంగనాథ్ అల్లు రామలింగయ్య పి ఎల్ నారాయణ సుమిత్ర ఆదిగాగల వారు పాల్గొంటున్నారు గణేశ్‌పాత్రో మాటలు సీతారామశాస్త్రి పాటలు ఇళయరాజా సంగీతం రఘునాథరెడ్డి ఛాయ మోహన శిల్పం మోహన్ ప్రొడక్షన్ గణేశ్‌కుమార్ కూర్పుతో చిరంజీవి సోదరుడు కె నాగేంద్రబి యు బి ఎల్ నిర్మాత

## కల్యాణ చక్రవర్తి కొత్త చిత్రాలు

కోడిరామకృష్ణ దర్శకత్వంలో పాకాడ అప్పారావు వాట్ల రామకృష్ణంరాజు నిర్మించే శ్రీ లలిత కళాంజలి ప్రొడక్షన్స్ ఇంటిదొంగ ఎ కోదండరామి రెడ్డి దర్శకత్వంలో వజ్జె సుబ్బారావు నిర్మించే విజయ మహేష్ చిత్రం డిసెంబర్‌లో సెట్స్‌కు వెళ్ళాయి

జనవరిలో ఆదిత్య దర్శకత్వంలో కె వి వి సత్యనారాయణ చిత్రం ఫిబ్రవరిలో ఎ మోహన్ గాంధి డైరెక్ట్ చేసే కృష్ణా సినీ క్రియేషన్స్ చిత్రం ఏప్రిల్‌లో రవిరాజా పినిశెట్టి దర్శకత్వంలో పి డి నాగేశ్వరరావు నిర్మించే ప్రసాద్ ఆర్ట్ క్రియేషన్స్ చిత్రం ఎస్ వెంకటరత్నం నిర్మించే పల్లవి ఫిలిమ్స్ చిత్రం జూలైలో రేలంగి నరసింహారావు దర్శకత్వంలో టి వి సుబ్బయ్య చిత్రం ఆగస్ట్‌లో కోడిరామకృష్ణ దర్శకత్వంలో ప్రతాపరాజు చిత్రం సెప్టెంబర్‌లో రేలంగి నరసింహారావు దర్శకత్వంలో మానస సినీ ఆర్ట్స్ చిత్రం అక్టోబర్‌లో కె ఎస్ ఆర్ దాస్ డైరెక్ట్ చేసే జి రామకృష్ణంరాజు చిత్రం అక్టోబర్‌లో అంగర సత్యం చిత్రం ప్రారంభమవుతాయి

# సెట్స్‌లో ప్రత్యేక ఛాయా చిత్రాలు


"వీరప్రతాప్" సెట్‌లో డైరెక్టర్ బి. విఠలాచార్య, మోహన్‌బాబు, అరుణ

### ఛాయాగ్రహణ దర్శకుడు పి ఎస్ ప్రకాష్ సొంత చిత్రం 'రుద్ర రూపం

మేనమామ తన కుటుంబానికి చేసిన, అన్యాయానికి నాయకుడు తగు ప్రతీకారం తీసుకోవడం ప్రధాన ఇతివృత్తం నాయకుని సోదరి అందురాలిగా అనూరాధ కరుణ పూరితమైన పాత్రను దరిస్తోంది నవంబర్ డిసెంబర్ షెడ్యూల్స్ పూర్తయ్యాయి జనవరిలో పది రోజుల షూటింగ్‌తో పూర్తవుతుంది అన్నారు ప్రముఖ ఛాయాగ్రాహకుడు దర్శకుడు పి ఎస్ ప్రకాష్ ఈయన స్వయంగా నిర్మిస్తున్న పైప్రకాష్ సినీ కంబైన్స్ తొలి చిత్రంలో కల్యాణ చక్రవర్తి చంద్రమోహన్ గొల్లపూడి మారుతీరావు సాక్షి రంగారావు కల్పన అహల్య ఆదిగా గల వారు పాల్గొంటున్నారు వియత్నాం వీడు సుందరం కథకు తనికెళ్ళ భరణి సంభాషణలకర్త రమేష్ నాయుడు సంగీతం కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం ఎస్ పి రంగారావు సంయుక్త దర్శకత్వంతో కె ఎస్ కుప్పయ్య జి లక్ష్మికాంతం కె ప్రభాకర్ సహ నిర్మాతలు

### ఎ కోదండరామిరెడ్డి దర్శకత్వంలో శోభన్‌బాబు కార్తీకపౌర్ణమి'లో

శోభన్‌బాబు ధీరోదాత్త నాయకుడు కలవారి కుటుంబంలో పుట్టిన అవిద్యావంతురాలైన యువతి రాదిక అట్టడుగు వర్గంలో పుట్టి గగనంలో వెలసిన ధ్రువతార బానుప్రియ ఈ ముగ్గురి చుట్టూ పరిభ్రమించే కథ చివరి షెడ్యూల్ జనవరిలో అన్నారు ఎ కోదండరామిరెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో శ్రీ కామాక్షి కమర్షియల్స్ అదినేత డి


"మకుటం లేని మహారాజు" సెట్‌లో శ్రీదేవి, డైరెక్టర్ బాపయ్య, కృష్ణ

శి. ప్రసాద్ రెడ్డి నిర్మిస్తున్న పై చిత్రంలో ...త్యనారాయణ నూతన్ ప్రసాద్, వీరభద్రరావు మమత ఆదిగా గల వారు పాల్గొంటున్నారు పరుచూరి సోదరులు తమ నల్లపూసలు నవల ఆదారంగా స్క్రిప్ట్ రాశారు వేటూరి గీతాలు చక్రవర్తి సంగీతం సుధాకర రెడ్డి ఛాయ శ్రీనివాసరాజు శిల్పం డి వెంకటరత్నం కూర్పు తెర వెనుక హంగులు

### వి. మధుసూదనరావు దర్శకత్వంలో రమేష్

రమేష్ తొలిసారిగా ద్విపాత్రాభినయం చేస్తున్న చిత్రం అన్నారు వి మధుసూదనరావు ఈయన దర్శకత్వంలో సముద్రాల మూవీస్ అధినేతలు జయరాజ్, మాణిక్యరావు డి జి రెడ్డి నిర్మించే చిత్రానికి సాయినాధ్ రచయిత బప్పీలహరి సంగీత దర్శకుడు నిర్వహణ: దువ్వూరు రమణారెడ్డి

### ఎ ఎన్ ఆర్, నాగార్జునలతో 'కలెక్టర్‌గారి అబ్బాయి" ఎస్ ఎస్ క్రియేషన్స్ చిత్రం రెండవ షెడ్యూల్

అక్కినేని కలెక్టర్‌గా ఆయన భార్యగా శారద కొడుకుగా నాగార్జున నటిస్తున్నారు డిసెంబర్ 2 నుంచి 20 వరకు రెండవ షెడ్యూల్ జరిగింది అన్నారు బి గోపాల్ ఈయన దర్శకత్వంలో యార్లగడ్డ సురేంద్ర నిర్మించే ఎస్ ఎస్ క్రియేషన్స్‌వారి కలెక్టర్‌గారి అబ్బాయి చిత్రంలో రజని నూతన్‌ప్రసాద్ కోట శ్రీనివాసరావు సుదాకర్ శుభలేఖ సుదాకర్ వేలు రాళ్ళపల్లి మాడా శ్రీలక్ష్మి వరలక్ష్మి నటిస్తున్నారు వేటూరి గీతాలు చక్రవర్తి సంగీతం గోపాలరెడ్డి ఛాయ రఘు నృత్యాలు మార్తాండ్ కూర్పుతో నరసింహారావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ అక్కినేని వెంకటరత్నం ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్


"సంసారం ఒక చదరంగం" సెట్‌లో డైరెక్టర్ ఎస్. పి. ముత్తురామన్, సుహాసిని, శరత్‌బాబు, గొల్లపూడి

## అమెరికాలో జంధ్యాల చిత్రాలు

**పడమటి సంధ్యారాగం :** "అమెరికాలోని ప్రవాసాంధ్రుల పిల్లలకు ముఖ్యంగా ఆడపిల్లల వివాహానికి ఎదురయ్యే సమస్యలు ముఖ్య కథాంశం." అన్నారు జంధ్యాల ఈయన రచన దర్శకత్వంలో గుమ్మలూరి శాస్త్రి "ప్రవాసాంధ్ర చిత్ర పతాకంలో నిర్మించిన పడమటి సంధ్యారాగం చిత్రంలో విజయశాంతి నాయిక "అమెరికన్ నటుడు టామ్ నాయకుడు మీర్ అబ్దుల్లా శివమణి, శేషగిరిరావు విజయ్ బిందు అనిత ఆశాజ్యోతి సుధ ఎలిజబెత్ శ్రీమతి గాతెమాన్ బేబీ రోహిణి, ధీరజ్ జాన్‌జిక్ అజయ్ జోనాథన్ గుమ్మలూరి శాస్త్రి అమెరికాలోని కొందరు తెలుగువారు నటించారు మీర్ అబ్దుల్లా నిర్వహణలో జి సుబ్బారావు సమర్పణ ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం సంగీత దర్శకుడు

**చిన్ని కృష్ణుడు** కన్న తల్లి దండ్రుల మధ్య ఏర్పడ్డ కలతలను చిన్నికృష్ణుడు అమెరికావెళ్ళి వారిద్దర్నీ ఎలా ఒకటిగా చేశాడన్నది చిత్ర కథ అమెరికాలో సగబాగం పూర్తయింది మిగతా సగం ఇక్కడే జనవరిలో ప్రారంభించి ఫిబ్రవరిలో పూర్తి చేస్తాం అన్నారు జంధ్యాల ఈయన రచన దర్శకత్వంలో డాక్టర్ సుజాత (అమెరికా) సమర్పించే విజయ సినీ క్రియేషన్స్ చిన్ని కృష్ణుడు చిత్రంలో రమేష్ సరసన కుష్బూ నాయిక శరత్‌బాబు భారతి శ్రీలక్ష్మి వీరభద్రరావు వై జి మహేంద్రన్ డాక్టర్ ఇందిర భూషణరావు శేషగిరిరావు అమెరికాలో నృత్య కేంద్రం నిర్వహిస్తున్న హాస్యనటి విజయభానుతో పాటు మిస్ అర్చిన్ నటిస్తున్నారు బమిడిపాటి కథకుడు ఆర్ డి బర్మన్ సంగీత దర్శకుడు దివాకర్‌బాబు ఛాయాగ్రాహకుడు గౌతమ్‌రాజు సంకలనకర్త నిర్మాత జి సుబ్బారావు




**అయ్యా! మీరు తక్షణం సినిమా పేరు మార్చితే గానీ జనం వచ్చేట్టు లేరు!**

## ప్రేమ సామ్రాట్"లో పెద్ద పాయింట్

కారులోంచి దిగిన రాఘవరావు (జగ్గయ్య) మధులత (భానుప్రియ)ను లాక్కుంటూ ఇంట్లోకి

### సినిమా

వచ్చాడు భార్య వరలక్ష్మి (ప్రమీల)తో "ఈ మధులతగారు ఏం చేశారో తెలుసా? గత ఇరవై సంవత్సరాలుగా పడ్డిన కేసు ఫెయిల్ అవకుండా ఎంతటి మేధావుల చేతుల్లోనూ ఓడిపోకుండా ఉద్దండపిండం అనిపించుకున్న ఓ లీడింగ్ లాయర్‌ను ఓడించింది అన్నాడు

ఎవరా లాయరు? అడిగింది వరలక్ష్మి

నేనే!" అని సగర్వంగా జవాబిచ్చాడు రాఘవరావు

ఇంతలో పక్కనే ఉన్న మూర్తి (పి ఎల్ నారాయణ) అయితే మొత్తంమీద ఆ జగత్ కిలాడీ జగ్గారావుగాడికి జైలుశిక్ష వేయించేశావన్న మాట! అంటూ రాఘవరావు వంక తిరిగి "ఎంతైనా నా మేనకోడలు, బావగారూ! మరి మీ కూతురి మీద అంత ప్రేమ దాని తెలివి తేటలమీద అంత నమ్మకం ఉన్నప్పుడు దీన్ని మీ దగ్గరే జూనియర్‌గా పెట్టుకోవాలిగాని ఆ రాజారావు దగ్గరెందుకు పెట్టారు బావగారూ? అన్నాడు

మర్రి చెట్టు కింద మల్లిమొక్క మొలవదు అన్నది నా పాయింట్! అన్నాడు రాఘవరావు

పెరటి చెట్టు వైద్యానికి పనికిరాదన్నది నా పాయింట్! అంది మధులత

చిత్రీకరణ ముగిసిన పి ఎన్ ఆర్ పిక్చర్స్ ప్రేమ సామ్రాట్ చిత్రానికి మోహన్‌గాంధి స్క్రీన్‌ప్లే దర్శకత్వంతో పింజల నాగేశ్వరరావు నిర్మాత

## బాలకృష్ణ "మువ్వగోపాలుడు"గా కోడిరామకృష్ణ దర్శకత్వంలో గోపాలరెడ్డి చిత్రం

మత సామరస్యాన్ని ప్రబోదించే ఈ ప్రయోజనాత్మక చిత్రానికి మా భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ అశేష అభిమానుల్లో అత్యధిక శాతం సూచించిన మువ్వగోపాలుడు టైటిల్ యాదృచ్ఛికంగా సరిపోయింది. అందుచేత ఈ పేరునే ఖాయం చేశాం వినోదం పాలు కూడా మా చిత్రాల స్థాయిలోనే ఉంటుంది డిసెంబర్ 10న పాటల రికార్డింగ్‌తో ప్రారంభోత్సవం జరిగింది జనవరి 10 నుంచి రెండు షెడ్యూల్స్‌లో షూటింగ్ పూర్తవుతుంది మే 28న విడుదల అన్నారు భార్గవ్ ఆర్ట్ ప్రొడక్షన్స్ అధినేత ఎస్ గోపాలరెడ్డి ఈయన చిత్రంలో బాలకృష్ణ సరసన విజయశాంతి శోభన నాయికలు గణేష్ పాత్రో మాటలు సి నారాయణ రెడ్డి పాటలు కె వి మహదేవన్ సంగీతం కె పెదరామలింగేశ్వరరావు శిల్పం సాహుల్ సాహసాలు రావుశ్రీ సంయుక్త దర్శకత్వం రంగారెడ్డి – సి వెంకటేశ్వరరావు ప్రొడక్షన్ కె సత్యం కూర్పుతో కోడి రామకృష్ణ స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు. □

"ప్రేమ సామ్రాట్"లో సుమన్, అనూరాధ



"మొనగాడు"లో గొల్లపూడి. అర్జున్. అరుణ



## అతనికి వడ్డించే ఆ పళ్ళెంలో
## ఇల్లాలి అనురాగంతోపాటూ
## మా నాణ్యతనూ కలుపుతాం.

మేలురకం పాత్రలు
నాణ్యమైన సేలం
స్టీలు రేకుతో
తయారైనవి

సేలం స్టీల్‌లో మేము కంటికి కనిపించేదానికన్నా మరెంతో పళ్ళెంలో ఉందని విశ్వసించేవాళ్ళం అందుకే మేం ఎంచుకునేవన్నీ—అది సాంకేతిక విజ్ఞానం అయినా సరే, ముడిపదార్థమైనా సరే—ఉన్నత ప్రమాణాల్లో ఉండాలని కోరి, ప్రయాసపడి, ప్రపంచంలోనే ఉత్కృష్టమైనది ఎంచుకుంటాం అలాగే తయారీలోకూడా అడుగడుగునా ప్రతి చిన్న విషయాన్నీ ఎంతో శ్రద్ధతో పరిశీలిస్తాం నిరంతరం అత్యున్నతమైన నాణ్యతగల వస్తువుల ఉత్పత్తే మాధ్యేయం మా దృష్టిలో 'పళ్ళెం' అంటే కేవలం పళ్ళెం మాత్రమే కాదు మా సంస్థ తత్వానికి, అభిరుచికీ ప్రతీక మాకు మీపై ఉన్న శ్రద్ధాసక్తులకు ఋజువు





**సేలం స్టీల్ కర్మాగారం**
సేలం-636 013, తమిళనాడు
స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్
భారత ప్రభుత్వ సంస్థ

## సేలం స్టెయిన్‌లెస్.
## దీనినే కోరుకోండి. ఎందుకంటే దీనికి మించినది దొరకటం అసాధ్యం.

Sista's - SSP 558 86 TE C

అర్ధరాత్రి -

ఆకాశం నల్ల దుప్పటి కప్పుకుని ఏడుస్తోంది.

ఆకలికి నారాయణ ఏడుస్తున్నాడు

చలిగాలి రివ్వున వీస్తోంది పిడుగులు పడుతున్నట్టుగా వురిమింది ఆకాశం

దాలిగుంటలో ముడుచుకు పడుకున్న కుక్కలా అక్కడక్కడా తెగిపోయిన నులక మంచంలో చిరిగిపోయిన దుప్పటి కప్పుకుని చలికి వణుకుతూ పడుకున్న ముసలమ్మ ఆ వురుముకి వులిక్కిపడి లేచింది ఏడుస్తున్న మనవడు నారాయణ్ని సముదాయించింది

నిద్రపట్టక కటిక నేలమీద పడుకుని చీకట్లోకి చూస్తున్న రాములుకి కొడుకు ఏడుపు విన్పిస్తూనే వుంది తనమీద తనకే కోపం వస్తోంది తను ఏమీ చెయ్యలేని అశక్తుడు!

మూడు రోజులుగా పట్టిన ముసురువల్ల ఎక్కడికీ కదలడానికి వీల్లేక ఆ మూడు రోజులూ గంజినీళ్ళు తాగి కడుపు నింపుకోవలసి వచ్చింది ఆ గుడెసెలోని ఈ ముగ్గురూ

భగవంతుడా! రేపటి నుంచయినా ఎండ వచ్చేట్లు చూడు ' మనస్ఫూర్తిగా భగవంతుని ప్రార్థించాడు రాములు

తనెంత అసమర్థుడు? తల్లికి, కొడుక్కి కనీసం ఒక్క పూటయినా తిండి పెట్టలేని దౌర్భాగ్యుడు

గాలిగట్టిగా వీయడంతో గడియలేని తలుపు భళ్ళున తెరుచుకుంది రాములు లేచివెళ్ళి తలుపువేసి ముక్కాలిపీట తలుపుకి అడ్డంపెట్టి వచ్చాడు,

పందుల ప్రావకంతో, దోమల దౌర్జన్యంతో వూరికి దూరంగా వున్న పూరి గుడిసెల్లోని ఒక గుడిసెలోని మూడు ప్రాణాలకు ఆ రాత్రి చాలా కష్టంగా తెల్లవారింది

రాములు మొర భగవంతుడు ఆలకించాడో లేదో తెలియదుగానీ కారు మేఘాల స్థానంలో స్వచ్ఛమైన నీలాకాశం దర్శన మిచ్చింది ఆ వుదయం.

రాముడి మనసు ఊహల ఉయ్యాలలూగింది.

కడుపులో మూడు రోజులుగా వున్న ఆకలి మాయమై కొత్త వుత్సాహము చోటు చేసుకుంది ...లో చెరువుకెళ్ళి ముఖం కడుక్కుని వచ్చి మేకుకి తగిలించి వున్న సంచిని తీసి భుజాన తగిలించుకున్నాడు

సంచి ఒకసారి తీసి లోన చాక్‌పీస్‌లు వున్నాయో లేవో చూచుకున్నాడు

అతని వ్యాపారానికున్న ముడిసరుకు అదే!

పేవ్‌మెంటే అతని వ్యాపార ప్రదేశం!

డబ్బుంటే అతనో గొప్ప కళాకారుడయ్యేవాడు.

పెద్ద కళాకారుడవ్వాలని చిన్నప్పుడు నేర్చుకున్న ఆ కళ . కాన్వాస్ మీద చక్కగా రూపు దిద్దుకోవాల్సిన ఆ కళ ఇప్పుడు రోడ్డుమీద భగవంతుని రూపంలో రాములు పొట్టని చాలాకష్టంగా నింపుతోంది!

దేశంలో భక్తి సన్నగిల్లనంతవరకూ తన పొట్టకేమీ ఢోకా లేదనుకునేవాడు రాములు మొదట్లో కానీ, అతననుకున్నట్లు అందరూ దేవుడి బొమ్మను చూడగానే డబ్బులు వేస్తారనుకోవడం వుత్తభ్రమేననే విషయం చాలా ఆలస్యంగా తెలిసింది!

జేబులో వున్న ఆఖరి రూపాయి బిళ్ళ తల్లికిచ్చి బయటకు వచ్చాడు రాములు

'నేనూ వస్తా నాన్నా!' అంటూ మూడేళ్ల నారాయణ తండ్రికాళ్లను చుట్టేశాడు ఆలేత ముఖం లంఖణాలతో పీక్కుపోయింది. నూతిలోంచి వచ్చినట్టుగా వుంది ఆ మాట

వద్దు నాన్నా! . ఎండలో నువ్వుండలేవు. ." కొడుకుని ముద్దు పెట్టుకుని ఇంట్లోకి పంపాడు రాములు తల్లి ప్రేమంటే ఏమిటో తెలియని ఆ చిన్నారి ముఖం రాముఋలో అశాంతిని రేపింది.

అతని కళ్ళముందు లచ్చి మెదిలింది

రాములు నడుస్తున్నాడేగాని లచ్చి ఆలోచనలు అతడిని వదల్లేదు

లచ్చికి తనేం అన్యాయం చేశాడని తనని వదిలి వెళ్ళిపోయింది?

నారాయణ పుట్టిన రెండేళ్లకే డబ్బు వ్యామోహంలో డబ్బుగల మనిషితో మనసు లేకుండా లచ్చి లేచిపోయింది!

రాములు ఆలోచిస్తూ వూళ్లోకి వచ్చేసాడు. రోడ్డుమీద జన సంచారం పెరుగుతోంది

సూర్యుడు పైపైకి ఎగ్రబాకుతున్నాడు

రాములు ఓ ఇరుకు సందులోకి ప్రవేశించాడు మెయిన్‌రోడ్డు మీదికి వెళ్లాలంటే ఆ ఇరుకు సందుగుండా వెళ్లాల్సిందే

ఆ సందులో ఒక మిలటరీ హోటల్ గోడ ప్రక్కన రాత్రి తిని పారేసిన ఎంగిలి విస్తర్ల కోసం పదవికోసం కొట్టుకుచచ్చే రాజకీయ నాయకుల్లా కుక్కల గుంపొకటి ఒక దాన్నొకటి కరచుకుంటూ కిందా మీదా పడుతున్నాయి!

రాములు వాటిని దాటుకుంటూ మెయిన్ రోడ్డెక్కాడు

వాహనాల రాకపోకలవలన, ఎండవలన రోడ్డుమీద వర్షపు తడి ఆరిపోయింది

తను ప్రతిరోజూ బొమ్మవేసే స్థలం దగ్గరకు వెళ్లి తన పనిలో నిమగ్నమయ్యాడు రాములు స్వేదంతో అతని చిరిగిపోయిన చొక్కా తడిసిపోయింది నూనెలేక నీళ్ళు రాసిన అతని జుట్టు అట్టలు కట్టిపోయింది

ఎదురుగా వున్న కాఫీ హోటల్లోనుంచి హిందీ పాటలు మంద్రస్థాయిలో విన్పిస్తున్నాయి

రాములు వేసే ఆంజనేయుని బొమ్మ సజీవరూపం దిద్దుకుంటోంది.

హోటలు ముందు నలుగురు బిచ్చగాళ్ళు లోపలినుండి వచ్చేవాళ్ల దగ్గర డబ్బులు అడుగుతున్నారు

"బాబూ! ఓ పదిపైసలు ధర్మం చెయ్యండి " ఒక ముసల్లి అడుగుతోంది

ఆడగటానికి అభిమానం అడ్డువచ్చే వాళ్ళు మూగజీవాల్లా చేతులు చాపుతున్నారు

జేబు రుమాలుతో మూతులు తుడుచుకుని వెళ్ళిపోయే వారేగాని... పదిపైసలు ధర్మం చేసేవాళ్ళు అక్కడెవరూ లేకపోయారు

వింత మనుషులు - వింతలోకం

తను తిన్న హోటల్లో బిల్లు ఎక్కువగా వేసినా మాట్లాడలేదు మనిషి తను ఎక్కిన బస్సులో కండక్టరు పదిపైసలు తక్కువిచ్చినా మాట్లాడలేదు మనిషి

తను తొడుక్కున్న చొక్కా జేబుకి చిరుగు వుండి ఓ రూపాయి బిళ్ళ జారి పడిపోయినా ఏమీ చెయ్యలేని మనిషి ఒక పదిపైసలు ధర్మం చెయ్యలేడు

మధ్యాహ్నం పన్నెండు గంటలు దాటింది

ఎదురుగా హోటల్లో ఆధునిక సంగీతం!

రాములు కడుపులో పేగుల ఆకలినాదం!

దూరంగా డొల్లు ధ్వనులతో చావు మేళం!

"సమయం ఎంతవుతుందా?" అని రాములు తలపైకెత్తి చూశాడు.

నడినెత్తి మీద సూర్యుడు కన్పించాడు.

ఎండ భగ భగ మంటోంది.

కాళ్ళు కాలుతున్నాయి నెత్తి కాలుతోంది ఆకలి సరేసరి.

ఎన్నడూ లేని నిస్సత్తువ...

కళ్ళు తిరుగుతున్నాయి. ఇంటికివెళ్ళి పోదా మనుకున్నాడు రాములు కానీ, అతని కళ్ళముందు ముసలి తల్లీ, మూడేళ్ల కొడుకూ మెదిలారు

తనకోసం, తనేమైనా తీసుకొస్తే ఇంతవండి పెట్టడానికి తల్లి కళ్ళల్లో వత్తులు వేసుకుని ఎదురుచూస్తూ వుంటుంది. కొడుకు ఆకలికి తాళలేక గుక్కపట్టి ఏడుస్తూ వుంటాడు.

ఆ క్షణంలో అతనికి లేచి వెళ్ళిపోయిన భార్యమీద విపరీతమైన కసి కలిగింది!

తెలిసీ తనేం భార్యకు అన్యాయం చెయ్యలేదు. వున్నంతలో చాలా ప్రేమగా చూసుకుంటూ వచ్చాడు. భార్యకు ఏ కొంచెం నలతగా వున్నా తను విలవిల్లాడిపోయేవాడు. ఒక విధంగా తన మంచితనమే తనను కాటేసిందేమో!

లేకపోతే భార్య ఇలా లేచి వెళ్ళిపోతుందా?

ప్రపంచంలో వున్న ప్రతి మనిషీ ఎప్పుడో ఒకప్పుడు తెలిసో తెలియకో ఏదో వుద్రేకంలో తప్పుచెయ్యవచ్చు. అది మానవ బలహీనత.

ఆ బలహీనతే తనను దెబ్బ తీసింది.

జీవితంలో మళ్ళీ హాయిగా నవ్వుకునే అవకాశాన్ని




హరించేసింది.

ఆ రోజు తనకింకా బాగా గుర్తు!

చీకటి పడుతోంది.

తనింటి ముందు కూడా సందడి లేదు.

తల్లి ఎక్కడికో వెళ్ళింది. తలుపులు దగ్గరకు వేసివున్నాయి. తలుపులు తీసి లోపలకు చూశాడు. కొడుకు ఉయ్యాల తొట్టిలో నిద్రపోతున్నాడు. భార్య కన్పించలేదు.

'తలుపులు దగ్గరకేసి ఎక్కడికెళ్ళుంటారు?' రాములుకేం పాలుపోలేదు.

ఇంతలో ఇంటి వెనుక కాళీస్థలంలోనుంచి మాటలు వినిపించాయి.

ఆ మాటలు వినడంతోనే రాములు నిలువున్నా కోపంతో వూగిపోయాడు.

"ఎవరైనా వస్తారేమో!"

"ఎవరూ రారు. నువ్వు త్వరగా కానియ్"

"మీ ఆయన..."

"ఆదిప్పుడేం రాడు. రాత్రి తొమ్మిది దాటితేగాని రాడు.

"మీ అత్త..."

"ముసలి ముండ. అదంటేనే నాకు వళ్ళుమంట..."

ఆ మాటలు ఎవరివో ఊహించలేనంత దద్దమ్మకాదు తను.

వెంటనే వెళ్ళి భార్యనూ, ఆ మరో పురుషుడ్ని చంపెయ్యాలన్నంత కోపం, ఆవేశం వచ్చాయి.

రెండడుగులు ముందుకు వేశాడు కానీ, మరో అడుగుకూ డా ముందు కెయ్యలేకపోయాడు.

భార్య ఎందుకో తప్పుచెయ్యడానికి తొందర పడింది. తను కూడా అలాగే తొందర పడితే ఎలా!

బ్రతుకులు బుగ్గిపాలవుతాయి!

తన వివేకం, తన మంచితనం ఆ క్షణంలో మనిషిగా ఆలోచించమని విజ్ఞప్తి చేసాయి.

ఫలితంగా లచ్చిని క్షమించాడు..

ఆనాడు చీకటి పడుతుండగా చీకటిలాటి పాపాన్ని చూసిన తనకు తన బ్రతుకే చీకటైపోయింది ఆ మరుసటి రోజె లచ్చి అతనితో వెళ్ళిపోయింది

గతం తాలూకు ఆలోచనలతో రాములు మెదడు మొద్దుబారిపోయింది కళ్ళల్లో నీటిపొర, రెండు చేతులతో ముఖాన్ని గట్టిగా తుడుచుకున్నాడు

కడుపులో ఆకలి. ఈ ప్రపంచమంతా ఆకలి మయమేనేమో అనిపించిందతనికి.

శరీరం గాలిలో తేలిపోతున్నట్లనిపించింది రాములుకి

తండ్రిలాగా రిక్షాలాగినా తను ఈ రోజున ఇంత హీనంగా బ్రతికేవాడు కాదేమో!

రాములు పెళ్ళయిన సంవత్సరమే అతని తండ్రి యాక్సిడెంటులో మరణించాడు.

సాయంత్రం ఐదు గంటలు కావస్తోంది. రోడ్డుమీద జనరద్దీ పెరిగింది.

బొమ్మమీద అక్కడక్కడా చిల్లర పోగయింది ఆకలికి అలమటించిపోయే కొడుకు కళ్ళలో

## చావు బ్రతుకులు

చాలుననుకుంటే–
తృప్తి!
చాలదనుకుంటేనో
లేదనుకుంటేనో–
ఆశ!
బతికించి, మనిషిని
జీవచ్ఛవాన్ని చేస్తుంది ఆశ!
చంపేసి, మనిషిని
అమరుణ్ణి చేస్తుంది తృప్తి!

–కలువకొలను సదానంద

## పేవ్‌మెంట్

మెదిలాడు రాములుకి ఇంటికి వెళ్ళిపోదామనుకుని లేని వోపిక తెచ్చుకున్నాడు.

బొమ్మమీద వున్న చిల్లరంతా పోగుచేసి లెక్కపెట్టాడు ఆరు రూపాయలవరకు వుంది రాములు కళ్ళు మెరిసాయి.

మరుక్షణం ఓలాఠీ రాములు శరీరాన్ని మృదువుగా స్పృశించింది.తల పైకెత్తి చూశాడు రాములు

ఎదురుగా కానిస్టేబుల నిలబడి వున్నాడు

ఏరా ఈ రోడ్డు నీ బాబుదనుకున్నావా? ఆ బొమ్మ చెరిపేసి వెళ్ళకపోయావా నీ ఫొక్కా లిరుగుతయ్" గద్దించాడు కానిస్టేబుల్

తన కిదివరకెప్పుడూ అలాంటి పరిస్థితి ఎదురవక పోవటంతో ఆశ్చర్యంగా, భయంగా చూశాడు రాములు

"ఒక ప్రక్క రోడ్డు ఇరుకై జనం చస్తుంటే... నీ కళ్ళేమయ్యాయిరా?" కానిస్టేబుల్ భాషా ప్రవాహం.

"బాబూ! నేను చేయగలిగింది. నాకు చాత నయింది ఈ వృత్తే మీ కాళ్ళట్టుకుంటాను నాకడుపు కొట్టకండి." నీరసంగా ప్రాధేయ పడ్డాడు రాములు.

కానిస్టేబుల్ చూపు రాములు దోసిట్లో వున్న చిల్లరమీద పడింది.

"అదిటు ఇవ్వు" దౌర్జన్యంగా చిల్లర లాక్కున్నాడు.

రాములు మొర అరణ్యరోదనే అయింది.

"మళ్ళీ ఎప్పుడైనా ఇక్కడ కన్పించావంటే లాకప్పులో పెడతా" లాటీ వూపుకుంటూ కానిస్టేబుల్ వెళ్ళిపోయాడు

వున్న ఒక ఆశా పోవడంతో, తను ప్రొద్దుటనుంచీ పడిన శ్రమంతా మరొకడు దోచుకోవడంతో రాములు రోడ్డు మీద కుప్పలా కూలిపోయాడు. కానిస్టేబుల్ దౌర్జన్యానికి భయపడిన సూర్యుడు భూమికి రెండో వైపుకి పారిపోయాడు

మునిసిపాలిటీ వారి వీధి దీపాలు వెలగలేక వెలిగాయి రాముడు వేసిన ఆంజనేయుడి బొమ్మ వెలవెలబోయింది □




ఆంధ్రపత్రిక సంస్థ నుంచి మరో ఆణిముత్యం
నవ వనితా సచిత్ర పక్షపత్రిక

- అభ్యుదయానికి మనో వికాసానికి, లలితమైన వినోదానికి దర్పణాలైన వ్యాసాలు. చర్చలు.
- కాలక్షేపానికి రకరకాల హాబీలు, గృహాలంకరణలు తెలిపే శీర్షికలు
- బొమ్మల కథలు, కమ్మని కథలు వాటికి తీర్చైన బొమ్మలు
- ఒక పూర్తి నవల + 2 సీరియల్స్
- పొదుపుకు, సదుపాయానికి అవసరమైన చిట్కాలు, రకరకాల వంటలు, రాశిఫలం కూడా. వంటలకి ఉత్తరాలకి అల్లికలు, డిజైనులు, కవితలు, గేయాలు, హరివిల్లు! బహుమతులు అన్నీ రంగులు హంగులు కలబోసిన అందమైన సచిత్ర పత్రిక వెల · 2.50
- ఆధునిక మహిళల ఏకైక పక్షపత్రిక. అందరూ చదువతగిన సచిత్ర పత్రిక వెల · 2.50

వివరాలకు

'కలువబాల' కేరాఫ్ ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 3

విడిప్రతి వెల : రు. 2.50

చందా వివరాలు

| | పోస్టుద్వారా | ఏజెంటుద్వారా |
|---|---|---|
| 3 మాసాలకు | రు 15-90 | 15-00 |
| 6 మాసాలకు | రు 31-80 | 30-00 |
| ఏడాదికి | రు 60-00 | 60-00 |



జి. వి. ఆర్. హైదరాబాదు

★ సినిమా వాళ్ళు ఒకరిపై ఒకరు బురద జల్లుకుంటూనే వుంటారు మళ్ళీ స్టేజీలమీద కౌగలించుకొంటూనె వుంటారేమిటి?

● పామూ పామూ కరుచుకుంటే విషం పని చెయ్యదు రావుగారు – అధి సినిమా వారికి తెలుసు! అందుకే వారి మధ్యకి వెళ్ళిన అర్భకులని కాటేస్తూ వుంటారు!!

ఎమ్. ఎన్. ఆర్. విజయవాడ

★ అరుణకిరణం చూశారా? అది మీ డాక్టర్ ఐ లవ్ యూ కాపీ, కావలిస్తే చూడండి

● చూడలేదు సినీలోకంలో అచ్చయిన ప్రతీదీ వాళ్ళ కాపీరైటే అనుకుంటాను! కొత్త పుస్తకాల కాటలాగులు చూసి టైటిల్సూ, మార్కెట్‌లో వచ్చిన నవలలలోని మంచి సంఘటనలూ అన్నీ ఏరి చెప్పడానికే వుంటారు మందలా అసిస్టెంట్లు ఇదొక సులభ పద్ధతి నాకు తెలుగు సినిమాలు చూసే ఓర్పులేదు సారీ

కె. ఎస్. ఆర్. ఆర్. నంది వెలుగు

★ ఆంధ్రపత్రిక ప్రచురణలపై మీ అభిప్రాయం?

● నిలకడైన విలువలను పాటించే పత్రికలవి దిగజారుడులో పోటీ పడని పత్రికలవి

★ నేటి పత్రికలు మన సమాజంపై ఎలాంటి ప్రభావాన్ని చూపుతున్నాయి?

● చదవడానికి చూడడానికి కొన్ని జుగుప్స కల్గిస్తున్నాయి అటువంటి అసభ్యతకి పాఠకులు పట్టంకట్టి – జేజేలు కొడుతున్నారంటే – నమ్మ బుద్ధి కావడం లేదు

★ మీ లేటెస్టు నవల ఏమిటో?

● మీరు అంత అవురావురుమంటూ ఎదురు చూడదగ్గ సస్పెన్సు, శృంగారం, జుగుప్స (అది రసమవునో కాదో తెలియదు) దాంట్లో వుండవని ముందే చెప్తున్నా- ఎందుకు రాశావని తరవాత తిట్టకుండాను!

శ్రీనివాసు – రాజ్‌గంజ్‌పూర్

★ లౌ యీజ్ వార్ షిప్ అని నేను అంటాను – మరి మీరేమంటారు?

● నీతో ఏకీభవించాలనే వుందయ్యా – లౌ యీజ్ వార్ షిప్ అని కాని లౌ యీజ్ వర్‌షిప్ అని పెద్దలు నూరిపోసిన నమ్మకం పోనంటూంది

★ ఇంచు మించు అన్ని విలువలు తెలుసుకున్నాంగాని ప్రేమ విలువ తెలుసుకోలేదు

● ఏం దానికీ యిప్పుడు డబ్బు కొలమానంగా వాడేస్తున్నారు కదా!

రాము – గుంటూరు

★ స్వర్గం నరకం అనే లోకాలు ప్రత్యేకంగా ఉన్నాయంటారా?

● సినిమాల్లో చూడలేదూ? ఉండే వుంటాయి తప్పుచేసిన ఆడవాళ్ళు నరకంలోకి – తప్పుచేసినా చేయకపోయినా మగవాళ్ళు స్వర్గంలో రంభా పరిష్వంగంలోకి – తోయబడతారు

★ గురువులను గౌరవించవలసిన విద్యార్థులు




తమ గురువులపై ముష్టి యుద్ధాలు చేస్తుంటే మన సంస్కృతికి విలువ వుంటుందా?

● మనకి సంస్కృతా? అదెక్కడ దొరుకుతోంది బాబూ ఈ రోజుల్లో గురువులకు తగ్గ శిష్యులు తయారవడంలో వింతేముందీ!

ఎమ్. ఎన్. సికింద్రాబాదు

★ చెత్త పుస్తకాలన్నీ మార్కెట్లో విరివిగా దొరకడం అన్యాయం కదూ కె. రా గారూ?

● అన్యాయం నారాయణగారూ, చెడు కెప్పుడూ పెద్ద మార్కెట్టే వుంటుంది ఉండదని ఎవరన్నారు?!

జి. ఎల్. రాజమండ్రి

★ శుభమైనా, అశుభమైనా మామిడి తోరణాలు కడతారు ఎందుకు?

● మంచికీ చెడుకీ కూడా పదిమంది వస్తారు ఎక్కడ పదిమంది చేరినా అక్కడ గాలి కాస్తైనా పొల్యూట్ అవుతుంది. మామిడాకు తోరణాలు - కట్టడంలో – క్లొరోఫిల్ ఎక్కువ వుండడం వల్లా, గాలి శుభ్రపడుతుందని కడతారని చెప్పగా విన్నాను. పచ్చి మామిడి రెమ్మలు చూడండి చక్కని వాసన వేస్తాయి.

కె. వి. వి. ఎస్. రాజమండ్రి

★ రామలక్ష్మి గారూ చాలా మంది మనసులో ఒక లాగ వున్నా బయటకు మరొక లాగ ప్రవర్తిస్తారు. నేనలా కాదు. మనసులో మాట ధైర్యంగా చెప్తాను నాకు అసలు ప్రశ్నావళి అంటే అసహ్యం. చిరాకు కూడ. కేవలం మీరో దేవత లాగ దేవుడు లాగ

● మీ కోపానికి కార్డు మండి పోకుండా ఎలా వచ్చిందా అని ఆశ్చర్యపడుతున్నాను శేషగిరీ! అసహ్యం వేసినవాటికి దూరంగా వుండడమొక్కటే మీకు దారి. మీ కళ్ళు మీరు మూసుకుంటే లోకం కళ్ళు మూసుకున్నట్టనిపించి కాస్త ఉపశమనం కల్గుతుంది మీకు. ఒక్క పేజీ తిప్పేయలేకనా ఇంత మంది పడడం? లేక – చదవకుండా తిప్పేయ లేకనా – అర్థం కాలేదు! సారీ, చాలా మంది గురించి నాకు తెలియదు గాని – ఓ రేచీకటి అల్లుడి కథ జ్ఞాపకం వచ్చింది – మీ కార్డు చదివి. సూటిగా మాట్లాడడం అంటే కదుళ్ళు వెదుళ్ళు గరుడ స్థంభాలు – అనడం కాదు!

డి. ఎస్. కాశీబుగ్గ

★ మనిషి దొంగగా హంతకుడిగా మారడానికి కారణం పెంచిన తల్లితండ్రులేనని నా ఉద్దేశ్యం మీరేమంటారు?

● కన్న పాపానికి మీరేమన్నా పడాలి తల్లితండ్రులు! జన్మనిచ్చిన వారు వారి తలరాత రాయలేరని తెలియదా?! ఇటేడు అటేడు తరాలలో గాని ఆ కాంబినేషన్ల తరాలలో గాని ఎవరి పోలికేనా రావచ్చుని కదా అంటారు.

★ ఈ పశ్నావళి వల్ల మీరు ఒక లేఖినిగా తెలుసుకున్నదేమిటి?

● మనుముల తత్వాలు .. మైగాడ్ ఎదుటి వారిని ఎన్ని రకాలుగా అంచనా వేయాలని చూస్తారో – ఆశ్చర్యంగా వుంటుంది.

బి. వి. ఎస్. ఎన్. ఇప్పిలి

★ ఏ కార్యానికైనా ఆడది ఎదురైతే లక్ష్మీదేవి అంటారు మరి భర్త పోయిన స్త్రీని తిట్టుకుంటా రెందుకు?

● చేతకానితనం, భయం, పిరికితనం వల్ల. అది మనం ముఖాన పెట్టిన బొట్టు కిచ్చే విలువ – ఆ స్త్రీకి యివ్వక పోవడం వల్ల ఇలాంటి దరిద్ర గొట్టు సంప్రదాయాలకి స్వస్తి చెప్పాలి. □



## సీరియల్

# ఒకటి ఒకటి మూడు

## తేజోవతి



Bali

(గత సంచిక తరువాయి)

ఆలోచనల్లో వుండగానే వచ్చింది కొండమ్మ

"అమ్మా. . కూలు(డ్రింకులబ్బాయి వచ్చాడు అయ్యగారు మిమ్మల్నడిగి డబ్బులు తీసుకోమన్నారు ' అని చెప్పింది

సీతకు ముచ్చెమటలు పోసినట్లయింది ఆ తాళాల గుత్తిలో ఏది బీరువాతాళం చెవో తెలియదు... తీసినా డబ్బులు ఎక్కడ వుంటాయో.. ఎంత వుంటాయో కూడా తెలియదు...

అయితే ఏం చెయ్యాలి? ఎంతసేపు అతడు నిలబడతాడు!

సీత భయపడ్తూనే వచ్చింది క్రిందకి అత్తగారు ఆవిడగదిలో నే వుండి వుంటారనే ఆలోచన మేడదిగి రానిచ్చే ధైర్యం యిచ్చింది ఆ అమ్మాయికి

గా(డేజ్ బీరువా డైనింగ్‌హాల్లో వుంటుంది. అందుకే ధైర్యంగా వచ్చిన సీత దాని దగ్గరగానే మంచం మీద జుట్టు విరబోసుకుని కూర్చున్న అత్తగార్ని చూడగానే మూర్ఛవచ్చినంత పనయింది

కాళ్ళు గజగజ వణికినయి క్రౌర్యం నిండిన ఆ చూపులు తనను కబళించివేస్తున్నట్లు, మహాకాళి ప్రళయ స్వరూపంతో తన మీదకు వస్తున్నట్లు అనిపించింది

అక్కడి నుండి ఒక్క పరుగున పైకి పారిపోవాలన్న ఆలోచనను బలవంతాన నిగ్రహించుకుని బీరువా తాళం చెవులన్నిటితో ప్రయత్నం చేస్తూ, మండుతున్న కళ్ళతో తననే గమనిస్తున్న అత్తగారితో,

"కూల్‌(డింకు అబ్బాయికి డబ్బులిమ్మన్నారట " అన్నది

కృష్ణవేణమ్మ మాట్లాడలేదు . ఒకపెద్దనిట్టూర్పు విడిచి తలతిప్పుకుంది

"ఇందులో ఏ తాళమో తెలియటంలేదు అత్తయ్యగారూ " భయపడుతూనే అన్నది

"ఏం మొగుడిచేత పోట్లాడించి తాళం చెవులు తెప్పించుకున్న దానివి ఏది దేని తాళమో తెలియకుండా వుంటుందా?

"నేను . నేను.. అడగలేదండీ ఆయనే ."

ఒక్కసారిగా మండిపడింది కృష్ణవేణమ్మగారు .

"అబ్బ ఎంత నంగనాచివే! . ఏమీ తెలియకుండానే పెళ్ళయిన నెలలోపలే మొగుడ్ని లోబరుచుకుని అత్తగారి దగ్గరనుండి పెత్తనం రాబట్టుకున్నావా.. శభాష్! నంగనాచి తనమంతా నిన్నుచూసి నేర్చుకోవాలి.

అది సరే ఎన్నాళ్ళ నుండి పైకెళ్ళి పడుకుంటున్నావ్?"

సీత తాళం మాట మరిచి పోయి అత్తగారి మొఖంలోకి బిత్తర చూపులు చూస్తూ అన్నది-

'మీరు మీరు వూరికెళ్ళిననాడు ఆయన రమ్మన్నారు.. "

"ఆఁ రమ్మంటాడు యింతోటి రంభా వాడికిక దొరకదని నిన్ను రమ్మంటాడు! నా కాళ్ళమీద పడి బతిమిలాడుకున్నట్లు వాడికాళ్ళమీద కూడా పడి నాకు మొగుడి సుఖం కావాలని ప్రాధేయపడుంటావు. .

ఛీ కుక్కకయినా విశ్వాసం వుంటుంది . కుక్కను తీసుకొచ్చి అందల మెక్కిస్తే అందర్నీ కరిచినట్లు. . నీలాంటిదానికి పాపమని ఆశ్రయమిస్తే నా మీదకే ధ్వజమెత్తుతావా?!

యిల్లలకంగానే పండగవుతుందనుకోకు .. నా పేరు కృష్ణవేణమ్మ.... తాచుపాము పగ . నీ అంతం చూడకుండా వుంటాననుకోకు...

కొత్తమోజులో నువ్వు చెప్పినట్లల్లా ఆడుతున్నాడు . వాడికున్నంత మంది ఆడస్నేహితులు యింకోళ్ళకులేరు ... నీ గతి కుక్కలక్కూడా కాకుండా పోతుంది చూసుకో .. యీ కృష్ణవేణమ్మ పంతం ."

సీత గుడ్లప్పగించి నిలబడిపోయింది . ఈ లోపల కొండమ్మ వచ్చింది లోపలకు . . అతడు తొందరపడుతున్నాడంటూ

కొండమ్మను చూడగానే ఒక్క విసురునలేచి వెళ్ళిపోయింది కృష్ణవేణమ్మ తన గదిలోకి ... '

సీత వణికే చేతులతో తంటాలుపడి తాళంతీసి డబ్బులిచ్చేసింది అతడు వెళ్ళిపోగానే అత్తగారి గది దగ్గరకు వెళ్ళి తలుపుకొట్టి బతిమలాడింది

వచ్చి భోజనం చెయ్యమని ఎంతో చెప్పింది .. అరగంటసేపు ప్రయత్నించిన సీతకు ఏం చెయ్యాలో తోచక పైకి వచ్చింది వెనకాలే వచ్చింది కొండమ్మ

"ఎందుకమ్మా అమెను బతిమిలాడుతావు . అసలు మీ ఆయనతో చెప్పి ఆమెను యింటో నుండి పంపించెయ్యి.. నీ కాపురం బాగుంటుంది .."

"కొండమ్మా." గట్టిగానే అన్నది సీత....

"ఎందుకమ్మా బాధపడతావు... ఆవిడ ఎంత తెగించిన మనిషో నీకేం తెలుసు . నిండుప్రాణం తియ్యగలదు తలుచుకుంటే...

జరిగిన కథ –8 . ప్రసాద్‌తో కట్నం విషయం మాట్లాడడానికి వెళ్ళి బెంగపడి తిరుగు ప్రయాణంలో కృష్ణవేణమ్మ గారి కారు కింద పడి ఆమె ఆదరణను చూరగొంటుంది సీత కోడలిగా సీతకు తన ఇంట్లోనే స్థానం కల్పిస్తుంది కృష్ణవేణమ్మ కాని శ్యామసుందర్ నుంచి ఏమీ ఆశించ గూడదని షరతు పెడుతుంది కృష్ణవేణమ్మ గారు పొరుగూరు వెళ్ళిన సందర్భంగా సీత భర్త ఆదరణను అనుభవిస్తుంది అత్త చెప్పిన షరతుకు, భర్త ప్రవర్తనకు మధ్య తేడాతో సీత గందర గోళంలో పడుతుంది సీతను కృష్ణవేణమ్మ పనిమనిషిలా చూస్తున్నదని శ్యామసుందర్‌కి అర్థమవుతుంది పని మనిషి కొండమ్మ ద్వారా అత్త నిజస్వరూపం, శ్యామసుందర్ మొదటి భార్య ఆత్మహత్య వివరాలు సీతకు తెలుస్తాయి ఇంటి అధికారాన్ని శ్యామసుందర్ సీతకు అప్పగిస్తాడు

ఆమె నింట్లో వుంచుకుంటే నిన్ను కాపురం చెయ్యనిస్తుందనుకుంటున్నావా వుత్తది . పైగా యింత జరిగాక. '

"అందుకని .. ఆయన కన్నతల్లిని యింట్లో నుండి వెళ్ళగొట్టించమంటావా కొండమ్మా నావల్లకాదు అది నేను చెయ్యలేను చెయ్యను నువ్వేం సలహాలు చెప్పద్దు నాకు. నువ్వెళ్ళిపో "

'ఆ నే నెళ్ళిపోడానికేంగానీ. నా సలహాలు యినుకోకుంటే నువ్వుకూడా ఏ నిద్దరమాత్తర్లో చూసుకో .

శారదమ్మగారు చచ్చిపొయ్యాక డాక్టరుబాబుగారు ఆ మాత్తర్లు కూడా యింట్లో వుంచటంలే. యింకనుయ్యి చూసుకుంటావో గొయ్యి చూసుకుంటావో...

లేకుంటే ఆయమ్మ ఆడే నాటకాలకు నలుగురి ముందు పరువు పోగొట్టుకొని యింట్లో నుంచి వెళతావో... నాకేం...

ఏంటో నీ బతుకు మా శారదమ్మ బతుకులా కాకూడదని సెబుతుంటే నన్నే గదమాయిస్తున్నవే....

రేపు నీకు ఎవడితో నో ఆవిడ సంబంధం అంటగడితే అప్పుడు తెలుసుద్దిలే నేనెందుకు చెప్పానో! ఏ తల్లయినా నీ పెళ్ళాం మంచిదికాదంటే వినిపించుకోని కొడుకుండడు"

సీతకు నెత్తిన పిడుగు పడ్డట్టయింది ఆ మాటతో.

"కొండమ్మా!" అంది అదిరిపోయి...

"అఁ.... మరేటనుకున్నావు?... శారదమ్మ అంత బలవంతంగా ప్రాణాలు ఎందుకు తీసుకుందనుకున్నావ్ .

ఈ మహాతల్లే ఆ పిల్ల మీద లేనిపోని అభాండాలు వేసి నానా మాటలూ అని.... ఆ పిల్ల అమాయకప్పిల్ల కల్లా కపటంలేని పిల్ల . ఆ పిల్లను అనరాని మాటలని ."

"కొండమ్మా. " చాలా దీనంగా వుందా పిలుపు

'అవునమ్మా పాపం ఆ పిచ్చితల్లి మీద ఎన్ని అపవాదులేసిందో వాళ్ళ మేనత్త కొడుకు యింతప్పట్నుంచి ఆడుకున్నవోళ్ళు. ఆయన్నే మనసు పడితే పెద్దయ్యగారు కళ్ళకద్దుకుని కాళ్ళుకడిగి పిల్లనిచ్చేటోళ్ళు

అలాంటాయిన రెండు రోజాలుండి పోదామని వస్తే ఎన్ని మాటలందో ఎన్నిపుకార్లు పుట్టించిందో ...నలుగురిలో పరువుతీస్తానని,యిరుగుపొరుగు

# ఒకటి ఒకటి మూడు

**ముందు తలెత్తుకోకుండా చేస్తానని కొడుకుతో చెప్పి ఎళ్ళగొట్టిస్తానని అప్పుడు డాక్టరుబాబుగారు వూళ్ళోలేరు ఆయనొచ్చాక ఎళ్ళగొట్టిస్తానని అంటే ఆ అమ్మాయిగారు భయపడిపోయి ఆ మాత్రల్లు మింగి చచ్చిపోయింది**

ఆ అమ్మాయి కోసం మేనత్త కొడుకొచ్చినాడు గనుక ఆళ్ళ పేర్లు చెప్పింది నీ కోసం అట్టాంటోళ్ళు కూడారారు అంటుకని ఏ డ్రైవరుతోనో ఎవ్వరుతోనో రంకు కట్టింపంటే అప్పుడు తెలుసుద్దిలే నేనెందుకు చెబుతున్నానో అయినా చేతులు మీదుగా పెంచిన శారదమ్మే దక్కలేదు నువ్వెట్టాపోతే నాకేం నీ యిష్టం యినుకుంటావో మానుకుంటావో అలా అనేసి వెళ్ళిపోయింది కొండమ్మ

సీత మొదలు నరికిన చెట్టులా కూలిపోయింది

ఎంత ఆలోచించినా తన ముందు రెండే మార్గాలు!

ఒకటి- అత్తగారికి వుద్వాసన- అది చెయ్యటానికి మనసొప్పటంలేదు రెండోది ఆత్మహత్య-

సీతకు ఒళ్ళు చల్లబడినట్లయింది

చావడానికి ధైర్యముండాలి తనకా ధైర్యంలేదు

ఇక మిగిలింది- అత్తగారు తన మీద పుట్టించే మాటలు భరించడమేగాక- ఆ తర్వాత జరిగేవాటికి తలవంచటం!-

భగవాన్? ఏం చెయ్యాలి?

అత్తగారు తనమీద ఏమన్నా చెబితే ఆయన ఏంటారో? ఏదో ఆశ-. అంతలోనే

ఎంత పిచ్చిది తను

తల్లి యింకేమి చెప్పినా నమ్మక పోవచ్చుగానీ- నీ భార్య గుణం మంచిది కాదురా అంటే- తల్లిమాట వినకుండా భార్య చెప్పింది నమ్మేవాళ్ళుంటారా?!

రెండు సంవత్సరాలు కాపురం చేసిన శారదకే ఆ నమ్మకం లేకపోయింది!

భర్త తన శీలాన్ని అనుమానించి వెళ్ళగొడితే అన్నయ్య ఆదరిస్తాడా?

ఊహూ అపవాదులతో పుట్టింటికి చేరిన ఆడదాన్ని ఏ అన్నయ్య భరించడు అది నిజం

అయినా- అత్తగారు అంత దారుణానికి వొడికడుతుందా?

ఏమో తన పెత్తనం యిన్నాళ్ళూ నిరభ్యంతరంగా ఎదురు లేకుండా ఏలిన రాజ్యం కూలిపోయిందంటే ఎంతకైనా సాహసించదా

• ఈరోజు ఆ క్రౌర్యం చూస్తే మంచులో మంటలు పుట్టేటట్లు వున్నది!

ఆలోచనల్లో ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు

ఆ నిద్రలో కల




సీత హాల్లో నిలబడవుంది మెట్లపైన డాక్టరుగారు మొదటి మెట్టుమీద అత్తగారు ఆ కళ్ళు నిప్పులు కురుస్తుంటే-

యింకా చూస్తావేరా ఆ చెడిపోయిందాన్ని యింట్లోనుండి పంపించెయ్యక! దానికి మనయింట్లో నిలిచే అర్హత ఎప్పుడో పోయింది నీ భార్య యిలాంటిదంటే నీకు తలవంపులు లేదేమోగానీ నా కొడుకు తిరుగుబోతు అంటే నేను తలెత్తుకు తిరగలేను అందరూ మొహం మీదే అంటే బతకడం కంటె చావడం మేలు

సీత కళ్ళంట నీళ్ళు తుడుచుకోకుండానే ఏదో చెప్పబోతుంటే ఆయన ఒక్కసారి తన వైపు చూశారు

ఆ చూపు తన భవిష్యత్తును నిర్ణయించే చూపు మౌనంగా మనసును కత్తుల బోనులోకి దింపేసే చూపు మూసుకున్న తన దారిని తెలిపే చూపు తనముందున్న ఒకే ఒక్క మార్గం నిర్దేశించే చూపు!

ఒక్కసారి దుఃఖం పొంగి ఏమండి అంటూ ఏదో చెప్ప బోతున్న సీతను భుజాలుపట్టి కుదుపుతూ

సీతా! ఏమైంది? కలేమన్నా వచ్చిందా లే అప్పటికే ఆస్పత్రికి వెళ్ళడానికి తయారయివున్న డాక్టరుగారు లేపారు

భయం భయంగా చూస్తున్న సీతతో

సీతా, ఆనక కారు పంపుతాను డ్రైవరు మన గుడ్డలకొట్టు దగ్గర దింపుతాడు నేను కూడా ఫోనుచేస్తాను అక్కడికి మంచి చీరలు తీసుకో ఖరీదు ఎంతయినా సరే వెనకాడకు ఆ షాపులో మనకు ఖాతా వుంది

అన్నట్లు భోజనానికి నాకోసం వెయిట్ చెయ్యకు చాలా ఆపరేషన్లు వున్నాయి నేవచ్చేసరికి లేటవుతుంది నువ్వు భోజనం చేసెయ్యి అంటూనే సీత గడ్డంపట్టి పైకెత్తి కళ్ళల్లోకి చూస్తూ-

మంచి చీరలు తీసుకో మంచి చీరల్లో నువ్వింకా బాగుంటావు అందరి కళ్ళూ నీ మీదనే వుంటయ్యేమో, యిదో చెబుతున్నాను నీవైపు ఎవరన్నా కళ్ళెత్తి చూసినా నేను భరించలేను అంటూనే ఆ కళ్ళమీద ఒక్కసారి సుతారంగా పెదవులానించి వెళ్ళిపోయ్యారు

తన కల తల్చుకుంటే ముచ్చెమటలు పోసాయి సీతకు అలా ఆలోచిస్తుండగానే కొండమ్మ వచ్చింది

అమ్మగారూ యియ్యాళ క్రింది కొస్తారా కాఫీ టిఫినూ యీడకే తెమ్మంటారా? అంటూ

ఆలోచనల్లో వున్న సీత అనాలోచితంగా వస్తున్నాను పద ' అన్నది సీత మొహం కడుక్కుని క్రిందికి వెళ్ళేసరికి సీత వూహించని పరిస్థితి ఎదురయింది

కొడుకు బ్రతిమిలాడాడో లేక తన ఆకలే భరించలేక వచ్చిందో అత్తగారు డైనింగ్ టేబుల్ దగ్గర వున్నది

కాళ్ళు వణికిపోతుంటే వెళ్ళి కూర్చున్న సీతను ఆమె ఒక్కసారి కళ్ళెత్తి చూసింది

బ్రద్దలవబోతున్న అగ్నిపర్వతం తాలూకు రెండు నిప్పు కొలుముల్లా వున్నాయి ఆ కళ్ళు!

సీతకు యింతదాకా అత్తగారి దర్పం, అధికారం మాత్రమే తెలుసు ఆమె శత్రుత్వం తెలియదు

సీత నిలువెల్లా కంపించింది టిఫిను నోట్లోకి దిగలేదు

అంతా అలాగే వదిలేసి పైకి వెళ్ళిపోయింది

తను అగ్ని పర్వతాన్ని ఎదుర్కోలేదు మాడి మసైపోతుంది ఆ యింట్లో తను వుండలేదు ఆమె నీడ పడగకంటే భయంకరమైన నీడ అది అందులో వుండడం అసంభవం

తను వెళ్ళిపోవాలి ఆమె సమీపంలో ఎక్కడా లేకుండా వెళ్ళిపోవాలి కాని ఎక్కడకు వెళ్తుంది?

తనకు ఆశ్రయమిచ్చేవాళ్ళు ఎవరున్నారు?

అన్నయ్య దగ్గరకా?

వద్దు వద్దు అత్తగారికి భయపడి వచ్చేసిందంటే వాళ్ళు కాళ్ళూ చేతులు కట్టి పడేసి మళ్ళీ తెచ్చి యిక్కడ పడేస్తారు

బాలల్లారా రారండి! బాలరంజని మీదండి!!




మీకు ఉత్సాహాన్నిచ్చే మంచి మంచి సీరియల్స్,విజ్ఞానంతో పాటు వినోదాన్నిచ్చే చక్కని కథలు, ఇంకా ఏవిటంటే – బొమ్మల కథలు, వింతలు – విశేషాలు, మహనీయుల చరిత్రలు – ఇంకా – ఆరోగ్యానికి చిట్కాలు, పజిల్సు,ఇట్లా ఎన్నో వున్నాయి!

అన్నట్టు మీర్రు పాల్గొనే శీర్షికలు కూడా వున్నాయి!

అవేమిటంటే –

చిన్నారి నేస్తాలు (మీ ఫోటో పంపితే అచ్చు వేస్తారు)
బడిలో నా మొదటి రోజు (మీ అనుభవం రాసి పంపండి)
అడగండి, చెబుదాం (మీరే ప్రశ్న అయినా అడగండి జవాబు వస్తుంది)

మీకు కార్టూన్లు వెయ్యటం వచ్చా? ప్చ్! రాదా? పోన్లెండి, జోకులు వెయ్యటం వచ్చు కదా! అయితే ఓ పని చెయ్యండి! కార్టూన్ మాటల పోటీలో పాల్గొనండి! మాటలు రాసి బహుమతి గెలుచుకోండి!

## ఇక ఆలోచించకండి!

వెంటనే వెళ్ళి రంగురంగుల పత్రిక **బాలరంజని** పిల్లల మాసపత్రిక కొనండి.

వెల ఎంతనుకున్నారూ?

రెండు రూపాయలే!

ఇది పిల్లల పత్రికైనా పెద్దవాళ్ళు కూడా నిరభ్యంతరంగా చదువుకోవచ్చు!

**ఆంధ్రపత్రిక ప్రచురణ**

# కర్రపెత్తనం

ఓ ప్రగతి వ్యథా!
ప్రణయ బాధల్ని మమతానురాగాల్నీ
పక్కకు నెట్టి పరుగులెత్తిస్తున్నావ్ కదా?
ఎంత దూరమని పరుగెత్తను?
ఎంత కాలమని పరుగెత్తను?
నా పరుగుల్ని పరిహసిస్తున్న
ఈ లోకంతో కలిసి!
అడుగడుగునా అవరోధాల్ని సృష్టిస్తున్న
ఈ లోకానికె దురు నిలిచి!
పరువును అంగళ్ళల్లో అమ్ముకుంటున్న లోకం
పదవికి ప్రదక్షిణలు చేస్తున్న ప్రజానీకం
వేలం వెర్రితో, కాలం కలిసి వస్తే
పట్టాభిషిక్తులైన ప్రభువులు
పరుగుల మీది ప్రగతి భావాల్ని
గురిబెట్టి కాలుస్తున్నారు!
నిబ్బరంగా నిలబడిన గుండె నిబ్బరాన్ని
సుబ్బరంగా ఉరికంబాలెక్కిస్తున్నారు!
గాలులు వీస్తూనే ఉన్నాయి!
పువ్వులు పూస్తూనే ఉన్నాయి!
నక్షత్రాలు మెరుస్తూనే ఉన్నాయి!
రమ్య హర్మ్యాల్లో
రసరమ్య గీతికలు వినిపిస్తూనే ఉన్నాయి
భద్రతా భవంతుల్లో
క్షుద్ర శక్తులు విజృంభిస్తూనే ఉన్నాయి
అందుకే కదా ఈ వ్యధ!
ఈ వ్యధ తీరేదెప్పుడు?
ఈ పరుగు ఆగేదెప్పుడు??
నిశికే అంకితమైన నిర్భాగ్యుల జీవితాల్లో,
శశి వెలుగు వెల్లువల్ని కుమ్మరించినప్పుడు!
ఈ అధికార రోగపూరిత
కబంధ హస్తాల కర్రపెత్తనం కొనసాగనప్పుడు!

—పులికంటి కృష్ణారెడ్డి

# ఒకటి ఒకటి మూడు

బిగబట్టుకుని యిలా వుండడం సాధ్యంకాదు

సడన్‌గా సీతకు తన స్నేహితురాలు మనోరమ గుర్తొచ్చింది విన్నప్పుడు తనతో చదువుకున్నది తన పెళ్ళి విషయం విశాల రాసిందట హైదరాబాద్ నుండి వుత్తరం రాసింది అన్నయ్య దాన్ని రిడైరెక్టు చేశాడు అది పెళ్ళయిన కొత్తలో వచ్చిన ఉత్తరం

డాక్టరును పెళ్ళి చేసుకున్నావుటగా చాలా సంతోషం నువ్వూ మీ వారూ హైద్రాబాదు వస్తే మా యింటికి తప్పక రండి అంటూ తన అడ్రసు రాసింది. మనోరమ తనకు తప్పక సాయం చేస్తుంది

సీత తన పెళ్లైంతా నెతికి వుత్తరం ఎడ్రసు ... [illegible]

పెన్నిది దొరికినట్లు సంతోషించింది

ఆ వెంటనే డాక్టరుగారికి అన్ని వివరాలతో వుత్తరం రాయసాగింది

ఆ ఉత్తరం పూర్తయ్యేసరికి డ్రైవరు కారు తెచ్చాడు బీరువాలో ఒక రెండువందలు తీసుకుంది డ్రైవరు షాపు దగ్గర దింపగానే, యిక నువ్వెళ్ళు డ్రైవర్ నేను బజారు పని చూసుకుని రిక్షాలో వెళ్ళిపోతాలే అని చెప్పి పంపించేసింది

డాక్టరుగారి ఖాతాలో రెండు వాయిలు చీరలు మాత్రం తీసుకుని యివతలకు వచ్చిన సీత ఒక్కక్షణం పాటు మాత్రం తటపటాయించింది ఆ తర్వాత రిక్షాపిల్చి, రైల్వేస్టేషన్‌కు పోనీ అన్నది

★ ★ ★ ★ ★ ★ ★

అదీ సీత కథ అయిదు సంవత్సరాలు అయినా మనసులో చెరిగి పోకుండా ప్రతి మాటా ప్రతి సంఘటనా నిల్చిపోయిన సీత కథ

★ ★ ★ ★ ★ ★ ★ ★

సుధా నర్సింగ్‌హోమ్ నుండి లక్ష్మితో బాటు బయలుదేరిన శ్యామసుందర్‌గారి మనసు ఆలోచనలతో వేడెక్కి పోయింది.

ఆయనతో బాటు ఫ్రంట్ సీట్లో కూర్చున్న లక్ష్మి కూడా జాగ్రత్తగానే కూర్చుంది కారులో .

నిద్రవస్తే డాక్టరుగారి మీదకు తూలిపోతానేమోనన్న భయంతో చాలా జాగ్రత్తగా కూర్చుంది

ఆ నిద్ర రాకుండా ఆలోచనలను ఆహ్వానించి ఆలోచనల ప్రవాహంలో తల మునకలవుతూ అలా అలా చాలాసేపు మెలకువతోనే వుంది

కానీ ఎప్పుడో ఆలోచనలతో అలసిన మనసు తెలియకుండానే నిద్రలోకి వొరిగి పోయింది

విరిసిన తామర రేకుల్లా వున్న ఆ కళ్ళు మూతపడి కారులో వెనక్కు వాలిపోయింది లక్ష్మి

అలా నిద్రలో కొరిగిన లక్ష్మిని ఒకసారి చూసి సిగరెట్టు వెలిగించుకున్నారు శ్యామసుందర్‌గారు ఆలోచనలను జో కొట్టడానికి

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

లక్ష్మి కళ్ళు తెరిచేసరికి తెల్లగా తెల్లవారింది

ఉదయారుణ కాంతుల్లో కారాగిన యింటిగేటు మీద 'డాక్టర్ శ్యామసుందర్, ఎం ఎస్ అన్న బోర్డు చూసి వులిక్కిపడి కళ్ళు విప్పార్చి చూసింది

సందేహంలేదు అది డాక్టరుగారి యిల్లే

పక్కకు చూసింది. డాక్టరుగారు కారు ఆపి గేటు తెరవడానికి కారులోంచి దిగబోతున్నారు

'ఇదేమిటి యిక్కడికి తీసుకొచ్చారు?!" ఆశ్చర్యంగా అడిగింది

ఏం యిది యిల్లు అక్కడికే తీసుకువచ్చాను తప్పేముంది?'

అదికాదు నర్సింగ్‌హోమ్‌కు నర్సింగ్‌హోమ్‌లో వుంచుతానన్నారుగా"

'ఇప్పుడు ఏమికావస్తోంది నిద్రబాగా ముంచుకువస్తే తోవలో కాసేపు కారాపి నిద్రపొయ్యాను అందుకు ఆలస్యమైంది ఈ వేళప్పుడు నర్సింగ్‌హోమ్‌కు వెళితే అక్కడే చిక్కుపడిపోతాను కాఫీ స్నానం టిఫినూ ఏమీ లేకుండా యిలాగే నర్సింగ్‌హోమ్‌కు వెళ్ళిపొమ్మంటావా?'

'అహ అదికాదు కనీసం నన్ను దింపినా . '

"ఏం నువ్వు యీ యింట్లోకి అడుగు పెట్టనన్న నియమమేమన్నా వుందా? చురుకుగా చూశారు డాక్టరుగారు

"అహఁ అలాంటిదేమీలేదు కానీ ఒక డాక్టరుగారు నర్సును వెంటబెట్టుకొని యింటికివస్తే ఎన్నో పుకార్లు రావచ్చు మీ రెప్యుటేషను దెబ్బతింటుందేమోనని '

నా రెప్యుటేషను గురించి నీకెందుకు బాధ యిక నీ రెప్యుటేషను అంటావా నీకీ వూరితోనే పరిచయం లేనప్పుడు, నువ్వు ఎవరో ఏమిటో ఎవ్వరికీ తెలియనప్పుడు యిక నీ పరువు పోతుందన్న బాధేముంది! ..

అయినా యింట్లో ఎవ్వరూ లేరులే ఎవరొచ్చారో ఎవరెళ్ళారో

గమనించడానికి

స్నానం చేసి కాఫీ టిఫిను తీసుకుని వెంటనే వెళ్ళిపోదాం నర్సింగ్‌హోమ్‌కు అంటూనే గేటు తెరిచి కారులో పలికి తెచ్చారు

నెమ్మదిగా లక్ష్మి దిగేసరికి, తలుపు తెరిచి ఎదురుగా నిల్చుని వుంది పని మనిషి కొండమ్మ

లక్ష్మిని చూసిన కొండమ్మ ముందు ఆశ్చర్యపోయింది ఆ తర్వాత చేటంత మొఖంతో డాక్టరుగారివైపు తిరిగి బాబుగారూ?' అన్నది ప్రశ్నార్థకంగా

నర్సులే క్రొత్తగా వచ్చింది స్నానం చేసి నర్సింగ్ హోమ్‌కు వెళ్ళిపోతుందిట

వంట మనిషి యింకా రాకపోతే నువ్వే ఏదన్నా చెయ్యడమో హోటలు కెళ్ళి తేవడమో చెయ్యి త్వరగా టిఫిను కావాలి వెంటనే వెళ్ళిపోవాలి అన్నారు

కొండమ్మ యింకా బొమ్మలా అలాగే నిలబడి చూస్తోంది లక్ష్మి పనిమనిషి కొండమ్మ అన్నారు డాక్టరుగారు

అలా తలాడించి తన సూట్ కేసు కోసం గబుక్కున కారు వెనక్కు వెళ్ళింది లక్ష్మి

నేను తెస్తాను పద అంటూనే లక్ష్మి సూట్‌కేస్ తీసుకుని గబగబా అడుగు లేస్తూ యింకా అలాగే తెల్లబోయి చూస్తున్న కొండమ్మతో లోపలికి పద త్వరగా కాఫీ పెట్టు అన్నారు

సూట్‌కేస్ మేడ మీద తన గది పక్కనున్న గదిలో పెడ్తూ ఈ గదికి నా గదికి అదే ఆటాచ్డ్ బాత్ నేను షేవ్ చేసుకొచ్చే సరికి నువ్వు స్నానం పూర్తి చెయ్యి. ఆ బాత్‌రూమ్‌లో లోపల బోల్టు పెట్టుకో స్నానమయ్యాక తలుపు తెరు అనేసి తన గదిలోకి వెళ్ళిపోయ్యారాయన

నిజానికి లక్ష్మికి వెంటనే స్నానం చెయ్యాలని లేదు ఆ గదిలో వున్న సోఫాలో పడుకుని పరిసరాలను చూస్తూ కాసేపు నిద్ర పోవాలని వుంది

కానీ ఆయన షేవ్ చేసుకొచ్చే సరికి స్నానం కావాలన్నారు కనుక వెంటనే బట్టలవీ తీసుకుని బాత్‌రూమ్ వైపు నడిచింది

లక్ష్మి గబగబా స్నానం ముగించి అవతల వైపు బోల్టు తీసే సమయానికి షేవింగ్ అయిపోయి టవలు చుట్టుకుని స్నానానికి రెడీగా వున్నారాయన

లక్ష్మి జడ అదీ వేసుకుని చీర కట్టుకుని సిద్ధమయి డాక్టరు గారి గొంతు క్రింద వినబడడంతో క్రిందికి వస్తుంటే క్రింద కొండమ్మ గొంతు వినబడుతోంది

డాక్టరు బాబు గారూ యీయమ్మ అచ్చం మన సీతమ్మ గారిలా లేదూ? అని

ఆ ప్రశ్నకు అవుననీ కాదనీ ఏమీ చెప్పకుండా

కొండమ్మా నీ కాలు వాపు ఎలా వుంది? మందు లేసుకుంటున్నావా? ఆ గొట్టాలూ బిళ్ళలూ అయిపోతే చెప్పు అనక వచ్చేటప్పుడు తెస్తాను అన్నారు

లక్ష్మి తెల్లచీర చిన్న పసుపు పచ్చ బార్డరున్నది కట్టుకొని తెల్ల జాకెట్టు వేసుకుంది జుట్టంతా నీట్‌గా దువ్వి బాగా పైకి లాగి చుట్టలాగా చుట్టి వెయిల్ వేసింది నుదుట చిన్న తిలకం తప్ప కళ్ళకు కాటుక కూడా లేదు

మెడలో సన్నని తెల్లటి వెండి గొలుసు ఆ గొలుసుకు లక్ష్మి రూపు వున్న చిన్న వెండి లాకెట్టు

శ్యామ సుందర్ గారు ఒక్క సెకను పాటు పరిశీలనగా చూశారు తన స్టాఫ్ యూనిఫాం వేసుకో నవసరం లేదని చెప్పినా వేసుకున్నా వెందుకని ఆయనేమీ అనలేదు

వూరికే అలా ఒక్కసారి చూసి కాజువల్‌గా ఎదురు కుర్చీ చూపించారు కూర్చోమని

కొండమ్మ తెచ్చి పెట్టిన ప్లేట్లలో ఒకటి లక్ష్మి ముందుకు జరిపి తను గబగబా టిఫిను తినడం మొదలు పెట్టారు

టిఫిను కాగానే రెడీయేనా అన్నట్లు చూశారు సూట్‌కేసు సూట్‌కేసు తెచ్చుకోమంటారా? జంకుతూనే అడిగింది ఆయన గంభీరతను చూసి

తీసుకు రమ్మని ఆయన సైగ చెయ్యగానే పరుగెత్తు కుంటూ పైకి వెళ్ళి సూట్‌కేసు తెచ్చుకుంది లక్ష్మి

హడావుడిగా పైకెళ్ళి నందున రొప్పుతున్న లక్ష్మి చేతిలో సూట్‌కేసు అందుకుని కారు దగ్గరికి నడిచారు

ఉదయం ఏడున్నరకే నర్సింగ్ హోమ్ దగ్గర గుంపుగా చాలా మంది చేరివున్నారు ఆపరేషను చేయించుకోబొయ్యే వాళ్ళు వాళ్ళ తాలూకా బంధువులు అందరూ ఆయన కన్సల్టింగ్ రూమ్ ముందు గుమిగూడి వున్నారు

కారు హారను విని గేటు తియ్యడానికి వచ్చిన గేటు మాన్ రాముతో డిక్కీలో వున్న సూట్‌కేసు తీసుకెళ్ళి నా రూమ్ వెనక వున్న గదిలో పెట్టు తర్వాత ఆగది క్లీన్ చేసి ఒక మంచం అదీ వెయ్యి అని చెప్పి గబగబా లోపలకు నడిచారు

ఆ నర్సింగ్ హోమ్ మూడంతస్థుల మేడ క్రొత్త బిల్డింగ్‌లా లేక పోయినా బాగా స్పేషియస్‌గానే వుంది

బిల్డింగ్‌ను చూస్తూ మెల్లిగా వస్తున్న లక్ష్మికోసం ఒక్క త్రుటి కాలం ఆగి నర్సింగ్ హోమ్ తర్వాత చూడచ్చు త్వరగా వస్తే నాకు లేట్ కాకుండా వుంటుంది అన్నారు

లక్ష్మి అడుగులు త్వరగా పడ్డాయి లోపలికి వెళ్ళగానే అక్కడ వున్న వాళ్ళను పరిచయం చేస్తూ-

"ఇతడు సదాశివరావు అతడు అచ్యుతరావు తర్వాత విశ్వనాథం జ్వాలామూర్తి అనేసి యీమె లక్ష్మి క్రొత్త నర్సు సావిత్రి ప్లేస్‌లో వచ్చింది అని చెప్పారు

ఆ తర్వాత లక్ష్మి వైపు తిరిగి

ఈ రోజూ రేపు నువ్వు ఏమీ చెయ్యాల్సిన అవసరం లేదు నాతో బాటు వచ్చి జస్ట్ అబ్జర్వ్ యీ రోజు మైమెన్ విల్‌హెల్ప్‌మి అనేసి లోపలకు వెళ్ళిపోయ్యారు

ఎవరూ ఏమిటని చాలా ప్రశ్నలు తోచినా వాళ్ళెవ్వరూ అడగలేదు డాక్టరు

ఈడుపుగల్లులో శ్రీ లోకేశ్వరస్వామి స్వగృహంలో డిసెంబరు 15న అయ్యప్పస్వామి భజన జరిగిన సందర్భంగా తీసిన చిత్రం



ఇటీవల మధ్యప్రదేశ్ షాడి జిల్లాలోని ఆంధ్రా కల్చరల్ అసోసియేషన్ జయంత్ కళాకారులచే ప్రదర్శించబడిన "ఏక్ దిన్ కా సుల్తాన్" తెలుగు నాటికలోని ఒక దృశ్యం.



# భారతదేశంలోని ప్రయివేటురంగంలో మొదటి అయిదు పెద్ద కంపెనీలు

**మొత్తం ఆస్తుల విలువని అనుసరించి (1983-84) :**

| | | |
|---|---|---|
| 1. | తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ | రు. 871.95 కోట్లు |
| 2. | తాతా ఇంజనీరింగ్ అండ్ లోకోమోటివ్ కంపెనీ | రు. 607.45 ,, |
| 3. | రిలయన్స్ టెక్స్టైల్ ఇండస్ట్రీస్ | రు 536.78 ,, |
| 4. | అసోసియేటెడ్ సిమెంట్ కంపెనీలు | రు. 499 46 ,, |
| 5. | గుజరాత్ నర్మదా వేలీ ఫెర్టిలైజర్ కంపెనీ | రు. 396 46 ,, |

**మొత్తం అమ్మకాలని అనుసరించి :**

| | | |
|---|---|---|
| 1. | తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ | రు. 813.90 కోట్లు |
| 2 | తాతా ఇంజనీరింగ్ అండ్ లోకో మోటివ్ కంపెనీ | రు 768.70 ,, |
| 3. | హిందూస్తాన్ లీవర్ | రు 519.13 ,, |
| 4. | రిలయన్స్ టెక్స్టైల్ ఇండస్ట్రీస్ | రు 502 44 ,, |
| 5. | డి సి ఎం | రు 480 79 ,, |

**నికర విలువ(వాటా ధనం+నిల్వాలు, మిగులు) :**

| | | |
|---|---|---|
| 1 | తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ | రు 232 63 కోట్లు |
| 2 | సెంచరీ స్పిన్నింగ్ అండ్ మాన్యు-ఫాక్చరింగ్ (వీవింగ్) కంపెనీ . | రు 222 4 ,, |
| 3. | తాతా ఇంజనీరింగ్ అండ్ లోకోమోటివ్ కంపెనీ | రు 195 24 ,, |
| 4 | గ్వాలియర్ రేయాన్ సిల్క్ మాన్యుఫాక్చరింగ్ (వీవింగ్) కంపెనీ | రు 183.08 ,, |
| 5. | ఐ టి సి .. | రు 131 97 ,, |

**నికర లాభాన్ని అనుసరించి :**

| | | |
|---|---|---|
| 1 | రిలయన్స్ టెక్స్టైల్ ఇండస్ట్రీస్ | రు 38 51 కోట్లు |
| 2 | గుజరాత్ స్టేట్ ఫెర్టిలైజర్స్ కంపెనీ | రు 21.64 ,, |
| 3 | లార్సన్ అండ్ టూబ్రో | రు 21 22 ,, |
| 4 | అసోసియేటెడ్ సిమెంట్ కంపెనీలు | రు 19 88 ,, |
| 5. | బజాజ్ ఆటో | రు 18.61 ,, |

**మొత్తం పెట్టుబడిపై అధిక శాతం నికర లాభాలు సంపాదించినవి :**

| | | |
|---|---|---|
| 1 | నెక్టార్ ఫ్రూట్ ప్రొడక్ట్స్ | 22 33 శాతం |
| 2 | కాల్గేట్ పామోలివ్ (ఇండియా) | 21 79 ,, |
| 3. | రామ్‌కిషన్ ఇస్‌పాట్ | 20 65 ,, |
| 4 | మెక్ లియోడ్ రస్సెల్ (ఇండియా) | 20 31 ,, |
| 5 | సిల్వేనియా అండ్ లక్ష్మణ్ | 19 54 ,, |

**ఆస్తుల పెరుగుదల ఎక్కువ శాతంగల కంపెనీలు :**

| | | |
|---|---|---|
| 1. | కిర్లోస్కర్ ట్రాక్టర్స్ | 212 92 శాతం |
| 2 | లిప్టన్ ఇండియా | 166 48 శాతం |
| 3 | లోహియా మెషీన్స్ | 158.45 శాతం |
| 4. | బిస్‌నాధ్ టీ కంపెనీ | 138 72 శాతం |
| 5 | శ్రీ మీనాక్షీ మిల్స్ | 136 20 శాతం |

(కామర్స్ రిసెర్చ్ బ్యూరో వారు వెలువరించిన కంప్యూటర్ సర్వే వివరాల ఆధారంగా)

## ఒకటి ఒకటి మూడు

గారితో బాటు వెళ్ళమన్నట్టు ఒక్కడుగు వెనక్కు వేశాయి...

ఆవిధంగా ఆయన వెంట వెళ్ళిన లక్ష్మి మళ్ళీ రెండు గంటల ప్రాంతంలో ఆయనతో బాటు యివతలికి వచ్చింది....

ఆ రోజు ఎనిమిది ఆపరేషన్లు.... అతి సునిశితంగా అత్యంత చాక చక్యంతో చకచకా చేస్తున్న ఆపరేషన్లు చూస్తుంటే లక్ష్మి కెందుకో సిగ్గేసింది...

ఆ రోజు తను సిజేరియన్ చేస్తారా .. అని అడిగినప్పుడు ఆయన ఎందుకు నవ్వారో అప్పుడర్థమయి తల వంచుకుంది

రెండు గంటల ప్రాంతంలో యివతలికి వచ్చిన డాక్టరు గారు లక్ష్మిని పిలిచి తన కన్‌సల్టింగ్ రూమ్‌కు పక్కగా వున్న గది చూపించి, "ఈ గదిలో వుండచ్చు. యీ పక్కనున్న బాత్‌రూమ్ అదీ వాడుకోవచ్చు రాముా కారియర్ తీసుకొచ్చి పెడ్తాడు" అన్నారు

ఆ గది నీ ట్‌గానే వుంది కానీ చిన్నది లోపల నాపరాళ్ళు పరిచిన నేల .. అందులో ఒక ప్లాస్టిక్ మంచం

ఆ గది కలయ చూసిన లక్ష్మి అన్నది

ఈ గదిలో వంటా అదీ చేసుకోడం కష్టం కదా?"

"వంటా! వంట నిన్నెవరు చేసుకోమన్నారు? రెండు పూటలా క్యారియర్ వస్తుంది కాఫీ టిఫిను అది కూడా "

కానీ '

కానీ ఏమిటి పుదయం ఏడుగంటలకల్లా నర్సింగ్‌హోమ్‌లో వుండాలి మధ్యాహ్నం ఒంటిగంటా రెండు గంటలదాకా థియేటరులో సరిపోతుంది సాయంత్రం నాలుగు నుండి పేషెంట్లు వస్తుంటారు రాత్రి ఎనిమిదిదాకా యిక ఎప్పుడు వంట చేసుకుంటావ్?'

'కానీ హోటలంటే చాలా అవుతుందిగా.. "

నువ్వు వర్రీ అవాల్సిన పనిలేదు నీకు యీ రెండు నెలల కోసమని వంట సామాన్లు గ్రాసరీ అంతా కొనిచ్చే బదులు యిదే తేలిక డోంట్ వర్రీ బోర్డింగ్ అండ్ లాడ్జింగ్ ప్రొవైడ్ చేస్తానన్నాను అందుకని హోటల్ బిల్లు నేను చూసుకుంటాను వస్తాను చాలా టయర్డ్‌గా వుంది ' అనేసి వెళ్ళిపొయ్యారు

మర్నాడే డాక్టరుగారు లోపలకు రాగానే వాచ్‌మన్ రాముా ఒక కొత్త సూట్‌కేసు తెచ్చి లక్ష్మి గదిలో పెట్టాడు

లక్ష్మి ఒంటి గంటన్నరకు గదిలోకి వచ్చి సూట్‌కేసు తెరిచి చూస్తే దాంట్లో కొత్త చీరలు అరడజను పైన బెడ్‌షీట్సు రెండు దుప్పట్లు . లక్ష్మి ఆశ్చర్యంగా తీస్తుండగా యింటికి వెళ్లబోతూ లోపలకు వచ్చారు శ్యామసుందర్‌గారు

"అంతా కంఫర్ట్‌బుల్‌గా వుందా? యింకాఏమన్నా కావలసి వుంటాయా?

నో యింకేమీ అక్కర్లేదు కానీ ఈ చీరలు యీ చీరలు "

ఫర్వాలేదు వుండనీ ముందే చెప్పానుగా నా హాస్పిటల్‌లో తెల్ల చీర యిన్‌సిస్ట్ చెయ్యనని యీ చీరలు కట్టుకోవచ్చు

కానీ యింత ఖరీదువి

'ఓ ఖరీదా' నువ్వు కాష్ పేమెంట్ తీసుకోవని చెప్పింది సుధ ఎవరికైనా నేను 'పే' చేస్తానుకదా దానికి బదులు చీరలు తీసుకున్నాను అనేసి, "మేక్ యువర్ స్టే కంఫర్ట్‌బుల్" అని యింకో మాటకు అవకాశం యివ్వకుండా వెళ్ళిపోయారు

లక్ష్మికి నిజానికి యిక్కడ పెద్ద పని కన్పించడంలేదు డాక్టరుగారు కన్సల్టింగ్ రూమ్‌లో వున్నంతవరకూ పక్కనే వుండడం అవుట్ పేషెంట్స్‌కు టింపరేచరు తియ్యడం, ఎవరన్నాలేడీస్‌ను డాక్టరుగారు పరీక్షచేస్తుంటే మాత్రం లక్ష్మి తప్పకుండా పక్కనుండాల్సిందే అలాగే లేడీ పేషెంట్సుకు ఆపరేషనప్పుడు పక్కన వుండడం, బి పి చూడడం అంతే పన్లు

(ఇంకా ఉంది)

## తమిళనాడులో హిందీ వ్యతిరేక బాంబులు!

తమిళనాడు మధురకు 45 కిలో మీటర్ల దూరంలో వున్న విరుదునగరుకూ, శ్రీవిల్లి పుత్తూరుకు మధ్యనున్న వో రోడ్డు బ్రిడ్జి క్రింద రెండు నాటు పెద్ద సైజు బాంబులను పోలీసు కనుగొన్నదట మదుర రైలుపట్టాలమీద వో బాంబు ప్రేలి రైలుపట్టాలను చిన్నాభిన్నం చేసింది ఒక రాత్రి యిటీవల కోయంబత్తూరు, సింగనల్లూరు రైల్వేస్టేషను దాటాకవున్న వో బ్రిడ్జి మీద డిశంబరు 11వ తేదీ రాత్రి 3 గంటలకు ఓబాంబు ప్రేలి పట్టాలు, పిష్ ప్లేటులూ ఎగిరిపోయాయట పదవ తేదీ పట్టపగలు మదుర పెద్ద పోస్టాఫీసులోఓ బాంబు ప్రేలి ఒకాయన రెండుగా తెగిపోయాడట ఆయన పొట్ట చీలి, పేగులూ తదితరాలూ బయట పడ్డాయట రెండు కాళ్ళు, రెండు చేతులూ వూడి, ఎగిరి కొన్ని గజాల దూరంలో తలో మూలా పడ్డాయట మద్రాసు త్యాగరాయనగరు హిందీ ప్రచారసభలోని వో తరగతిలో రెండు చిన్న సైజు బాంబులు ప్రేలి భయాన్ని సృష్టించాయట మద్రాసొదిలి మీ సంస్థ ఢిల్లీ వెళ్ళకపోతే మీ ఉనికికే బహు ప్రమాదం అని ఆ హిందీ ప్రచార సంస్థకు వో బెదిరింపు అంతకుముందు వచ్చిందట

## గండం తప్పిన విద్యార్థులు!

తమిళనాడు కముది అనే వూళ్ళోని వో కాలేజిలో వో గదిలో సుమారు 50 మంది విద్యార్థులు బుద్ధిగా పరీక్షా పత్రాలకు సమాధానాలు వ్రాస్తూండగా




(నవంబర్ 23వ తేదీ) సాయింత్రం నాలుగున్నర గంటలకు ఆ గది పైకప్పు రయ్యిన కూలి పోయిందట అది కూలుతూండడం చూసిన విద్యార్థులు పవన పుత్రుణ్ని తలుచుకోడంతో గాయాలు కూడా పెద్దగా తగలకుండా యీ గండం తప్పించుకుని బయటకు పరుగెట్టారట

## రెండు గర్భసంచులు!

గుడివాడకు చెందిన బొర్రాల లలితమ్మ అనే ఒకావిడ కడుపునొప్పితో బాధపడలేక ప్రజా వైద్యశాలను శరణుజొచ్చితే ఆమెను పరీక్షించిన డాక్టరు వెంకట్రావుగారు ఆపరేషను అనివార్యమని తేల్చి, అంత పనీ చేసి, నిశ్చేష్టులయ్యారట ఆమెకు రెండు గర్భసంచులున్నాయట ఒక గర్భసంచిలో వో గడ్డ పెరిగిందట దానివల్ల ఆమెకు కడుపు నొప్పి వస్తోందని ఆయన ఆ గడ్డను సంచితో సహా తీసేసి ఆపరేషను పూర్తిచేశారట రెండు గర్భ సంచు లుండడం చాలా అపురూపమైన, అరుదైన విషయమని ఆయన అన్నారట

# పాలోమని జెరీ

## షార్క్‌ను ఎదిరించిన వీరనారి!

అమెరికాలో రూత్ అనే పోకామె తన ఎడేళ్ళ కూతుర్ని వీపున కట్టుకుని, తన స్నేహితునితో సముద్రస్నానం చేస్తూండగా ఆ పసిపిల్లజారి పోయిందట సరిగ్గా అదే సమయానికి పదడుగుల పొడవున్న వో షార్క్ చేప ఆ పిల్లను పట్టేసిందట కానీ రూత్ మాత్రం హృదయం విజృంభించిందట ఆమె ఆ షార్క్ మీద పడి దాని మూతిమీద పిడికిళ్ళు బిగించి గుద్దసాగిందట ఈ చర్యలో స్నేహితుడు డేవిడ్‌కూడా సాయపడడంతో యిద్దరూ కలిసి ఆ షార్క్ చేప దవడ సాగకొట్టి పిల్లను రక్షించారట

## అక్రమ సంబంధం వద్దన్నందుకు హత్య!

గోరంట్లకు చెందిన వో గ్రామంలో 28 ఏళ్ళ నారాయణమ్మ అనే వివాహిత అదే వూరుకు చెందిన 30 ఏళ్ళ బోయ నరసింహప్ప అనే అతనితో వో ఎనిమిదేళ్ళుగా అక్రమ సంబంధం పెట్టుకు నుందట ఈ విషయం ఇటీవల తెలిసిన ఆమె భర్త 38 ఏళ్ళ తలారి పొతప్ప ఆమెను మందలించి, తగిన కట్టుదిట్టం చేశాడట ప్రియుని కౌగిలి, కామ సుఖం దూరమవడంతో ఆమె మృగంగా మారి, పొలంలో నిద్రపోతున్న తన మొగుడును తన ప్రియుడుతోను అతని స్నేహితునితోనూ చేరి అతి దారుణంగా చంపేసిందట పీకకు తాడు బిగించి, రాళ్ళతో తల పగులకొట్టి చంపి, పొలంలోనే వో గొయ్యి త్రవ్వి, పాతిపెట్టేశారట వారు

## ఏ తండ్రి కన్న బిడ్డో!

సంతానం కావాలని కోర్కెవున్న స్త్రీలు పురుష సంపర్కం లేకుండానే గర్భిణీలు అవడానికి వీలుగా రక్తపు బ్యాంకుల వలెనే వీర్యం బ్యాంకులు కూడా వున్నాయి అయితే యీ బ్యాంకులోని వీర్యంతో గర్భిణులై పిల్లల్నికన్న స్త్రీలను ఆ వీర్యం యిచ్చిన పురుషులు బ్లాక్ మెయిల్ వంటివి చెయ్యకుండా వుండేందుగ్గానూ అమెరికావంటి దేశాలలో వీర్యం యిచ్చిన మగాడి వద్దనుంచి వో ఉత్తరం వ్రాయించి తీసుకుంటున్నారట- ఎప్ప తీసుకుంటే మాత్రం ఆ వీర్యంతో పుట్టిన పిల్లో పిల్లాడో ఆ పోలికతోనూ గుణాలతోనూ బయట పడితే ఇది ఎంతైనా ముసుగులో గుద్దులాటే కదా!

## మందు కు మందు ధనియాల రసం!

తాగిన మైకం బాగా ఎక్కువైతే వో గ్లాసుడు ధనియాల కషాయం దాన్ని గమ్మున క్రిందికి దించగలదట

## అల్పాహారమూ దీర్ఘాయుష్షూ

ఎక్కువ కాలం జీవించాలని కోర్కె వుంటే ఆహారాన్ని తక్కువ తీసుకోవటం, ఎక్కువగా పాలూ, పళ్ళు, కూరలూ, ఆకు కూరలూ ఆహారంగా తీసుకోవడం ముఖ్యమని రష్యను విజ్ఞానులన్నారట

## చచ్చే హక్కయినా ఇవ్వండి ప్రభూ!

గత పదహారు సంవత్సరాలుగా నాగపూరు యుగంధర్ ఎడ్యుకేషనల్ సొసైటీకి చెందిన వో స్కూలులో టీచరుగా పనిచేస్తున్న అరవింద్ జోహరపుర్కార్ అనే ఆయనను ఆ సంస్థ పనినుంచి తొలగించిందట ఆయన దీనిమీద రిట్ వేసి, అది ఎన్నటికీ కటాక్షించకపోయేసరికి హైకోర్టుకు విన్నపం పెట్టుకున్నాడట అందులో తనకు ఉద్యోగం




పోయినందువల్ల జీవనాధారం పోయిందని కనుక తాను జీవించే అవకాశాన్ని పోగొట్టు కున్నానని వ్రాసి, అందుకని తనకు ఆత్మహత్య చేసుకుని ఈ బాధ నుంచి విముక్తి పొందే అవకాశ మైనా యిప్పించగలందులకు మిక్కిలి ప్రార్థిస్తున్నాననీ వుందట- అంతేకదా! బ్రతికే అదృష్టమూ, అవకాశమూ లేనప్పుడు చచ్చే హక్కు నయినా కలిగి వుండవద్దూ! □

పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

## ఆదర్శం

"రండి నాన్నా రండి రా అమ్మా! అలా గుమ్మంలోనే నిలబడి పోయారేమిటి?" సాదరంగా ఆహ్వానించింది సంగీత తల్లి తండ్రులు రాజారావు, శాంతమ్మ గార్లని.

"మీ అబ్బాయి దగ్గర్నుండే వస్తున్నారా మావయ్యా? ఆప్యాయంగా అడిగాడు అల్లుడు పవన్

అవును అల్లుడు గారూ ఆ భ్రష్టుడి గుమ్మం తొక్కనని శపథం చేసి వచ్చాను. కోపంగా అన్నారు



రాజారావుగారు.

ఏదో అడగబోతున్న భర్తని కళ్ళతోనే వారించింది సంగీత.

రెండు నెలలు గడిచాయి. రాజారావు దంపతులకు కూతురి ఇంట్లో కాలం తెలియకుండా గడచిపోతోంది. అల్లుడి ఆదరణ, కూతురి ఆప్యా



యత, మనవల అభిమానం రాజారావు గారిని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. సంగీత తను వంట కూడా చేసి ఆఫీస్‌కి వెళ్తుందే తప్ప, శాంతమ్మ గారిని వంట కూడా చెయ్యనివ్వదు. ఏ పని చెయ్యబోయినా "నీకెందుకమ్మా ఈ వయసులో శ్రమ, నే చేస్తాగా. నువ్వు హాయిగా పురాణం చదువుకో" అని సున్నితంగా మందలించి పనంతా తనే చేసుకుంటుంది సంగీత

ఒకరోజు ఎంతో అన్యోన్యంగా ఉండే కూతురు అల్లుడు ముభావంగా ఉండడం గమనించి విషయమేమిటని అడిగారు రాజారావుగారు

యస్ డి పరీక్ష ద్వారా నాకు పుట్టబోయేది అమ్మాయి అని చెప్పారు డాక్టర్ ఈయనకి అమ్మాయి ఇష్టంలేదట అందుకని అబార్షన్ చేయించుకోమంటున్నారు మీరు చెప్పండి నాన్నా? అమ్మాయైతే నష్టం ఏంటట? కోపంగా అడిగింది సంగీత

'చూడు బాబూ! చిన్నవాడివి ఆడపిల్లయితే అన్నీ ఖర్చులే అనో, ఈ పురుషాధిక్య సమాజంలో తగిన స్థానం లభించదనో భయపడుతున్నావు కదూ మా పరిస్థితి చూస్తున్నావు కదా ఈ వార్ధక్యంలో కొడుకు వెళ్ళిపొమ్మంటే మాకు దిక్కయ్యింది కూతురే. ఈ వయసులో మాకు కావలసింది ఆదరణ, ఆప్యాయత. అవి మీ దగ్గరే చవి చూసాం. మా సంగీత కురిపించిన ఆదరణలో కొడుకు ఛీదరింపులు, చీత్కారాలు మరచి పోయాం. నీవు చూపించిన గౌరవం, అభిమానంలో మా కోడలి ఈసడింపులు, తిరస్కారాలు మర్చిపోయాం రేపు మీకు ఇదే పరిస్థితి ఎదురయితే? ఒక్కసారి ఆలోచించు అయినా ఆడా, మగా అన్నది కాదు ముఖ్యం జన్మనిచ్చి, బ్రతకడం నేర్పినందుకు కృతజ్ఞత చూపారా లేదా అన్నది చూడాలి అన్నారు రాజారావుగారు నచ్చచెప్పే ధోరణిలో

నిజమే మావగారూ! నేనివన్నీ ఆలోచించలేదు ఆడపిల్లయితేనేం మంచి చదువు చెప్పించి, మగ పిల్లలతో సమానంగా పెంచి చక్కగా తీర్చిదిద్దుతాను ఈ విషయంలో మీరే నాకు ఆదర్శం అన్నాడు పవన్ స్థిరంగా

భర్త అంత వేగం మారుతాడని ఊహించని సంగీత తేలికగా ఊపిరి పీల్చుకుంది

ఎస్. సాయిప్రసాద్,
విజయనగరం.

★ ★ ★

## ఆరోగ్యం ఆయుర్దాయం ముఖ్యం

గర్భస్థ శిశువు ఆడో మొగో చెప్పగలరు. కానీ వాళ్ళ ఆయుర్దాయము ఎంతో ఎవ్వరూ చెప్పలేరు కదా! మాకు మొదటి సారి పాప పుట్టినప్పుడు అందరూ "ఆడపిల్లా" అన్నారు. కాని మేము అలా అనుకోలేదు. మా ఇంటికి లక్ష్మి అనుకున్నాము. అప్పటికి ఇంకా వైద్య విజ్ఞానం అంతగా పెరగలేదు. (కడుపులోని బిడ్డ ఆడ, మగ అని చెప్పటానికి). అలాగే రెండవసారి పాప పుట్టింది. ఎవరైనా సరే ఇద్దరితో ఆపాలని అనుకున్నాము. కాని అనుకోని మా అజాగ్రత్త వల్ల మూడవ సాం మూడవలన వచ్చింది అందరూ ఆడపిల్లో, మొగపిల్లాడో తెలుసుకోమని సలహాలు ఇచ్చేవారు కాని అది మాకు ఇష్టం లేదు ఎవరైనా సరే అని అనుకున్నాము మూడవ కాన్పులో బాబు పుట్టాడు ఆపరేషన్ చేయించుకున్నాను కాని విధి వశాత్తు 4వ నెలలో మాబాబుకి నీళ్ళ విరేచనములు సంభవించి బాబు చనిపోయాడు రెండు నెలల క్రితం చనిపోయినా నాబాబు ఇంకా నా గుండెలలో మంటగా మిగిలి




పోయాడు.

ఇదంతా ఎందుకు వ్రాస్తున్నాను అంటే పుట్టబోయే బిడ్డ ఎవరైనా ఆరోగ్యంగా తమ కళ్ళ ముందు పెరిగి పెద్ద అవ్వాలని కోరుకుంటారు. కాబట్టి ఎవరు పుడతారు అనే దాని



కన్నా మరణాలు జరగకుండా ఉండాలంటే ఏమి చెయ్యాలి అనే అంశం మీద ఆలోచిస్తే బాగుంటుంది. చాల మందికి మేలు జరుగుతుంది.

జి. సోమలక్ష్మి,
యూసఫ్‌గూడా,
హైదరాబాదు.

# మాతృదేవత

'మాతా పూర్వ రూపం
పితోత్తర రూపం
ప్రజా సంధిః' అని వేదోక్త

ప్రతీ జీవి వెనుక మాతా పితరుల రూపములు ఎంత అవసరమో దీనిని బట్టి తెలియగలదు అంతేగాక 'మాతృ దేవో భవ, పితృ దేవో భవ, ఆచార్య దేవో భవ ఇందు గూడా ఆ మాతృత్వానికే ప్రథమ స్థానము నమాతుః పరదైవతం' తల్లిని మించిన దైవం లేదని పురాణాలు మొ॥ ఎప్పుడో ఎవో కొన్ని అవాంఛనీయ సంఘటనలు, కాకతాళీయంగా



జరిగిన విచిత్ర సంఘటనలను దృష్టిలో ఉంచుకొని మనస్సుని అల్లకల్లోలం చేసుకోరాదు

ఏదేశమేగినా ఎందుకాలిడినా పొగడరా నీ తల్లి భూమి భారతిని ఆ మాదేవి స్త్రీ మూర్తే గదా! ఏదేశంలో స్త్రీని ఆరాధ్య దేవతగా పూజింతురో ఆదేశం సర్వకాల సర్వావస్థలయందు సిరిసంపద, సస్యశ్యామలాలతో తులతూగు నని మన పూర్వీకులు ఏనాడో చెప్పారు జన్మనీయడం స్త్రీకి మరో వరం నవ మాసాలు మోసి, గర్భంలో ఆ శిశువు కన్న కలలను నిజం కాకముందే ఆగర్భం ధరించే శిశువు 'ఆడబిడ్డ" అని తెలియగానే తృంచి పారేయడం కోసం చేసే విశ్వ ప్రయత్నాలు ' స్త్రీ మూర్తిగా చేయవలసిన పనేనా మన మాతృ దేవతలు ఆనాడే అలా తృంచేసి వుంటే ఈనాడు స్త్రీ అనే పదాన్కి నిర్వచనం లేకుండా పోయేదే కదా! ఆడబిడ్డె, జన్మించి పేరు ప్రఖ్యాతులు సాధించిన నాడు ఆ తలిదండ్రులు పొందే అనుభూతి, వారు జాతికి, దేశానికి, ప్రపంచానికి గర్వకారణంగా నిలచిన నాడు ఆ జన్మ నిచ్చిన వారు పొందే




ఆనందం మాటలతో చెప్పనలవి కాదుగదా!

ఉదాహరణకి మన భారత ప్రధాని స్వర్గీయ శ్రీమతి ఇందిరాగాంధీ మార్గరెట్ థాచర్, పి. టి. ఉష స్త్రీ మూర్తులు కారా?

కనుక ఏ మాతృమూర్తి అయినా తను గర్భం ధరించగానే ఆ గర్భం ఆడబిడ్డే అని, ఆ పిండోత్పత్తిని తృంచక జాతి పురోభివృద్ధికై ఆలోచించాలి సర్వాంతర్యామి ఆ ఆది శక్తి ఆరాధ్య స్త్రీ మూర్తి కాదా!

అంకితం అలాంటి ఆ మాతృ దేవత పాద పద్మములకు

పంతిని. శ్రీనివాసరావు,
పర్లాకిమిడి,(ఒరిస్సా)

# అమానుషం

గర్భస్థంగా ఉన్న పిండం ఆడా – మగా అని తెలుసుకునేంతవరకు మనసైన్సు పురోభివృద్ధి చెందటం



అభినందించాల్సిన విషయం. సెక్స్ డిటర్ మినేషన్ టెస్టు జరిపించి గర్భంలో ఉన్న పిండం ఆడా – మగా యని తెలుసుకొనుట సామాన్య స్త్రీలకు అందుబాటులో లేనిది, చాలా వ్యయ ప్రయాసలతో కూడుకున్నపని.

నాటి స్త్రీల వ్యవస్థకన్న నేటి స్త్రీల వ్యవస్థ ఎన్నోరెట్లు అభివృద్ధి చెందినదనే చెప్పాలి. స్త్రీ పురుషులు సమానం అనే ఈ రోజుల్లో కూడా ఆడబిడ్డని కనటానికి వెరపు చెందుతున్నారంటే హాస్యాస్పదంగా ఉంటుంది. మగబిడ్డను కనినంత మాత్రాన వాడు దేశ అభ్యుదయం పట్ల ఎనలేని కృషి చేస్తాడని ఊహించి పక్షపాత బుద్ధితో కనడం చెయ్యరాని నేరం మాతృప్రేమకు ఆడా - మగా అనే తారతమ్యాలు ఉంటే ఆ మాతృ ప్రేమకు అర్థం లేదనే చెప్పాలి

అలనాడు ఝాన్సీరాణీ, రాణీ రుద్రమదేవివంటి వీర వనితలు, తదుపరి సరోజినీనాయుడు, మదర్ థెరిసా, ఇందిరాగాంధీ, నేటి కుముద్ బెన్‌జోషి వంటి ఎందరో నడుముకట్టి దేశాభ్యుదయం పట్ల ఎనలేని కృషి చేసారు, చేస్తున్నారు. నేడు వివిధ సంస్థలలో స్త్రీలే ముందంజ వేస్తున్నారు. గర్భంలో ఉన్నపిండం ఆడ అయినంత మాత్రాన ఏదో పెద్ద తప్పుచేసినట్లు బాధపడడం, ఆడబిడ్డ పుడితే సంఘంలో ఎన్నో అగచాట్లను ఎదుర్కోవటం కష్టమని లేనిపోని అపోహలతో అన్నెము, పున్నెము ఎరుగని ఆడబిడ్డ, అనబడే పిండాన్ని దారుణంగా హతమార్చటం స్త్రీజాతికే అవమానం. స్త్రీ అయి పుట్టికూడ స్త్రీ ఆకారమునే సహించలేకపోవుట మూర్ఖత్వం. ప్రపంచంలో




పుట్టిన ప్రతీ ఆడ బిడ్డ భవిష్యత్తు వక్రమార్గములో పయనించటంలేదు నూటికి కోటికి ఒకరు విధి వంచితలయి దురన్యాయాలకు బలి అవుతున్నారు

ఆడరూపం అనబడే పిండాన్ని క్రమంగా నిర్మూలిస్తే ముందు తరాలకు స్త్రీ రూపమే కనుమరుగవక తప్పదు ఆ తదుపరి ఎక్కడో ఒక్కస్త్రీ కనిపిస్తే వందమంది పురుషులు రాక్షసత్వంగా బలాత్కరించే రోజులు వస్తాయి

దుర్మార్గాలకు దుశ్చర్యలకు ఆలవాలమైన మగపిండాన్ని నిరోధించి స్త్రీ సామ్రాజ్యము నెలకొల్పినస్త్రీ పూర్తి స్వతంత్రురాలై అర్ధరాత్రికూడ స్వేచ్ఛగా తిరగవచ్చును, కాని కాలక్రమేణా సృష్టి స్తంభించిపోతుంది

ఏది ఏమయినా సృష్టికి మూలకారకులు స్త్రీ పురుషులు ఇద్దరూ సమానులే అని నా అభిప్రాయం.

జమ్మాన రాజేశ్వరి,
విజయనగరం.. □

కూపన్

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు . ____________________

______________________________________

పూర్తి చిరునామా ____________________

పిన్ కోడ్ . ____________________




రెండు గంటల తర్వాత రానున్న బస్సుకొర కెదిరి చూస్తూ బస్టాండులో సిమెంటు బెంచీపై కూర్చున్న రాజవ్వ కనుగుడ్లనిండా నీళ్ళు కడుపులో కదివెడు దుఃఖం. పిల్లవాయువు తాకినా వర్షించే మేఘంలా వున్న ముఖంలో బాధ హృదయం నిండా అంతులేని ఆవేదన . ఎంత ఆపుకుందామన్నా ఆగకుండా వస్తున్న కన్నీటిని కొంగుతో తుడుచుకుంది తడిసిన కనురెప్పలను టప టప లాడించింది పీచులావున్న తెల్లవెంట్రుకల్లో చేయిబెట్టి గోక్కుంది ప్రక్కనున్న జనుపసంచిని చూసుకుంది . ముదిమితో బక్కచిక్కిపోతున్న శరీరంను, ఆ శరీరం కప్పడానికి కట్టుకున్న దొడ్డు చేనేత చీరను చూసుకుంది వస్తూపోతున్న జనాలను చూస్తూ కూర్చుంది ఎంత మరిచిపోదామన్నా కోడలుమాట లామెకు మరుపుకు రావడం లేదు చెవుల్లో అవే మాటలు గింగురుమంటున్నాయి 'తానేం తప్పు చేసింది ? కొడుకు కోడలుకేం ద్రోహం చేసింది ? తనను చూస్తేనే కోడలెందు కసహ్యించుకుంటుంది ? తన పంచప్రాణాలుగా భావించిన కొడుకు ఎందుకు దూరమవుతున్నాడు ? తన ప్రాణంకంటె ఎక్కువయిన కొడుకును చూడకుండా తాను బ్రతుకగలదా ? తానేం పాపం చేసిందని తనకింత కడుపుకోత .? ఎవరి కన్యాయం చేసానని పేగుతెంచుకు పుట్టినబిడ్డ తనగ్గాకుండా పోతున్నాడు ? రాజవ్వలో రకరకాల ఆలోచనలు వెనుకున్న చెట్టుకొరిగి కూర్చుంది ఆమె కళ్ళముందెన్నో దృశ్యాలు . తన జీవితం – కొడుక్కొరకు తాను పడ్డ తపన. అనుభవించిన మానసిక హింస... సంతానం... కొడుకు నెదపై ఉంచుకొని పెంచుకోవడం చదువు అన్నీ ఒక్కొక్కటే ఆమె కళ్ళముందు కదులుతూ ఆమె మనస్సు గత జీవిత పుటల్లోకి పరుగిడుతుంది.

*   *   *

పేద వ్యవసాయ కుటుంబంలో పుట్టిన రాజవ్వకు పదవ యేటనే పెళ్ళయింది భర్త రంగయ్య వ్యవసాయం వృత్తిగా జీవిస్తున్నాడు రంగయ్య. అత నిద్ద రన్నలకు కలిసి పన్నెం డెకరాల భూముంది రాజవ్వ పెళ్ళయినపుడు వ్యవసాయం ఉమ్మడిగానే సాగేది పద్నాలుగవయేట రజస్వలయిన రాజవ్వకు శోభనం చేసారు రెండెడ్లతో నాలుగెకరాల భూమితో రంగయ్య వేరుపడ్డాడు కాపురం వేరయినా ఒకే ఇంట్లో ముగ్గురన్నదమ్ములు, తల్లిదండ్రులుండటంవల్ల ఇల్లెప్పుడూ సందడిగానే వుంటుంది శోభనమయిన ఏడాదినుంచే పిల్లలు కలగటం లేదని రాజవ్వ కత్తపోరు మొదలయింది నాలుగైదేళ్ళు గడిచినా పిల్లల్లేక పోయేసరికి పోరు మరింతెక్కువయింది పుట్టింటి కొచ్చినపుడు ఆడబిడ్డ గుణిపింపులు కూడా తప్పలేదు మరోదిక్కు తోడికోడళ్ళ మూతి విరుపులు ఎందరెన్ని అవమానాలు చేసినా భర్తమాత్రం ఆప్యాయంగా చూసుకోవడంవల్ల గుడ్లనీళ్ళు కుక్కుకొని కాలం గడుపుతుంది రాజవ్వ గొడ్రాలని, గొడ్డుముండని అత్త ఆడుబిడ్డ తిట్టడం మొదలుపెట్టినా మౌనంగానే భరించింది వాళ్ళమాటలు శూలాల్లా తాకి బాధించగా మూగగా రోదించింది... సంతానం కొరకు మొక్కరాని మొక్కులు మొక్కింది . ఎక్కరాని గుట్టలెక్కింది... ముడుపులు గట్టింది . గోదావరి స్నానాలు చేసింది కోనేటి స్నానాలు చేసింది సంతానం కలిగితే కోళ్ళాగెను కట్టేస్తానని వేములవాడ రాజన్నకు మొక్కింది .. కొండకు నడుచుకుంటూ ఎక్కివచ్చి నోముకుంటానని కొండగట్టంజన్నకు మొక్కింది పట్నా లేస్తానని కొమురవెల్లి మల్లన్నకు, ఓదెల మల్లన్నకు మొక్కింది... పుట్టువెంట్రుకలు తీస్తానని తిరుపతి వెంకన్నకు మొక్కింది... సంతాన మివ్వమని నాంపల్లి నరసింహస్వామిని, అయిలోని మల్లిఖార్జునున్ని ప్రార్థించింది సంతానం బండలను కౌగలించుకొని పబ్బతి పట్టింది పేరుపేరునా దేవుళ్ళను వేడుకుంది

ఉపవాసాలుంది. ఒళ్ళుహూనం చేసుకుంది అయ్యవార్లతో తాయెత్తులు కట్టించుకుంది మంత్రగాళ్ళతో దించి పోయించింది పుట్టలో పాలుపోసింది సంతానం కొరకు తపించి తపించి ఏడ్చింది అయినా ఫలితం శూన్యం "ఇది గొడ్డుది దీనికి పిల్లలు గారిగ మల్లోదాన్ని సేసుకో " అని కొడుక్కు సలహా ఇచ్చింది రంగయ్య తల్లి

'నన్నన్యాయం చెయ్యకు అని భర్త కాళ్ళు పట్టుకొని భోరున దుఃఖించింది రాజవ్వ

భార్యను దగ్గరకు తీసుకొని ఓదార్చాడు రంగయ్య "పిచ్చిదానా' ఎందుకనేడుస్తవు? మనకు పిల్లలు పుట్టినా మంచిదే పుట్టకున్నా మంచిదే బ్రమ్మదేవుడు దిగచ్చి చెప్పినా మల్ల

లగ్గం సేసుకోను..."

భర్త మాటలతో ఎంతో ఉపశమనం కల్గింది రాజవ్వకు... దేవుళ్లకు మొక్కడంతోపాటు సంతానం కొరకై ఇతర ప్రయత్నాలు చేస్తూనే వుంది. ఎంత అసహ్యంగా వున్నా చెట్ల పసర్లు తాగింది... కల్లులో పోసినా, బెల్లంలో పెట్టిచ్చినా, కషాయంలా ఇచ్చినా తాగింది... ఆయుర్వేద మందులెన్నో మ్రింగింది... కఠోర పత్యం చేసింది... కఠికనేలపై పడుకోమంటే పడుకుంది. ఒక్కపొద్దు వెళ్లిపోయి కొరంలో అన్నం తినాలంటే తింది...

కాలం గడుస్తున్న కొద్దీ ఆమె ఒడి శిశువునెత్తుకోవాలని, హృదయానికి హత్తుకోవాలని కోరుకుంటుంది... అవ్వా (అమ్మా) అని, పిలిపించుకోవాలని ఆమె తహ తహలాడుతుంది... ఓ దిక్కు ముడుపులు. మ్రొక్కులు జరుగుతున్నాయి. చెట్లమందులతో లాభంలేదని భార్యాభర్తలిద్దరు పట్నంపోయి లేడీ డాక్టర్ను కలిసారు. ఇద్దరూ అన్ని పరీక్షలు చేయించుకున్నారు... రాజవ్వకు ఒక్కటే ఆపరేషన్‌చేసి కొన్ని మందులు రాసిచ్చింది డాక్టర్...

"నా కొడుకును ఖర్సుల్ల పెడుతన్నవు – ఎక్కన్నుంచి దాపురించినవే శనోలె..." అని తిట్టినా భరిస్తూ డాక్టరమ్మను కలిసింది భర్త సాయంతో... రెండు మూడేళ్లు రెన్నెల్లకోసారి పరీక్ష చేయించుకొని మందులు తింది... ఆ మందులవల్ల శరీరం తింపినా, దౌను వచ్చినా భరిస్తూ కళ్లు మూసుకొని మింగింది... అటు వ్యవసాయప్పని చేయడం... ఇటు మందులు తినటం... శరీరం శుష్కించింది... అయినా విసుగు చెందలేదు.

"ఇగ పొరగండ్లే ముయితరు తియ్యి..." అని ఇరుగు పొరుగు వారనే సూటిపోటి సూదుల్లాంటి మాటలనూ సహించింది...

ఓ దశాబ్దం తర్వాత ఆమె కష్టానికి ఫలితం లభించింది. డాక్టర్ పరీక్షచేసి నెలతప్పిందని చెప్పిన రోజున సంతోషానికి మేరలేదు... తాను తల్లి కాబోతున్నందుకు పొంగిపోతూ గంతులేసింది.... అత్త ఆడుబిడ్డలు రంగయ్యకు డబ్బు ఖర్చవుతుందని ముఖం చిట్లించినా భర్తతో కలిసి ఆనందం పంచుకుంది ... ఇంట్లో పనికి చెల్లెల్ని పిలిపించుకొంది... బరువు లెత్తొద్దంటే ఎత్తలేదు... ఎక్కువ విశ్రాంతవసరమంటే అలాగే తీసుకుంది. డాక్టర్ చెప్పినట్టల్లా పాటించింది. చిన్నకడుపునొప్పొస్తే ఆందోళనతో డాక్టర్ దగ్గరకు పరుగెత్తింది... అన్ని జాగ్రత్తలు తీసుకుంటూ తొమ్మిదినెలలు తన గర్భాన్ని అపురూపంగా కాపాడుకుంది...

కడుపులో కాయపడటానికో జన్మనెత్తిన రాజవ్వ శిశువుకు జన్మనివ్వడానికి మరో జన్మనెత్తాల్సొచ్చింది. ఆ కానుపామెకు పునర్జన్మే అయింది. పెద్దాపరేషనయిన తర్వాత రెండురోజులు చావుబ్రతుకుల మధ్య పోరాటం జరిగింది... ఆపరేషన్ థియేటర్లో కెళ్లేముందే తానేమైనా తన పుట్టబోయే సంతానం బతుకాలని డాక్టర్ను వేడుకుంది. ఒకవేళ తాను పోతే శిశువును మంచిగా చూసుకొమ్మని భర్తకు చెబుతూ కన్నీరు కార్చింది... రెండ్రోజుల సంకుల సమరం తర్వాత స్పృహలో కొచ్చిన రాజవ్వ ప్రక్కలో మెత్తగా కదులుతున్న పసికూనను చూసి పరవశించింది... ఆప్యాయంగా బాబును తడిమి చూసింది. ప్రక్కకు ఒత్తిగిలి చెంపలను ముద్దుపెట్టుకుంది... బుల్లి బుల్లి చెంపలను నిమురుతూ తన్మయత్వం చెందింది..... పాప ఏడిస్తే నానా హైరానా పడింది... నడ్డివిరిస్తే కడుపునొప్పేమోనని ఆందోళన చెందింది... మూత్ర మాలస్యమైతే గిజ గిజలాడింది... దొడ్డికి పోకుంటే ఆమె గుండె కొట్టుకుంది... పాలు సరిగా తాగకుంటే ఏడ్చింది... భర్తతో ఉయ్యాల కొనిపించింది..... పేగుతెంచుకు పుట్టిన బిడ్డను సగర్వంగా చూసుకుంది... ఎవరు చూసిపోయినా దృష్టి దోషం తగులుతుందని జేడిగింజలు తింపేసింది. కళ్లలో వత్తులేసుకొని తెల్లవార్లూ జాగరణ చేస్తూ బాబును చూసుకుంది... అసహ్యాన్ని సహించని రాజవ్వ కొడుకు మూత్రం, మలం శరీరమంతా అంటినా అసహ్యించుకోలేదు. బారసాల ఉన్నదాంట్లో ఘనంగానే చేశారు... బాబుకు తిరుపతి అని పేరు పెట్టారు. "తిరుపతవ్వా" అంటూ నోరారా పిలుచుకుంది రాజవ్వ...

కొడుకు పాకితే ఆమె మనసుప్పొంగింది... అంబాడితే ఎగిరి గంతులేసింది... మంచాలను పట్టుకొని నడిస్తే సంతోషంతో అరిచింది.. బుల్లి బుల్లి అడుగులేస్తే తన్మయత్వంతో చూసింది... గుణ గుణ పరుగెత్తితే ఆ తల్లి హృదయం ఆనందంతో పరుగులెత్తింది... కొడుకు తనను 'అవ్వా' (అమ్మా) అని పిలిచిన్నాడు రాజవ్వకు కాలు భూమిపై నిలువలేదు.. ఇంటింటికీ తిరిగి తన



కొడుక్కు మాటలొస్తున్నాయని చెప్పుకుంటూ పరవశం చెందింది... కొడుకును తీసుకొని హృదయానికి హత్తుకుంది.. ఆమెకిప్పుడు కొడుకే లోకమయాడు. కొడుకేడవకుండా చంకలో ఎత్తుకొని తిప్పింది... తలపై కూర్చుండబెట్టుకొని తిప్పింది.. భుజాలపై ఉంచుకొని తిప్పింది... కాళ్ళ మధ్య ఉంచుకొని ఉయ్యాలలూపింది... జోల పాట పాడింది.. కొడుకేడిస్తే ఏడ్చింది... నవ్వితే నవ్వింది... గోరు ముద్దలు తినిపించింది... ఉగ్గు బువ్వ తినిపించింది... 'గావురాల కన్నె పుడితే గద్ద



మా అమ్మా నాన్నా
నాకు కుదిర్చిపెట్టారు
నలబైఏళ్ళనాడు
మంచి మార్గదర్శిని
నాలుగు నెలల క్రింతట
నా కొడుకులు
కొని తెచ్చారు
ఒక మారదర్శిని
ఆ రంగుల బొమ్మల
పెట్టె వచ్చింది
అంతే మా ఇంట్లో
అంతా దాని చుట్టూ చెరుతారు
కొందరికె కనిపిస్తుదుది
కాని అందరికీ వినిపిస్తుంది
తస్సదియ్య తగని ఆకర్షణ
చిన్నపిల్లలకు కేరింతలు
పెద్ద ఎల్లలకు పులకరింతలు
ఇల్లంతా గందరగోళం
గల్లంతులు, గమ్మత్తులు
నా సంగితం వినే వారెవ్వరు?
ఆహారం పెట్టె వారెవ్వరు
ఎది పట్టదు, ఎమి చూడరు
'నూకడ్' వస్తె ఎంతో సరదా
'బునియాద్, రాగ్‌దర్బారా
ఎక్, దొ, తిన్ చార్-
రాజ్‌సె స్వరాజ్ లేదా
శ్రికాంత్ ఏదో ఒకటి
వారి వ్యాపకం
సాయంత్రం వచ్చెబందువులు
ప్రక్క ఇండ్ల స్నెహితులూ
హితులూ, సన్నిహితులూ
అమ్మలక్కలూ, ఆగంతకులూ
వాళ్ళూ, వీళ్ళూ తివాచిలు పరుస్తారు
కొడుకులూ, కోడళ్ళూ,
కూతుళ్ళూ, అల్లుళ్ళూ
ఇల్లు ఇరుకైంది
ఇవిగాక వీడియోలు
తెల్లవార్లూ కాలక్షేపం
దూరదర్శిని, మా
మార్గదర్శినికి
అయింది ఒక నిక్షేపం

–ఎం. ఎస్. ఎం

# పుత్రభిక్ష

పొరల్లోని చెవులు కుట్టిచ్చిందట ' అని జనాలు వ్యాఖ్యానించినా ఎవ్వరేమన్నా తన బాబే లోకంగా ప్రాణానికి ప్రాణంగా రెండేళ్ళు పెంచింది వ్యవసాయ కుటుంబమే అయినా పనికి పోనిదే వెళ్ళని పరిస్థితే అయినా బాబును విడిచి పనికి పోలేదు రెండేళ్ళ తర్వాత ఇంట్లో పనికి బాబును చూసుకోవడానికి చెల్లెల్ని ఇంట్లో ఉంచుకొని పనులకెళ్ళడం ప్రారంభించింది కాని ఏ పనిలో వున్నా బాబు ద్యాసే చెల్లెలు కొడుకును సరిగా చూస్తుందో లేదో అని, ఏడిపిస్తుందో ఏమోనని ఆందోళన ఎంత దూరమున్నా మధ్యనోసారి వచ్చి బాబును చూసుకొని పాలిచ్చి పోయేది అపురూపంగా ప్రాణం కంటే ఎక్కువగా ఐదేళ్ళు పెంచింది

ఐదేళ్ళొచ్చిన కొడుకును బడికి పంపించాలనుకుంది రాజవ్వ తమలాగా మోటు కష్టం చేస్తూ కొడుకు బ్రతుకొద్దనుకుంది తన గారాబు కొడుకు మట్టిలో మట్టై బ్రతకడ మామెకిష్టం లేదు అన్నం తిని నులక మంచంలో పడుకున్న బర్తతో

' తిరుపతికి ఐదేండ్లు వచ్చినయి బడికి తోలిద్దామిగ ' అంది

' సదువంటే మాటలానే మనకెందుకు తియ్యి '' అన్నాడు చుట్ట తాగుతూ రంగయ్య

''ఇయ్యాల్ల రేపందరు సదువుకుంటండ్రు తోలిద్దాం ''

''ఆఁ ఏం సదువులు తియ్యి ఇంక రొండేండ్లయితే నాతోని పాలెవడుతడు నాకు పనిల వేన్నీళ్ళకు సన్నీల్లోలె తోడుంటడు ''

''మనం కట్టపడుతుంది సాలదా ఇగ ఇగ ఉన్న ఓ బూమిల్నిగా పొల్లగాడు గూడు సెయ్యన్నా సదివిపియ్యాలే ''

''మనకెల్లదని సెప్పుతే వినత్తలేదా ?''

''లేక లేక పుట్టిన ఒక్క పొల్లగాడు ఇంకిద్దరాడి పొల్లగండ్లే నాయె అన్నొక్కన్ని సదివిత్తాం గీమోటు కట్టం సేసి బతుకద్దాడు . ''

''సదువుతె నౌకర్లత్తయన్నట్టు గూడ లేదు సదువుకున్నోల్లెంత మంది అట్టిగుంటండో, కనపడుతలేదా ? మల్ల సదువంటవేంది ?''

''ఆనదృట్టం బాగుంటే నౌకరదే దొరుకుతది నౌకరి దొరుకకున్నా సదువుకున్న తెలివి ఏమంటది నలుగురిట్ల తెల్లమొక ముంటది సదువురానోల్లకు రొండు కండ్లుంటి సదువుకున్నోల్లకు నాల్గు కండ్లుంట యంటరు ''

అని భర్తెంత వద్దన్నా కొడుకును చదివించడానికే ఒప్పించింది బళ్ళో చేర్పించింది.. మాష్టారు దగ్గరికెళ్ళి కొడుక్కు చదువు మంచిగా చెప్పుమని వేడుకుంది ధాన్యం అమ్ముకు రావడానికి పట్నం పోయే భర్తతో కొడుక్కు బట్టలు తెమ్మని బలవంతం చేసింది.. ఆడపిల్లల సంగతసలు పట్టించుకొనేలేదు కొడుక్కు చిన్న దెబ్బ తగిలినా, జలుబు చేసినా, జ్వరమొచ్చినా డాక్టర్ దగ్గరకు కంగారుగా పరుగెత్తుకెళ్ళి మందు తీసుకుంది ఆడపిల్లలకంత కంటిక్కో జబ్బు చేసినా పెద్దగా ఆందోళన చెందలేదామె ఒళ్ళు హూనం చేసుకుంటూ, మట్టిలో మట్టిగా మారి పని చేస్తూ కొడుకును హైస్కూల్ చదువు పూర్తి చేయించారు ఇంకా చదువాలంటే కాలేజీ చదువు కొరకు పట్నం పంపాలి

''తిరుపతి సదువుకున్నకాడికి సాలు ఇగ బందు సేద్దాం '' అన్నాడు రంగయ్య

''ఒక్క యాడాదిగూడ పేలుగాలే మంచిగ సదువుకుంటండు కొడుకు ఇంక సదువుకోనియ్యి '' అంది రాజవ్వ

''ఇగ్రోజలంటే ఊళ్ళె సదువాయె పెద్ద ఖర్సుల్లేపాయె ఎట్లనో ఎల్లింది ఇప్పుడు పట్నం తోలియ్యన్నంటి కొద్ది పైసలయితయా ? ఉప్పుతో నిపదారు పంపియ్యన్నాయె ఒంటి నాగలి గట్టిటొని కెళ్ళుతాదె ?''

''కట్టమో నిట్టూరమో అదే ఎల్లుద్ది ఇంకింత కట్ట పడుదాం ఇంత బూమయితే ఉందిగద ఆనికి కాలేజీల స్కాలరుషిప్పు గూడ వత్తదని సారు జెప్పిండు అంతగనం ఎల్లకుంటి ఇంతంత బూమమ్ముదాం గా ఒక్క పొల్లగాడు పైకత్తె మనకు తెల్ల మొకం గాదా ?''

''ఒక్కడొక్కడంటవు ఆడి పొల్లగండ్ల లగ్గాలు సెయ్యద్దానె ? మల్లనాకు సాతగాకుంటపోతంది. పనెల్లుడు కట్టమయితది ''

''ఆడి పొల్ల గండ్లదేంది ? ఎవ్వల్నో పేదోన్నో సాదోన్నో సూసి లగ్గం సేత్తయిపాయె మనకెంత కట్టమయినా ఆన్ని మాత్తరం సదివియ్యాలె ''

అని బర్తను బలవంతం చేసింది రాజవ్వ చివర కొప్పు కోక తప్పలేదు రంగయ్యకు కాలేజీలో చేరాడు తిరుపతి కొడుకును పట్నం పంపేప్పుడెన్నో జాగ్రత్తలు చెప్పింది రాజవ్వ బాగ రాత్రయ్యే వరకు చదువుకోని మెదడు పాడు చేసుకోవద్దంది లంగలతోని స్నేహాలు చేయొద్దంది ఎవ్వరితో కొట్లాటలు పెట్టుకోవద్దంది ఇంకెన్నో చెప్పి పంపుతూ పదిహేను రోజులకోసారయినా తప్పకుండా వచ్చి పొమ్మంది పట్నం వెళ్లే వాళ్ళతో కొడుక్కు పాలు పంపింది పెరుగు పంపింది కొడుక్కాడ సరిగా వండుకొని తింటుండో లేదో అని ఇంట్లో వండుకున్నప్పుడు మాంసం కూడా పంపింది ఇంట్లో చేసుకున్న గారెలు, చకినాలు, అరిసెలు అన్నీ పంపింది.. కొడుక్కొరకు ప్రత్యేకంగా వండి చేపలు కూడా పంపింది తీసుకు పోయే వాళ్ళు విసుక్కున్నా సహించి బతిమిలాడి ఒప్పించి పంపింది. ఇంటికొచ్చినపుడు కొడుకును ఎంతో ప్రేమగా చూసుకుంది. బక్క పడుతున్నావని ఒళ్ళంతా నిమిరి చూసింది దగ్గరుండి అన్నం తినిపించింది. రాజవ్వ శరీరకంగా ఊళ్లో వున్నా ఆమె ప్రాణాలన్నీ కొడుకున్న చోటనే ఉండేవి.. తిరుపతి డిగ్రీలో ఉండగానే చెరి వేయి రూపాయల కట్నమిచ్చి ఇద్దరు

బిడ్డల పెళ్ళిళ్ళు చేసారు ఇంత భూమమ్మి ఎక్కువ కట్నంతో మంచి సంబంధాలు చూద్దామని రంగయ్యంటే కొడుక్కు భూమి ఉంచాలని భూమమ్మనీయలేదు రాజవ్వ తిరుపతి డిగ్రీ, ఆ తరువాత పి జి పూర్తి చేసిన రోజున రాజవ్వ ఎగిరి గంతేసింది ఇంటింటికీ తిరిగి తన కొడుకు పెద్ద చదువు చదివాడని మురిపెంగా చెప్పింది కొడుక్కు పెద్ద నౌకరవుతదని సంబరంగా చెప్పింది.. 'మా తిరుపతవ్వకు నౌకరొచ్చిందంటే మా కట్టాలు పాత్తయి ..' అని మురిసిపోయింది కొడుకు చదువయిపోయే వరకు బార్యా భర్తలు ఎముకల గూళ్ళలా మిగిలారు రాజవ్వ ఆశించినట్టుగానే తిరుపతికి మంచుద్యోగమే వచ్చింది ఆ రోజు రాజవ్వకు కలిగిన ఆనందానికి హద్దుల్లేవు ఉద్యోగం అయిన చోటికి పోతున్న కొడుకును కౌగలించుకొని ఏడ్చింది

"ఇన్రోజులు లగ్గం సేసుకొమ్మంటే సదువు కొంది సేసుకోనంటివి అటినుక నౌకరిగావన్నంటివి ఇప్పుడొక్కనివి పోవల్సి రావట్టె పైలంగుండు మంచిగ తిను రాత్తిరాయెదాక ఎక్కడ తిరుగకు " అని పంపించింది

ఉద్యోగమయిన రెండు మూడు నెలల్లోనే తిరుపతి పెళ్ళయింది పెళ్ళికూతురు సరళ చదువు కున్నమ్మాయి అందమైంది ఉన్న కుటుంబం నుంచి వచ్చింది కొడుకు కోడల్ను చూసి ఈడు జోడైన జంటని ఉప్పొంగి పోయింది రాజవ్వ కోడలుకు దిష్టి తగులుతుందని జీడి తింపేసింది కాని సరళ మాత్రం రాజవ్వ మొరటు మొహాన్ని చూసి ముఖం చిట్లించింది

రాజవ్వ గోచీ పెట్టి కట్టిన చీరను చూసి చీదరించుకుంది ఇల్లును చూసి ముఖమదోలా పెట్టుకుంది రాజవ్వెంత దగ్గరవుదామని ప్రయత్నించినా దూరం దూరం ఉండటానికే ప్రయత్నించింది అత్తవారింట్లో ఉన్నన్ని రోజులు ముళ్ళ మీదున్నట్టే వుంది కాపురానికెళ్ళి మధ్య మధ్యలో ఊరికొచ్చినపుడు కూడా విసుగ్గా ఎప్పుడు బయట సడుదామన్నట్టుగానే వుంది సరళ రాజవ్వ పెట్టిన అన్నాన్ని మెచ్చేది కాదు ఎంతో శ్రద్ధతో తయారు చేసిన కూరలను బాగాలేవని కసిరేది. కోడలు ప్రవర్తన రాజవ్వకు బాధ కల్గించినా సిన్న పిల్ల దానికేమెరుక తియ్యి మెల్ల మెల్లగదే తెలుసుకుంటది అని తనలో తాననుకొని సరిపెట్టుకుంది

* * *

గత జీవిత పుటలను తిరగేస్తున్న రాజవ్వ

"ఏందవ్వ ఇక్కడున్నవేంది .?" అంటూ దగ్గరి కొచ్చిన తిరుపతి స్నేహితుడు రమేష్ మాటలతో ఈ లోకంలో కొచ్చింది రమేష్‌తో పాటు ఇద్దరు యువకులున్నారు

"ఏం లేదు బిడ్డ ఏం లేదు . ఇంటికి పోతన్న బస్సు కోసం సూత్తన్న. ." అంది రాజవ్వ.

"గిప్పుడు బస్సెక్కడుంది. ? అది రావన్నంటి ఇంకో గంటపైన్నే కావాలె ముఖమంతెట్లనో ఏడ్సినట్టున్నదేంది ?" అన్నాడు రమేష్ దగ్గరి కొచ్చి .

వర్షించే మేఘంలా వున్న రాజవ్వలోంచి స్వల్పమైన ఓదార్పు మాటలకే దుఃఖం పెల్లుబికి వచ్చింది . భోరుమని వెక్కి వెక్కి ఏడ్చింది

రమేష్ రాజవ్వ కళ్ళను కొంగుతో తుడిచాడు

"ఊర్కో , అవ్వ ఊర్కో అసలేం జరిగిందో చెప్పు ?" అని ఊరడించాడు

"ఏం జెప్పాలె బిడ్డ ఏం జెప్పుతేముంది ?" అంది ముఖం కొంగుతో తుడుస్తూ

"చెప్పవ్వా చెప్పు నేన్నీ కొడుకసొంటోన్నే ఇంట్లేమన్నా గొడవయిందా ?"

'సెప్పుకుంటే మానం బోతది సెప్పకుంటే పానం బోయెటట్లున్నది కొడుకుల కన్నంగని ఆళ్ళ రాతలు గన్నామా బిడ్డ కోటి తవుసులు (తపస్సు) పట్టి కన్న కొడుకుని ఇగోగీ రెక్కలల్లనే పెంచిన ఇయ్యాల్లగా కొడుకు నాగ్గాకుంటయిపెయిందు "



అంది కన్నీరు కారుతుండగా

"ఏమయిందవ్వ చెప్పు తిరుపతి మంచోడే నిన్నేమన్న తిట్టిండా ?"

"ఆడు దేవునసొంటోడు అని నోట్ల నాలుకన్న లేదు . ఆడు తిట్టినా పడుదు కొట్టినా పడుదు కాని బొక్కలు కలికలిగాంగ పెంచి సదివిచ్చిన కొడుక్కు నా యింటికచ్చే అదికారం లేకుంటయింది కోడలుకు మమ్ముల సూత్తనే రోత ఎన్నిసార్ల ఇంటికి రమ్మన్నా రాదు నేనచ్చున్న కొడుకును కండ్ల నిండ సూసుకపోతనంటే నన్ను జూత్తనే మొకం తింపుకుంటది రుస రుసలాడ్తది నిన్నచ్చిన ఇయ్యాల్ల తనింటికి రావద్దని ఎల్లగొట్టింది " అంది రాజవ్వ

"నువ్వామెకేం ద్రోహం చేసినవు ? నిన్నెందుకలా చేస్తుంది .? ఏమన్నా జగడం పెట్టినవా ? తిట్టినవా .?" అన్నాడు రమేష్

"జవుడం లేదేం లేదు బిడ్డ దానికి మాగాలంటేనె పడది ఊళ్ళకత్తనే ముడుసుకుంటది ఏది పెట్టినా మంచిగ లేదని ఇసిరి కొడ్తది.. ఆమె సదువుకున్నదాయె. మాకు సదువు రాకపాయె తిక్కల కట్టంతోని బతికేనోల్లం నా మాట వింటే దానికి రోత ఇయ్యాల్ల నాకు షానిగ మాట్లాడన్నంటే వత్తదా-? నా కొడుకును తిరుపతవ్వా అని పిలుత్త మోటట సిన్నప్ప ట్నుంచి గట్లనే పిలుసుకుంటి ఖవుసం సేసే కుటుంబం సిందర వందరున్న గుమ్మి, అంచె, గంప సూత్తె విసుగు నేను గోసి పెట్టి కట్టిన సీరెంజూత్తె దానికి రోత గియ్యాల్ల గీ ముసల్తనానికి గోసి తీసి బోలు బట్ట కట్టన్నా సెప్పు గీ ఎంటికలు తెల్లవడ్డవ పేసన్ల వడన్నా సెప్పు కొడుక ?"

"అలాంటిదా నీ కోడలు ? నువ్వు నీ కొడుకును సాదలేదా? కష్టపడి చదివియ్యలేదా ? నువ్వు లేంది వాడేడినుంచొచ్చిండు. ?"

"గీ మోటు సేతులల్లనే పెరిగిండు నా కొడుకు గీ సేతుల్లోనే బువ్వ తినిపించిన కని ఇయ్యాల్టి సేతులు పాడువ యినయి నన్ను ఆల్ల ఇంట్లజూత్తె దాని మానం బోతదట నేను ఇరుగు పొరుగోల్లతోని మాట్లాడితె దానిజ్జతు పోతదట నేనూకె ఇంటికొత్తె దాని పజీత సోతదట నాలుగు నెల్ల నుంచి కొడుకు రాలే నేనన్న సూసిపోదా మనత్తె ఇంట్ల ఊరి చిన్నని పెట్టి నోటి కచ్చినట్టు తిట్టి నా కడుప తొక్కద్దని ఎల్లగొట్టింది నేనెక్కడికి పోవాలె బిడ్డ ఉన్నదే ఒక్క కొడుకాయె ఆది పొరగాండ్లున్నా అల్లునింటికి పొయ్యుండత్తదా కొడుక అన్ని రానియ్యపాయె నేనత్తె గిట్ల జేసె " రాజవ్వ ముఖంలో దైన్యం

"తిరుపతికివన్నీ తెలుపవా అవ్వ. ?"

"కొన్ని తెలుత్తయి కొన్ని తెలువవు అంది మెత్తటిమనసు ఎవ్వల్ని నొప్పించదు అటు భార్యను గద్దరిచ్చి మాటనదు అయినా ఐదారేండ్ల నుంచి ఆ డు సేసే ప్రయత్నం సేత్తన్నే వుందు కానది మారుత లేదు రోజుకింత మాకు

# ధర్మపథం

## నాలుక విలువ




త్వక్కు, చక్షుస్సు, శ్రోత్రము, ఘ్రాణము, రసన అను పంచేంద్రియాల వల్ల స్పర్శ, చూచుట, వినుట, వాసన చూచుట, రుచి చూచుట అనే పనులు క్రమంగా జరుగుతూ ఉన్నవి. ఈ యింద్రియాలు సక్రమంగా పని చేయ లేక పోతే జీవితమే కష్టమయి పోతుంది. రసనేంద్రియ మైన నాలుక రుచికి మాత్రమే కాకుండా వాక్కునకునూ అత్యంత ముఖ్యమైనది. నాలుక పని చెయ్య లేక పోతే మనిషికి మూగతనం వస్తుంది. హృదయంలోని భావాలు వ్యక్తం చెయ్యడం సాధ్యం కాదు. అందువల్ల దాని విలువ ఉభయ విధాలా గొప్పది.

నాలుక పని చేస్తూ ఉన్నా, దానిని స్వాధీనంలో ఉంచుకోక పోతే అనర్థం కలుగుతుంది. అధిక ప్రసంగినీ, అసందర్భంగా మాటలాడే వానినీ చూచి "నాలుకను అదుపులో ఉంచుకో"మ్మని యితరులు హెచ్చరిస్తూ ఉండడం మనం చూస్తూనే ఉన్నాం.

నాలుక పనిచేయక పోతే ఎక్కువ కష్టం ఉండదు. కాని, దానిని అనుచితంగా ఉపయోగిస్తే ఎంతో ఉపద్రవం కలుగవచ్చు. జిహ్వ యొక్క దుర్వినియోగం వల్ల వాక్పారుష్యం కలుగుతుంది. "వాక్పారుష్యము మహా - దారుణ మది విషముకంటె దహనము కంటెన్" అని నీతిజ్ఞులు ఎన్నడో వక్కాణించారు. పరుషంగా మాటలాడడం విషంకన్నా, అగ్ని కన్నా మిక్కిలి దారుణ మైనదట! ఎంచేత నంటే – విషం తాగిన వానిని మాత్రమే చంపుతుంది. అగ్ని తనలో పడిన వానినే దహిస్తుంది. పరుష వాక్కు మాత్రం అలా మాటలాడిన వానినే కాక ఇతరుల నెందరినో నాశనం చేస్తుంది.

మంచి కలగడంలోనూ, చెడుగు కలగడం లోనూ కూడా జిహ్వకు విలువ ఎక్కువ. రోగ పీడితులు జిహ్వాచాపల్యం విడిచి పథ్యంగా ఉన్నప్పుడే రోగం నయమవుతుంది. లేనప్పుడు విషమిస్తుంది. మంచిగా, ఆకర్షించే టట్లు మాట్లాడినప్పుడు ఎట్టి ఘన కార్యాన్నయినా సాధించ వచ్చును. అలా కాక ఇతరులకు అనిష్టంగానూ, కోపం కలిగేటట్లూ మాట్లాడితే తలచిన పని భగ్నమయిపోతుంది.

అనర్థ దాయక మైన వాక్పారుష్యానికి తొందర పాటు కారణం. తొందరపాటు లేక నిదానంతో ఆలోచించి మాటలాడే టప్పుడు వాక్పారుష్యానికి ప్రసక్తి ఉండదు. దీనిని గమనించి నాలుక విలువను గ్రహించి, తొందరపాటు లేకుండా ప్రవర్తించే వాడు కార్య సాధకుడు కాగలడు. అట్టి వానిని అందరూ మెచ్చుకుంటారు.

–బులుసు వేంకట రమణయ్య

## పుత్రభిక్ష

దూరముండన్ననే ప్రయత్నం సేత్తంది ఇగేం జెయ్యాలె బిడ్డ ?"

"మేం నీతో నచ్చి అడుగుతం నడువు .. ఇయ్యల్ల నౌకరి కాగానే పెద్దోదయ్యాడా వీడు .? తల్లి దండ్రు లక్కర్లేకుంటయింద్రా .? భార్యను చక్కజేసుకోవద్దా ? కోడలుకు భర్త సరే కాని అత్తామామలు మురికి మురికిగా కనబడుతున్నారా ? నాలుగు దులిపాస్తాం. నడువ్" అని రాజవ్వ రెక్క బట్టి లేపారు రమేష్‌తో వున్న యువకులు

"అద్దు బిడ్డ అద్దు మీరెవ్వలద్దు . అడిదేవరకే బాధపడుతండు మందిల ఇజ్జతిపోతే అడు తట్టుకోడు అన్నెందు కాగం జెయ్యాలె . నాకు దూరంగున్నా అడు సుకంగుంటె అంతే సాలు ఆడిప్పుడుయింట్లగూడ లేదు . నేనే పొయ్యి దాంతోనె ఆఖరిసారిగ నాలుగు మాటలు సెప్పుత .'' అని సంచి చేతిలోకి తీసుకొ కొడుకింటి దిక్కు నడుస్తుంది రాజవ్వ .

"బిడ్డా నా కొడుకు కదుపుల పడెదాకో తవుసు సేసిన. కదుపుల పడ్డంకో తవుసు సేసిన .. కనిపెంచుటానికో తవుసు సేసిన . సదివిచ్చు కుంటానికో తవుసు సేసిన అడు బుద్ధిగ సదువుకొని పేరు కచ్చిందంతే సాలు మాకు మి పైసలద్దు .. మి సంపాదనద్దు గి రెక్కల కట్టం సేసుకొనెట్లనో మా బతుకుతం కని నా కదుపు తీపె నాపుకునుడు నా నుంచి కాదు బిడ్డ నా కొడుకు కండ్లవడింది నేం బతుక ఎనుకట సావిత్రి పతిభిక్ష కావన్నని కోరిందట ఇయ్యాల నేన్నిన్ను పుత్రబిక్ష కావన్నని కోరుతున్న బిడ్డ నేనింతకంటెక్కో నిన్నేం గోర నువ్వు మా ఇంటికచ్చి ఉండ నంటుందవు మేమిక్కడికత్తె నీ మానం పోతది పరువు పొడయి పోతది ఇగ నా కొడుకు నా కండ్ల వడుతెట్ల ? నెలకోసారన్న, పోనియ్యి రెన్నెల్లకోసారన్న నా కొడుకును నన్ను సూసుకోటానికి రానియ్యి కండ్ల నింద సూసుకోని ఒక్క పూటన్న, ఒక్క రోజన్న ఉంచుకోని పంపుత గీ సాయం మాత్తరం సేయి బిడ్డ నీకూ పిల్లలున్నరు, నాక్కడుపు కోత పెట్టకు బిడ్డ నీ కాళ్ళమీద పడుమన్న పడుత గీ ఒక్క సాయం సెయ్యిబిడ్డ " కోడలితో అనాల్సిన మాటలను పదే పదే మననం చేసుకుంటూ నడుస్తుందా పిచ్చి తల్లి రాజవ్వ ☐



# దూరదర్శనం

లత

ఖజురాహో నృత్య ప్రదర్శన ఆ శిల్పాలను అనుసరించిలేదు- మొదట పద్మా సుబ్రహ్మణ్యం నృత్యం- ఖజురాహో నృత్యగుచ్ఛం లేదా పండుగ గనక అయితే శిల్పప్రకారం శృంగారం ప్రాధాన్యత సంతరించుకొంటుంది కాని ఇది పాత భరతనాట్యంతోనే ప్రారంభం అయింది ఎనౌన్స్ మెంటు విన్నవారు తప్పక నిరుత్సాహ పడతారు- తరువాత ఒరియా నృత్యం కానీ అదీ మామూలు ఒడిశాయే- ఇది ఖజురాహో ఫెస్టివలే తప్ప శృంగార రహిత నేతి బీరకాయ సరస్వతి - మాళవిక సరుకాయ్ మొదలైన నర్తకీమణుల నృత్యం చూసే భాగ్యం కలిగింది ఏమని బోధింతురా నా సామి అన్న తెలుగు జావళీ వినిపించి హాయిగా ఉంది ప్రాణానికి

వింటర్‌టేల్- షేక్స్‌పియర్ మహాకవి గొప్ప నాటకకర్త అనటంలో సందేహంలేదు గాని షేక్స్ పియరెన్ నటవర్గం అంత గొప్ప వాళ్ళని నేను అనుకోవటంలేదు క్షమించాలి

రెండు చెక్కలూ ఒక ఎండిన చెట్టూ భూతం వగైరా సామగ్రితోనే నాటకం అంతా నడిపేస్తున్నారు అయితే ఒకో నటుడూ, నటీ, ఫుల్‌స్టాప్ కామా లేకుండా సుదీర్ఘమైన డైలాగులు (మహా కవి వ్రాసినవే) అప్ప చెపుతారు అందులో సగం వినపడవు

కథ భార్యని అనుమానించి బిడ్డని చంపమనటం ఆఖరికి సేవకుడు కూడా పొడుగుపాటి డైలాగులు చెపుతాడు

ఆ కాలంలో అవి థియేటరుకి అవసరం కావచ్చు ఆ కాలానికి చాలా ముందు ఈ దేశంలో కాళిదాస భవభూత్యాదులు మహా నాటకాల్ని రచించారు అవి ఆడడానికీ చదవటానికీ కూడా గొప్పవి కాళిదాసుని షేక్స్‌పియర్‌తో పోల్చిన కొందరు, ఆంగ్ల మానసపుత్రుల్ని ఇక నమ్మదల్చుకోలేదు శాంతారాం తీసిన స్త్రీ లాగా ఒకటీ కనబడదు షేక్స్‌పియర్ ప్రధాన నాటకాల్ని గురించి నేను అనటంలేదు కాని వాటి ప్రకారం అయినా కాళిదాసుకి పోలిక ఉందా? ఎంతమాత్రం లేదు టెక్నిక్ అభివృద్ధి అయిన రోజుల్లో కూడా పాత టెక్నిక్కును అనుసరించి చాలా సాంప్రదాయం నిలుపుతున్నాం అని గర్వించటం ఇంగ్లీషువారి స్వభావం బహుశా మనం చూస్తున్న వింటర్‌టేల్ విక్టోరియా కాలంనాటిది అయి ఉండాలి

-ఎస్కేప్ టు విక్టరీ- సినిమా బాగుంది కాని ఎడిటింగ్‌లో లోపాలున్నాయి

"అప్పూ ఔర్ పప్పూ" - నాటిక పిల్లల కోసమే అయినా ఏనుగు నటన బాగుంది పెద్దల్ని కూడా ఆకర్షిస్తున్నది

షెర్లాక్‌హోమ్ ఎడ్వంచర్స్ చాలా బాగుంటున్నాయి- ఈ వారం ది ఫైనల్ ప్రోబ్లమ్ ప్రపంచ ప్రఖ్యాత చిత్రాల్లో లియొనారో డవిన్సీ చిత్రించిన 'మోనోలిసా' ఒకటి ఆ చిత్రంలో ఉన్న బావం ఏమిటో ఈనాటికీ విమర్శకులకు అందదు అయితే అతి ఖరీదుకల ఆ చిత్రానికి ప్రతికృతులు తీసి ఒరిజినల్‌గా అమ్మే ఒక ముఠా ఉన్నది దాని మీదుగా కథ నడిపాడు ఆర్థర్ కానన్ డాయిల్ షెర్లాక్‌హోమ్స్ పాత్రని ఈ కథలో అంతం చేసాడు కాని షెర్లాక్ హోమ్స్ చదివి చాలా రోజులయింది టి వి తెరమీద కథలో షెర్లాక్‌హోమ్స్ పాత్ర ముగిసింది కాని షెర్లాక్‌హోమ్స్ అభిమానులు ఒప్పుకోనందున కానన్‌డాయిల్ ఆ పాత్రని మళ్ళీ బ్రతికించినట్లు, గుర్తు శ్రీశ్రీ అన్నట్లు షేక్స్‌పియర్‌కన్న కానన్ డాయిలే గొప్ప రచయితా? ఖేల్‌ఖేల్ మే - మళ్ళీ పిల్లల సీరియల్ కథ దేనికి చూసి ఆనందించటమో- దుఃఖించటమో అంతే మనం చేయవలసింది

ఈ తస్వీర్‌కా దూసరే రూప్' అనే కార్యక్రమంలో టి వి వారు ఆత్మనింద దేనికి చేసుకుంటున్నారో అయోమయంగా ఉంది - అది హాస్యరసం అని వారు తలిస్తే చాలా పొరపాటు ఇది అభాసరసం టి వి విలేఖర్లు ప్రతి ఇంటికీ పోయి టి వి లో చెప్పే మాటలు బాగుండవనీ, టి వి నాటకాలవల్ల కుటుంబాల్లో కొట్లాటలు వస్తున్నాయనీ, చెప్పి మనల్ని ఆనందించమంటున్నారు- ఉషాజీ- రవీజీ అనే ఇద్దరు టి వి లో ఏదీ బాగా లేదని అనిపిస్తారు జనంచేత

టి వి విలేఖర్లు లాఫింగ్‌స్టాక్ కేవలం విదూషకులు. టెలివిజన్‌కి శత్రువులు ఈ సీరియల్ 'కేవలం టి వి పరువు తీస్తున్న చెత్త

గంటలు-' అనే మళయాళం సినిమా చూపించారు అందులో మతంకన్న మానవత్వం గొప్పదన్న సందేశం ఉంది అయితే ఏ మతం గొప్పది? అన్న ప్రశ్నలో దైవం ఉన్నాడు ఆ ప్రశ్నకి, సమాధానంలేదు సినిమా బాగానే ఉంది- (జీన్స్) జన్యు శాస్త్ర ప్రాదాన్యత పెరిగిన తరువాత- మానవులందరూ ఒకటే అనే సిద్ధాంతం వెనకబడిపోయింది. మళ్ళీ తల్లిదండ్రులు వారి గొప్పదనం, దేశం, మతం మొదలైనవి ప్రధానమయినయ్యన్న విషయాన్ని రూట్స్‌లాటి నవలలు మనకి తెలియ చెపుతున్నాయ్.

'తరంగ్' సినిమా అంత ఉన్నతంగాలేదు.

'సైన్స్ మాగజైన్'లో చీకటినుంచి వెలుగులోకి చిన్న డాక్యుమెంటరీలో ఆదిమ మానవుడు రాళ్ళతో నిప్పు చేయటంతో మొదలుపెట్టి క్రీస్తు పూర్వంనించీ ఉన్న రకరకాల వెలుగుల్ని చూపించారు 18 వ శతాబ్దంలో లస్టరుదీపాలు 19వ శతాబ్దంలో వీధుల్లో గ్యాసులైట్లూ వచ్చినయ్ తరువాత ఎడిసన్ వలన విద్యుచ్ఛక్తి వాడకానికి వచ్చింది - వీటి గురించి ఫోడామెహతా సోదాహరణ ప్రసంగం అనంతరం మిస్టర్ మామక్ మాట్లాడాడు అంటే ఇంటర్ వ్యూ అన్నమాట - బాగానే ఉంది ఆంధ్రాలో విద్యుచ్ఛక్తి వ్యవస్థ ఎంత ఘోరంగా ఉందో ఎవరూ చెప్పరు. అందులో అందరూ అస్మదీయులే మరి

'వింటర్స్‌టేల్' చివరిభాగం ఘోరమ్మైన ఇంగ్లీషు (మనకి నచ్చదు) సంగీతంతోనూ నవ్వులతోనూ ప్రారంభమయింది - చంపమన్న పిల్ల పెరిగి ప్రేమలో పడ్డది.

షేక్స్‌పియర్ మహాకవి నాటకాలు చదువుతుంటే ఎంత బాగుంటాయో చూడటానికి అంత బాగుండవని అర్ధమయింది నాకు ఇంగ్లీషు మహా పండితుల అభిరుచి ఈ విషయంలో వేరుగా ఉండచ్చును వారు నన్ను క్షమించాలి - సరే పదహారు వింటర్స్ కథ ఇది - చివరికి అంతా కలుసుకుంటారు ఇది బి బి సి సమర్పణ

'ఫూల్ ఖిలేహై'లో సంజయఖాన్‌తో పరిచయం వచ్చింది అతను రచయిత, డైరెక్టరు యాక్టరు "చాందీసోనా - అబ్దుల్లా దోస్త్ - ఏకఫూల్ దోమాలీ' - మొదలైన సినిమాల్లో నటించిన నటుడు 'తబస్సుమ్' ఇంటర్వ్యూ చేస్తున్న సినిమా కళాకారులతో కూడిన ఈ ప్రోగ్రాం చాలా జనప్రియమ్మైనది ఈ మధ్య మానేశారు. మళ్ళీ ఈ రోజు మొదలు పెట్టినందుకు టి వి ని అభినందించాలి ఇందిరాజీ మీద కవి సమ్మేళనంలో మాయాకిరణ్ అనే కవయిత్రి బాగా వ్రాసింది - నెహ్రూ మానస సరోవర నాట్యహంస అని వ్రాసింది.

హిమాలయానికి ప్రాణం రామాయణానికి రామబాణం - నృత్యగాన మాధురీ మత్తవు నీవు. సూర్యుడిలోనూ చంద్రుడిలోనూ ఉంటావు అన్నది మాయాకిరణ్ గొప్పవాళ్ళు దేవుళ్ళయిన విధానం ఇదే తప్పులేదు బాగుంది. ఆంధ్రాలో మెదక్ అభ్యర్థినిగానే ఇందిరాజీ మరణించారు కాని ఒక ఆంధ్రుడు కూడా ఈ కవి గుంపులో లేడు అదే పక్షపాతం అంటే

"ఋతుచక్ర' - సంగీత రూపకం కాళిదాసు ఋతు సంహారంమీద ఆధారపడిందిట బ్రిజ్ మహారాజ్ నిర్వహణ బ్రిజ్ మహారాజ్ నృత్యం కాళిదాసు కవిత్వం అసలే మధురం ఆపైన మరీ మధురం □



(గత సంచిక తరువాయి)

అతడు వెళ్లిన తరువాత వీణ చేతబుచ్చుకునేది ఏది వాయించినా గుండెకు గాలం వేసి లాగినట్లుండే అతడి పాట చెవిలో మ్రోగేది

అతడికి తనని వదులుకోడం ససేమిరా ఇష్టం లేదు తను సరే అతడి సమక్షంలో తన ఉనికినీ, అస్థిత్వాన్ని మరచి పోతుంది మంత్రముగ్ధలాగ తనేమవుతోందో తనకే తెలియదు

వాస్తవంలో కొస్తే తామిద్దరూ ఒకటిగా జీవించడానికి ఎన్ని అడ్డంకులు? తన పైన ఎన్నో ఆశలు పెట్టుకున్న తన తల్లితండ్రులు వారు తనే లోకంగా జీవిస్తున్నారు వారిని అన్యాయం చేస అతడితో వెళ్ళే ధైర్యం తనకి లేదు

అతడే పోనీ ధైర్యం చేసి అడిగితే? అమ్మో! ఇంకేమన్నా ఉందా? ఇదంతా సంగీతం నేర్పించడం వల్లనే అంటారు అంతటితో సరిపెట్టరు తన నసలు వీణ ముట్టుకోనివ్వరు ఇంకొక సందేహం అతడ్ని బ్రతకనీయరు

అమ్మో! అతడికేదైనా హాని జరిగితే తను జీవించగలదా? అని గుండెలపై చెయ్యి వేసుకొంది

కమ్మగా పాడే కోయిల మూగపోతే అందం ఏముంది? అతడు దేశంలోని ప్రముఖ విద్వాంసులలో ఒకడుగా అవాలన్నది తన అకాంక్ష తనెన్నటికీ అతనికి సరిరాదు తమ కుటుంబాల్లో ఆడది ఎంత నేర్చినా, నాలుగు గోడల మధ్య నుండాల్సిందే

జరిగిన కథ – 7 వీణ పట్ల అమితాసక్తి గల కళ్యాణికి గురువుగారు జబ్బు పడటంతో ఆయన చెప్పిన మీదట కూర్మయ్య కొత్తగా పాఠాలు చెప్పడానికి వస్తుంటాడు ఆయన ప్రవర్తనలోనూ, అలవాట్లలోనూ ఏ మాత్రం సంస్కారం లేని కళ్యాణి బావిస్తుంది మంగకు మాత్రం ఆయన పట్ల గౌరవం కలుగుతుంది క్రమక్రమంగా ఆయన కళా ప్రజ్ఞ పట్ల కళ్యాణికి గౌరవం కలుగుతుంది ఇద్దరూ కలిసి కచేరీలు కూడ ఇవ్వడం ప్రారంభిస్తారు వివాహం జరిగితే అమె కళాతృష్ణ ఆగిపోవలసిందే గదా అని కూర్మయ్యకు విచారం పట్టుకుంటుంది ఆమెకు ఇంట్లో సంబంధాలు చూడడం మొదలెడతారు ఆమె లేకుండా తాను బతకలేనని నిర్ధారించుకుని తన మనసు లోని మాట తెలియ జేస్తాడు కళ్యాణి కూడ ఆయన సాన్నిహిత్యంలో గొప్ప అనురాగాన్ని అనుభవించగలుగుతుంది కాని వివాహం సాధ్యం కాదనే వాస్తవాన్ని గుర్తిస్తుంది కూర్మయ్య ఉద్యోగం కోసం ప్రయత్నించాలని నిశ్చయించుకుంటాడు

అతడి కివేం అర్థం కావు తను ఆలోచించదు తన సమక్షంలో తననీ ఆలోచించనీయడు అతని కౌగిట్లో ఉక్కిరిబిక్కిరి చేస్తాడు.

'కల్యాణీ' నువ్వు నా జీవితానికి దొరికిన అపురూపమైనవరానివి నిన్ను ఇంకొకరికి దక్కనిస్తానా?'

అతని మాటల మైకం మత్తెక్కిస్తుంది అతడి ఊపిరి వెచ్చని గిలిగింతలు రేపుతుంది అతని స్పర్శ నిలువెల్లా పులకింప చేస్తుంది అతని ఒడిలో ఈ ప్రపంచాన్నే మరచిపోతుంది

'అరె! నేనేనా ఇలా ప్రవర్తించింది మా కుటుంబంలో ఏ ఆడపిల్లా ఇంతటి స్వేచ్ఛను అనుభవించలేదు రజస్వల అవగానే ఎన్నో కట్టుదిట్టాలు చేస్తారు. బర్తకు వ్యవసాయమైతే అందరితో కలిసి ఉండి సేవలు చేయాలి. భర్త చదువుకో, ఉద్యోగానికో దూరంగా ఉంటే అత్తవారింట్లో ఉండాలి. అతడితో కాపురానికి వెళ్ళేసరికి పిల్లలు తయారు. నూతన దాంపత్యమంతా చాకిరీతోనే గడిచిపోతుంది ఏ రాత్రికో భర్త పక్కకి చేరతాడు బాలింతగానో, చూలింతగానో జీవితంలోని యవ్వన దశ గడవాలి అబ్బా! తలుచుకుంటేనే రోతగా ఉంది హాయిగా వీణ వాయించుకుంటూ జీవితం గడవాలి '.

అనుకుని మత్తుగా కళ్ళు మూసుకొంది మూసుకున్న కళ్ళ వెనుక అందమైన కలలు.

'అబ్బ' కూర్మయ్య ప్రవేశంతో తొలి వలపు ఎంత తీయనిదో తెలిసింది అది తప్పు' అయినా యవ్వనం చాలా మంది త్రోసిరాజనలేనిది సహజసిద్ధమైన స్పందన, కోరిక ఇమిడి ఉంది. అతడి సమీపంలో తనకి పవిత్రమైన భార్యాభర్తల అనుబంధమే గుర్తొస్తోంది తాళి కట్టకపోవచ్చు' శారీరకంగా ఒకటవక పోవచ్చు' ఈ చట్టాలు, ఈ వివాహ వ్యవస్థ యువతీయువకులను మానసికంగా ఒకటవడానికి ప్రోత్సహించేవే! వివాహం పేరుతో ఇష్టం లేకపోయినా బలి పశువులా ఈడ్చుకెళ్ళమని కాదు అటువంటి వైవాహిక జీవితం పడుపు వృత్తి కంటి హేయమైనది వ్యభిచారం కంటి హీనమైనది.

పల్లెటూర్లలో మరీను. భర్త చిన్నతనంలో పోతే ఆ స్త్రీ తప్పనిసరిగా కోర్కెను అణచుకోవాలి నిగ్రహం లేక ఏ బలహీన క్షణంలోనో తీర్చుకుంటే ఆమెకింక ఆత్మహత్యే శరణ్యం బైటికి పొక్కకుండా అణచేస్తే నీతి, తెలిస్తే అదే అవినీతి నీతి పాఠాలు కేవలం వల్లె వేయడానికే, అచరణలో ఎంత శూన్యమైనా ఫర్వాలేదు తనకీ అతడికీ ఏ అరమరికలూ లేవు పూర్తిగా ఒకరికొకరం అర్థమైనాం" అనుకుంటూ మధురోహలలో తేలుతూ ఆ రాత్రి తీయని కలలు కన్నది.

వారం గడవగానే తల్లీకూతురూ ప్రయాణానికి సిద్ధమైనారు. మంగకు

మందులు వాడమన్నారు ఆమె నీరసంవల్ల మెట్లెక్కలేక క్రింద గదిలో విశ్రాంతి తసుకొంటోంది

'కల్యాణీ' నా స్నేహితుడు అర్జంటుగా రమ్మని టెలిగ్రాము ఇచ్చాడు వివరాలు తెలుసుకొని తొందరగా వచ్చేస్తాను

కూర్మయ్య హడావుడిగా వచ్చి చెప్పాడు అతడి గొంతులో కల్యాణీ ఎడబాటు తట్టుకోలేని ఆవేదన.

కల్యాణి ఆశ్చర్యానందాలతో అతడి వైపు చూసింది ఎంతటి అదృష్టం ఇతడిది!

కళామతల్లిని ఉపాసిస్తారు ఆమె బిడ్డలైన కళాకారులు వారికేం శాపమో జీవితంలో చీకటినే ఎక్కువగా చూస్తారు అమాయకంగా కళతో పొట్ట



పోసుకుందా మనుకునేవారికి పిడికెడు మెతుకులు కూడా పుట్టవు. అదృష్టం ఏ ఒక్కరినో వరిస్తుంది. వారిని అందలం ఎక్కిస్తుంది. ఆ కళామతల్లి తన కరుణా కటాక్షం ఇతడిపై ప్రసరించిందా?

"మీరు తప్పకుండా రాణిస్తారండీ! అక్కడికి వెళ్ళిన తరువాత నేను గుర్తుంటానా?" అప్రయత్నంగా నోరు జారింది.

"నిన్ను మర్చిపోయిన క్షణం నేనే మిగలను కల్యాణీ! నిన్ను విడిచి వెళ్ళడానికి దిగులుగా ఉన్నది. ఉత్తరాలు వ్రాద్దామంటే నీకు గిట్టదు. అక్కడ స్థిరపడగానే నిన్ను తీసుకుపోతాను కల్యాణీ!"

కల్యాణికి ఒక్కసారిగా దిగులు ముంచుకొచ్చింది. ఇంకెన్నడూ అతడ్ని చూడనేమోనన్నంత దిగులుగా చూసింది

అసలే ఉద్రేక స్వభావి ఇంక ఆగగలడా!

కల్యాణీ! నువ్వు కూడా నాతో వచ్చేయి కల్యాణీ! నేను నిన్ను విడిచి వెళ్ళను ఆమెను ఊపిరి తీసుకోనివ్వలేదు

కొంత సేపటికి తెప్పరిల్లింది కల్యాణి నెమ్మదిగా చెప్పింది

"చేతలు మాటలంత సులువా?'

"ఏం! తప్పేమిటి నిన్ను అపురూపంగా చూసుకోనా? ఏదీ నీకు నేనంటే ఇష్టం లేదని చెప్పు ' తన హృదయంపైనున్న ఆమెను మరింతగా హత్తుకుంటూ

అడిగాడు

తనే మాత్రం బైట పడినా అతడు వెళ్ళడు అతడితో జీవితం పంచుకునే అదృష్టం తనకెటూ లేదు ఆశ ఉన్నా అది తీరే మార్గం ఎక్కడా చిక్కటం లేదు వచ్చిన అవకాశం మంచిది అరుదైనది ఇతడి ఉద్రేకానికి తగ్గ వేగం సినీ జీవితంలో ఉంది అతడి సంగీతాన్ని, మంచి మనసునీ నలుగురికీ ఉపయోగపడనీ అది కళాకారిణిగా తను చేయడం మహాపాపం ఇంకో జన్మకు కళాకారిణిగా పుట్టే యోగ్యత పోతుంది ఏ అడవిలో మానుగానో పుడు్తంది ఎటూ దగ్గరుంటే తనని వేరుగా దూరంగా ఉండనీయడు

వాల్చిన కళ్ళు ఎత్తకుండా వచ్చే దుఃఖాన్ని అదిమి పట్టింది పళ్ళ బిగువున ఏడుపు ఆపుకుంది తన అసహాయతను ఎలా చూపాలో తెలియలేదు

"ఏం కల్యాణి' ఎప్పుడూ ఎవరొస్తారా అని దిగులుగా దిక్కులు చూసేదానివి ఈ రోజు ఇలా అతుక్కుపోయావు పైకి వీణే నా సర్వస్వం అంటావు నేనే కదూ నీకు అన్నీ ఇలా జీవిత కాలమంతా నాతో నే ఉంటావు కదూ "

ఆమెపై ప్రేమ మైకం అతడ్ని నిలవనీయటం లేదు లాలనగా ఆమె వెన్నుపై చేయి వేసి ఓదార్చాడు

"ఏమండీ' ఇలా మీ దగ్గరుంటే ఎన్ని జన్మల పరిచయమో అనిపిస్తోంది ఏ జన్మలోనో శాపవశాత్తూ విడిపోయి ఇలా కలిశామేమోనన్పిస్తోంది ' కల్యాణి మనసు ఆమె అదుపు తప్పింది

పిచ్చి కల్యాణీ' లోకం మనని ఈ స్థితిలో చూస్తే ఎంతగానో హేళన చేస్తుంది అయినా నేనెవర్నీ లెక్కచెయ్యను ఇంక వెళ్ళిరానా " ఆమెని విడువలేక విడువలేక విడిచి క్రిందకు వెళ్ళాడు

ఎవరో అపరిచితులున్నారు మంగకు నమస్కారం చేసి మాట్లాడకుండానే వెళ్ళిపోయాడు

ఆమె ఊహలూ, అతడి ఊహలూ తారుమారు చేసేవారే ఆ అపరిచితులని అతడికి తెలియదు వారు చెప్పిన సారాంశం ఒక పది రోజులలో కల్యాణీ వాళ్ళ ఊరు వస్తామనీ, అప్పుడే పెళ్ళికొడుకు వచ్చి చూసుకుంటాడనీ అనారోగ్యం వలన కల్యాణికి ఇప్పటికే సంబందాలంటే విసుగొచ్చి ఉందని మంగ ఈ విషయం కల్యాణికి చెప్పలేదు

కల్యాణి కూడా ఉద్రేక పూరితమైన ప్రేమ మైకంలో మునిగి ఉంది ఆమెకు ఈ లోకమే కన్పించటంలేదు అతడు పలికించే బావాల్ని ఆమె వీణపై పలికించడంలో లీనమయేది తన జీవిత మంతా ఇలా వాయించు కుంటూ గడిపేయ గలదు అతడు చెప్పిన విద్యే తనకి తోడు కనీసం అదైనా దక్కింది అదే చాలు అదే ఆమెకు కొండంత తృప్తినిచ్చేది

కల్యాణికి చూసిన సంబందం సంపన్న కుటుంబానికి చెందినదే అబ్బాయి దూరంగా ఎక్కడో పై చదువులు చదువుతున్నాడు విద్యావంతుడు కదా అమ్మాయి విద్యను ప్రోత్సహిస్తారని ఆమె తండ్రి వారివైపు మొగ్గాడు

అతడు రావడం, చూడటం నామమాత్రంగా జరిగాయి కల్యాణి తన మనసుతో ప్రమేయం లేకుండా కూర్చుంది, తన సుఖంకోసం తనవారిని బలిపెట్టలేదు తనూ అతడూ ఏకమైన రోజు తమ బంధువులు తమ తల్లితండ్రుల్ని బ్రతకనీయరు

అతడంటే మగవాడు ఉద్రేకి కనుక బైటికి అనేశాడు తనకు మాత్రం తన మనసూ తనువూ, ఇంకొకరికి ఇవ్వడం ఇష్టమా?

'అవతలవారికి తనలో ఏం నచ్చిందో? ఈ జీవచ్ఛవంతో ఏం సుఖపడదామని అంగీకరించారో' అని విరక్తిగా నవ్వుకుంది.

ముహూర్తం పెట్టారు శుభలేఖ కూర్మయ్య స్నేహితుడైన సంగీత కళాశాల లెక్చరరుకు వెళ్ళింది అతడు వెంటనే స్నేహితుడికి వ్రాశాడు. అతడికీ కూర్మయ్యకంటే దిగులెక్కువైంది అంత పేరికి పిల్లపై ఎందుకు ఆశలు పెట్టుకున్నావని స్నేహితుడ్ని తిడుతూ వ్రాశాడు. సుదీర్ఘంగా స్నేహితుడికి ఓదార్పు వచనాలు పలుకుతూ ఉత్తరం వ్రాశాడు.

అక్కడతడూ ఆ ఉత్తరం చూసి నిశ్చేష్టుడైనాడు పక్కనున్న స్నేహితుడు ఏం జరిగిందోనని చూశాడు

స్తంభించిన మిత్రుడ్ని, అతడి చేతిలో ఉత్తరాన్ని మార్చి మార్చి చూశాడు పక్కనే పడున్న శుబలేఖని చూశాడు సంగతి అర్ధమైంది క్రిందటి రోజే పెళ్ళిజరిగి పోయింది ఆలస్యంగా పంపాడు స్నేహితుడు బహుశః పంపుదామా మానుదామా అన్న సందిగ్ధంలో పడి ఆలస్యం చేసి ఉండవచ్చు

ఉద్రేకంలో పట్టలేని దుఃఖంతో స్నేహితుడు ఉన్మాదిగా మారుతాడేమోనని దిగులు పడ్డాడు రాత్రీ పగలు కొద్ది రోజులు అతడ్ని కనిపెట్టుకుని ఉంటే దిగులు తగ్గవచ్చు అతని మనసు ఇంకోదారి మళ్ళిస్తే నెమ్మదిగా కోలుకుంటాడనే నిర్ణయానికి వచ్చాడు

నిద్రలో మెళకువలో కూర్మయ్య కల్యాణినే కలవరించాడు కపటం లేని మనసుతో స్నేహితుడితో తన గోడు వెళ్ళబోసుకున్నాడు

చూడు' నీ ఒక్కడికే ఇటువంటివి పరిమితం కాదు ప్రతీ వారికీ జీవితంలో సుఖదుఃఖాలు సమానంగా ఉంటాయి అంతగా నీ కంకిత మైన అమ్మాయి ఏదో బలమైన కారణముంటే గానీ అలా చేయదు పరిస్థితులకు తల వొగ్గి వుంటుంది అసలే చాదస్తులంటున్నావు అబ్బాయి పై ఊరిలో చదువుతున్నాడన్నావు శోభనం చేసుండరులే ఆమె లేందే నువ్వు, నువ్వు లేందే ఆమె జీవించనప్పుడు తీసుకొచ్చేయి బ్రతుకు కంటె విలువైనది మనిషి కింకెం లేదు ఇష్టం లేకుండా భర్తని జీవితాంతం మోసం చేయడం ఆమెకి మాత్రం ఇష్టం ఉంటుందా? ఇప్పుడు నిందలు వేసి, వేలెత్తి చూపిన వారెవరూ, జీవితంలో ఏర్పడిన వెలితిని పిసరంత కూడా పూడ్చలేరు నాకు నువ్వంటే ఎంతో అబిమానం నీ గాత్ర మాధుర్యాన్నీ, ప్రజ్ఞనూ పరిచయం చేసిన ఘనత నాదేనని ఎంతో గర్వంగా ఉన్నాను నువ్వేం దిగులు పెట్టుకోక అని ఎలాగో సమాదాన పరిచాడు

అతడెంతగా ఓదార్చినా లాభం లేక పోయింది ఉద్రేకం పట్టలేని అతడి మానసిక స్థితి శరిరంపై కూడా ప్రబావం చూపింది జ్వరం టైఫాయిడు క్రింద మారింది

కోలుకొనే సరికి అతనికింకొక ఉత్తరం వచ్చింది అది సింహాచలం ఎవరిచేతో వ్రాయించినది

ఉత్తరంలోని సారాంశం ఏమిటంటే, మంగకు నెల తప్పిందట కల్యాణిక తొందరపడి పెళ్ళిచేశారు అత్తవారు కేవలం డబ్బుకోసమే చేసుకున్నారట పెళ్ళి ఎంత బాగా చేసినా, ఎన్ని కట్నాలు పుట్టినా, ఇంకా సాదిస్తున్నారట ఆ సంబంధం కల్యాణికి ఎంతమాత్రం తగదట వాళ్ళు చేసుకున్నది ఆస్తిని చూసి, అమ్మాయి ఆశలు, ఆశయాలు వారిక ఏం పట్టవుట ఇప్పుడు కుటుంబానికి వారసుడు పుట్టున్నాడని వారి అసలు రంగులు బైట పడ్డాయట కల్యాణిని బాగా ఆరడి పెడుతున్నారట ఆమె నోరెత్త కుండా ఓర్చుకుని వచ్చేసిందట బర్త చదువు పూర్తయితే ఆమె కష్టాలు గట్టెక్కగలవని ఆశిస్తున్నారట తల్లి, తండ్రి

ఇంక చదివినా ఆలోచించినా ఏం ప్రయోజనం, ఆమె పరాయిదయి-పోయింది కూర్మయ్య దిగులుగా అన్నాడు

మిత్రుడికి అంతులేని జాలి ముంచుకొచ్చింది ఎప్పుడూ పంతం, పట్టుదళ తప్ప ఎరుగని ఇతడు ఇంత విరక్తిగా అసలే ఉద్రేకస్వబావం ఏరోజు ఎలా ఉంటాడో చెప్పలేం మతిచలించినా ఆశ్చర్య పోనక్కర్లేదు ఒక్కసారి అటు తీసుకెళ్ళి ఎలాగైనా ఇద్దరికీ ఏకాంతం కల్పిస్తే బాగుంటుందన్న ఆలోచన వచ్చింది

మనసిచ్చి పుచ్చుకున్న ఇరువురి మద్యన మూడో వ్యక్తి తలదూరిస్తే అతడి వినాశనం అతడు ఆహ్వానించి నట్లే అందుకే తనని మర్చిపొమ్మనీ, సుఖపడమని ఆమె చెప్తేనే ఇతడికి తల కెక్కుతుంది లేకపోతే ఆమెను చూసి శాంతించి ఇతడైనా మనశ్శాంతి పొందవచ్చు ఏది ఏమైనా వారిద్దరూ ఆలోచించుకుంటే బాగుంటుంది ఇక్కడితడు పిచ్చిగా మారితే తనకి ఆందోళన, అతడి బంగారు భవిష్యత్తు నాశనం అవుతుంది

ఆవేశపరులకూ, ఉద్రేక స్వభావులకూ ఆలోచన తక్కువ ఏమాత్రం కష్ట మొచ్చినా తట్టుకోలేరు వారి బాధను ఇతరులపై చూపించందే ఉండలేరు ఇలా అతడికి తన మిత్రుడిది పాల పొంగులాంటి ఆవేశమే నన్పించింది ఒక్కసారి ఆమెనూ ఆమె పరిస్థితులనూ చూపించడానికే చివరి నిర్ణయం చేశాడు ఏవో

చెప్పి అతడ్ని ప్రయాణానికి సిద్ధం చేశారు

ఏవిధమైన సంకోచం లేకుండా ముందు కల్యాణి తండ్రి వద్దకే ప్రయాణమైనారు ఆయన గొప్ప సంస్కారి అని మిత్రులిద్దరికీ గౌరవం

ఎన్నడూ లేని విధంగా ఊర్లో అడుగు పెట్టగానే కూర్మయ్య గుండె ఝల్లుమంది ఎవరినీ చూడకుండా పలకరించకుండా కల్యాణి ఇంటివైపు దారితీశాడు వెనకే స్నేహితుడూ

గుమ్మంలోనే ఎన్నడూ వినబడని అపశృతి వినిపించింది ఇల్లంతా ఏదో అమూల్యమైన సంపద కోల్పోయినట్లు బోసిగా ఉంది

"హా! నా పిచ్చి కల్యాణి మంచి గుండె నిబ్బరం గల మనిషి నేనే దుడుకువాడ్ని హాయిగా అత్తవారింట్లో ఉండుంటుంది" అనుకున్నాడు మంగ ఎప్పటిలా బైటికి రాలేదు

'బాబూ వచ్చావా?' రమణమూర్తిగారు గంబీరంగా పలికారు

ఏమైంది ఏమిటోగా ఉన్నారు కూర్మయ్యే కొద్దిగా తెప్పరిల్లి అడిగాడు

"కల్యాణి మనల్ని అన్యాయం చేసి పోయింది బాబూ'

ఆ!" కూర్మయ్య అలాగే నోట మాటరాక శిలాప్రతిమలాగ ఉండి పోయాడు

"ఏంజరిగిందండీ' అని కూర్మయ్యని ఓ పక్కగా కూర్చో బెట్టి ధైర్యం తెచ్చుకున్న స్నేహితుడు అడిగాడు

"ఏం జరిగిందో మాకు తెలిస్తే కద బాబూ నీకు చెప్పడానికి'

'అంటే అంత ఘోరం ఎలా జరిగింది?' మళ్ళీ ప్రశ్నించాడతను

ఆరోజు మా అల్లుడు సెలవులకు వచ్చాడు కల్యాణి అత్త వారింటనే ఉంది కల్యాణిని చూసి ఇష్టపడే చేసుకున్నాడు మరి ఏం జరిగిందో తెలియదు శోభనానికి ఏర్పాట్లు చేయమన్నారు వాళ్ళే చాలామంది వస్తామని కబురు చేశారు. మేమంతా వారికి మర్యాదలు చేసే హడావుడిలో ఉన్నాం రాత్రి శోభనమనగా మధ్యాహ్నం దిగారు చెప్పలేక చెప్పలేక ఆగి మళ్ళీ అన్నారు-

అతడూ అతడి స్నేహితులు రాగానే పేకాటలో పడ్డారు అమ్మాయి తల్లిని ఆఖరి సారి వీణ వాయించుకుంటాను అని అడిగిందట సరేలేమ్మా, స్నానం చేసి తయారయి కూర్చో ముహూర్తం సమయానికి కేకేస్తామని తల్లి చెప్పింది వంటవాళ్ళకి పురమాయింపులతో సతమత మవుతున్న తనకి పంపోచలం అమ్మాయిగారి గది కాలిపోతోందని కేకలేస్తూ వచ్చింది వెళ్ళేసరికే అంతా అయిపోయింది లంకంత కొంప ఈ చివర వారికి జారీగా వంటలు చేయించడం కనీసం పొగ మంట చూసిన వారు కూడా పట్టించు కోక పోవడం ఎక్కడా అంతు బట్టడం లేదు అన్ని మూలకంగా ఇన్ని గొడవలు జరిగి ఆఖరిక ఎల్ల ప్రాణం బలిగొంటుందని అనుకోలేదు ఇవి చాలక తల్లి గర్భవతి, తట్టుకో లేక పోయింది పట్నంలో ఆస్పత్రిలో ఉంది అత్తవారు అమ్మాయికి సంగీతమంటేనే లోకం సంసారి లక్షణాలు లేవని నిందలు మోపుతూ గొడవ చేశారు అమ్మాయికీ వారి కొడుకంటే ఇష్టం లేదని గొడవ చేశారు నాకైతే బ్రతుకే శూన్య-మనిపిస్తోంది" ఇంక చెప్పలేక పోయారు అతడూ అడగలేదు

కూర్మయ్యను ఓదార్చడ మెలా అన్నదే అతడి సమస్య ఈ పరిస్థితిలో నిజం చెప్పి తండ్రిగా రమణమూర్తిగారి బాధను ఎక్కువ చేయడానిక అతడక మనస్కరించలేదు

'అబ్బ! ఎంతటి దయనీయ మైన గాథ లలిత ఆర్ద్రత నిండిన కంఠస్వరంతో అంది.

"అవును! ఆ రోజుల్లో పడకటింటికీ, వంటింటికీ స్త్రీ పరిమిత మైంది అంతెందుకు. నాన్న గారు టీచరు నాకు సంగీతం మినహా చదువు అంటలేదు ఉద్యోగార్హత లేదు భానుమూర్తికి రెండో పెళ్ళయినా ఇచ్చారు విద్యా-వంతురాల్ని కాననీ, కట్నం యివ్వలేమనీ, ఎన్నో సంబంధాలు తిరిగి వెళ్ళాయి పెళ్ళయిం తర్వాత ఈ పల్లెటూర్లో, ఇంకా తగ్గని వారి చాంద స్వభావాలకు సర్దుకో లేక నరకం అనుభవించాను నువ్వు నేనూ మన స్నేహం, మనం ఉపాసించిన ఈ సంగీత విద్య మనకి అండ ఎలాగో పెళ్ళయిన కొన్నాళ్ళకైనా అనుకున్నది కాస్త సాధించాను ఇంకా కల్యాణిలా పల్లెల్లో కళలపట్ల అభిరుచి ఉన్నవారు బలవకూడదనే నా కోరిక

"పిచ్చి వసంతా! నీలో అణువణువూ సంగీతమే ఇమిడి ఉంది కళ వ్యాపారమైన ఈ రోజుల్లో నిజమైన కళాకారిణిగా నిలద్రొక్కుకోడానికి నువ్వెపరికీ తలవంచలేదు నేను కూడ అయిన సంబంధ మైతే నా సంగీతానికి ఆటంక ముండదని ఇచ్చారు బావా, అత్తయ్య నాకున్న పేరు ప్రఖ్యాతులూ, నే సంపాదించిన డబ్బూ చూసే అభిమానపడేది ఆనిజం నాకు తట్టగానే ఎందుకీ జీవితం అనిపిస్తుంది కాని కళాకారిణిగా నాలో ఉన్న కళాతృష్ణ నన్ను యంత్రంగా నైనా బ్రతికేట్టు చేస్తోంది"

లలిత నిర్వేదంగా అంది కొంత సేపు గదిలో నిశ్శబ్దం రాజ్యమేలింది

వసూ! ఇంతకీ కూర్మయ్య ఏమైనాడు

'ఆ ఒక్క విషయంలో కల్యాణి ఆశయం నెరవేరింది తండ్రి ఈమె పోయిన దిగులు తోనే మరణించారు తల్లి ఆస్తినీ, ఇంటినీ అమ్మేసి పుట్టిన మగ పిల్లాడితో తమ్ముళ్ళ దగ్గరకు వెళ్ళిపోయింది కల్యాణి అత్తవారు బికారులైనారు భర్త వ్యసన పరుడైనాడు ఒక్క కూర్మయ్య మాత్రం దేశంలోని సంగీత విద్వాంసులలో ఒకరుగా ప్రసిద్ధి చెందాడు కె నాయుడు అంటే అతనే చూశావా అజరామరమైన ఈ కళే ఇరువురి కళాకారుల మనసుల్ని ఏకం చేసింది అతడు కళాకారుడిగా రాణించాలని ఆమె, ఆమె తనలో భాగంగా ఉండాలని అతడూ ఆశించారు ఏఒక్కరు పోయినా ఇంకొకరి హృదయంలో స్థిరంగా గూడు కట్టుకొనే ఉన్నారు అతడు కల్యాణి స్థానం ఎవరికీ ఇవ్వలేదు '

'వసంతా' ఎన్ని కష్టాలు వచ్చినా ఫర్వాలేదు కళమాత్రం విలువలు కోల్పోకూడదు లలిత అంది

'లక్ష్మీ! అది కళాకారులైన మన చేతిలోనే ఉంది బాధ్యతగా దానిని నిలబెట్టాలి సహృదయంతో, మర్మం లేకుండా ధార పోయాలి ముందుగా కళని ఉపాసించి, ఆరాధించి, స్వంతం చేసుకున్న తర్వాతే దాన్ని వ్యాపారంగానో, ఇంకెలాగైనా మార్చవచ్చు అజరామరమైన ఈకళ సజీవ మైన వాహినిగా నిరంతరం ప్రవహించాలి మనలాంటి వారం నీటి బిందువులుగా అందులో కలవాలి ఒక్క నీటి బిందువు ఆ కళావాహినిలో కలిసినా మన జన్మం ధన్యమే లక్ష్మీ ఆవేశం ఉప్పొంగింది వసంతకి

దానికి తగిన దేహబలం, మనో బలం రెండూ ఉండాలి ఇప్పటికే నిరంతరం శ్రమే కానీ ఇంకోటి ఎరుగవు ఈ విషాదగాథ చెప్పి అలసి పోయావు ఇంక విశ్రాంతి తీసుకో నా కార్యక్రమాలు నావి నీ కళాశాల నీది

అని లలిత లైటార్పి పడకమీదికి చేరింది కళ్ళు మూసుకున్నా వసంత కళా స్రోతస్వినిలో రస రమ్య లోకాల్ని దర్శిస్తోంది

(అయిపోయింది)

## గమనిక

ఈ నవలలోని పాత్రలు కల్పితాలు. ఎవరినీ ఉద్దేశించి వ్రాసినవి కావు.

-రచయిత్రి



# మమకారం

## కె.కె. రఘునందన

"ఏళ్ళొచ్చిన పిల్లి అయినా ఏడిళ్ళు తిరిగి ఓచోట పడుంటుందంటారు. కానీ యీ వెధవ పిల్లి మాత్రం మనింట్లోనే తిష్టవేసింది ముష్టి పిల్లి చచ్చినపిల్లి.' అంటూంది బామ్మ

పిల్లిమీద కారాలు మిరియాలు నూరటం మామూలే దానికి "తాతమ్మా! దానిమీద ఎందుకలా విరుచుకుపడ్తావు? అదేం ముష్టిపిల్లికాదు దానిపేరు "బుల్లు' దాన్ని ముద్దుగాపెంచుకుంటే నీ సొమ్మేంపోయిందట" అన్నాడు.

నానిగాడు... వాడి మేష్టర్ని తిట్టినా రాని కోపం ఓ మూగ జీవమైన వాడి ముద్దులపిల్లి "బుల్లు"ని తిడితే ఎక్కడలేని అహంకారం తన్నుకొస్తుంది

అంతదాకా కారణాంకాలు కట్టుకుంటున్న వాడికి బామ్మ మాటలు ఎలావినిపించాయో కాని గయ్యిమన్నాడు ఓ రెండునెల్ల క్రితం మాట - ఓసాయం సమయాన ఓ గండుపిల్లి ఓ ఆడపిల్లిని వెంటతరిమి, తరిమికొట్టి మా యింటిదగ్గర పడేసింది

దాని ఒంటినిండా గాయాలు చూసిన నానిగాడు దానికి అయోడిన్ పూసి ఉపచారాలు చేసి సేద తీర్చాడు దానికి వాడి వైద్యం బాగా పనిచేసి మర్నాటికల్లా ఉషారుగా తయారైంది. పిల్లిమీద మోజుకొద్దీ దానికి తంచెనుగా పాలు కలిపిన బువ్వో లేకపోతే యిడ్లీలో మచ్చిక చేసుకోవడం ప్రారంభించారు మా పిల్లలు

దానికి 'బుల్లు' అని నామకరణం చేశారు అది వాళ్ళ కాళ్ళని ఒరుసుకుంటూ తిరుగుతూ తోకని ఊపుతూ అరుస్తూండేది అదలా వారికి ప్రేమ పాత్రమై పోయింది

'పోనీలే! అసలే ఎలుకల బాధపడలేక ఛస్తున్నాం దానివల్ల ఆ బాధైనా తప్పుతుంది ' అంది మా ఆవిడ పిల్లల్ని సమర్థిస్తూ



దీనికి బామ్మ కూడా అంగీకరించిందనే గ్రహించాను

పిల్లులంటే పిల్లలకి సరదా వుండటంవల్ల నేను మాట్లాడలేకపోయాను

కానీ కొద్ది వారాలకే బుల్లు' వల్ల ఎలుకల సమస్య విరగడవలేదు కదా! ఓ క్రొత్త సమస్య పట్టుకుంది వెధవ 'బుల్లు చవ్వ ఎలుకలు పడుతుందని ఆ గదిలో పెడితే గదంతా ఛండాలం చేసిందే" అని పిల్లిని దుమ్మెత్తిపోసి మూడు చెంబులనీళ్ళు దేవుడికి సంప్రోక్షణ చేసినట్టు గదంతా కుమ్మరించింది మా ఆవిడ

ఇక్కడితో హడావిడి తెగిపోతే బాగుండేది కానీ అమ్మాయిల యిళ్ళచుట్టూ అబ్బాయిలు ప్రదక్షిణ చేసినట్టు మగపిల్లులన్నీ మా యింటిని పరామర్శించడం ప్రారంభించాయి

'బుల్లు' అవటాలాన్ని చూసి కస్సుమనేది కాని గండుపిల్లులు నోరుమూసుకుని వెళ్ళేవా!?"

తోకలు ఒడ్డులా తయారు చేసుకొని కయ్యానికి దిగేవి వాటిలో వాటికి కాంపిటీషన్!!

దీంతో యిల్లంతా గందరగోళమ య్యేది

పిల్లలకది చోద్యంలా అనిపించేది!!

తనగుడ్డుకాని పీకేయదుకదా! అని గుండె గుబగుబలాడేది బామ్మకి

మా ఆవిడ సరేసరి ఓ కర్ర చేతబుచ్చుకొని వాట్ని తోలడంలో నిమగ్నమైపోయేది

నేను మాత్రం నిమ్మకు నీరెత్తిన వాడిలా ఉండేవాడ్ని నాగదిలో టి వి చూసుకుంటూ

రెండు మూడుసార్లు వెధవపిల్లిని మూటగట్టి నెల్లిమర్ల ఏట్లో పడేసి రండని మా బంట్రోతుకి ఓ పావలా డబ్బులు యిచ్చింది బామ్మ

వాడసలే దొంగ వెధవ! వాడు నెల్లిమర్ల ఏటిదగ్గర పడేస్తానని వెళ్ళి గొర్లిపేట మిల్లు దగ్గర వదిలేసేవాడు

బంట్రోతు వచ్చిన అయిదు నిముషాల్లో మళ్ళా మా యింటిలో మార్జాలరాజ్యం సాక్షాత్కరించడంతో శివతాండవమే ఆడేది బామ్మ

ఇంకా దీని పీడ ఎలా వదిలించుకోవడమో బోధపడలేదు పాపం! బామ్మకు

అందుకే రోజుకి ఒకసారన్నా పిల్లిని దుమ్మెత్తిపోస్తుంది ఈ రోజుకూడా పిల్లలకీ - బామ్మకీ పిల్లి విషయంలో సయోధ్య కుదరలేదు బామ్మదాన్ని దూరంగా పంపేస్తానంటే పిల్లలు దాన్ని వుంచడాన్కి పథకం వేస్తున్నారు.

ఆఫీసు సెలవు మూలంగా నేనారోజు వాలుకుర్చీలో నడుంవాల్చి వాళ్ళమాటలు

వింటున్నాను.

"ఏమండీ! మీరేం మాట్లాడరేం?' అంది నన్ను కుదిపి మా ఆవిడ

"ఏం మాట్లాడమంటావు?' తిరిగి అడిగాను

"ఏమిటో మీకు తెలీదా? నాచేత చెప్పించాలనా? బామ్మకి అసలే మడీ, తడీ ఈ పిల్లేమో నానా కంగాళీచేస్తుందాయె ' అంది నన్ను

"పూర్వం రామతీర్థంలో మా చిన్నప్పుడు ఓలేటి మేష్టారని వుండేవార్లే ఆయనింట్లో యిదే గొడ వుండేది వాళ్లావిడ సూరీడమ్మకి పిల్లంటే పంచప్రాణాలు ఆయనకి పిల్లి పరమద్వేషం ఆయన పిల్లిని పంపేస్తానంటే తాను పుట్టింటికి పోతానని జట్టీ ఆడేది ఈ పిల్లి తగువులు మహా విచిత్రంగా వుంటాయిలే! అపుడాయన విజయ నగరం నీళ్లటాంకు దగ్గర విడిచి పెట్టార్ట రెండురోజులు తిరగలేదు పిల్లి మళ్లా వెతుక్కొని మరీ వచ్చేసిందట అందువల్ల పిల్లిని పంపినా వ్యర్థ ప్రయత్నమే! దానంతట అది మనసు పుట్టిపోవాలి గతంలో ఓ సంఘటన ఉదహరించి మరీ చెప్పాను

"మీరూ పిల్లల పక్షమే! నేను, మీ బామ్మ ఒక్కటైనాం! ఒంటిపిల్లి రాకాసుల్లా అంది మా ఆవిడ మూతి మూడు వంకర్లు తిప్పి

ఇంతలో వీధిలో రణగొణ ధ్వని అయినట్లు వినిపించింది

గబాలున లేచాను

"ఏమిటి? వీధిలో గొడవలా వుంది." అన్నాను.

"మరెవరండీ? సీతయ్య తాత... ఎప్పటి గొడవే... మళ్లా కొడుకు మీద మనసు పుట్టివుంటుంది. కాబోలు " అంది మా ఆవిడ కిటికీలోంచి చూసి వచ్చి

మళ్లా సీతయ్య తాత ఏదైనా అఘాయిత్యానికి పూనుకోవడం లేదుకదా అన్న సంకోచంతో బయటికి నడిచాను

అంతా గుమిగూడి వున్నారు

అందరినీ తప్పించుకొని గుడిసెలోకి వెళ్లాను

తాత చేతిలోంచి కొరడాని లాక్కుందికి ప్రయత్నిస్తున్నాడు ఓ ఆసామి

"చూడండి బాబూ! తాతెలాగో కొరడాతో ఒళ్లు బాదుకుంటున్నాడు వద్దంటే మానడంలేదు. అయినా ఎలా జరగాల్సింది అలా జరుగుద్ది పెద్దోరు మీరైనా సెప్పండి " అన్నాడు నాతో

"సీతయ్య తాతా! ఎవరికర్మ ఫలాన్ని వారనుభ విస్తారు నువ్వు చేసింది తప్పని నువ్వు పశ్చాత్తాప పడితే ప్రయోజనం ఏమిటి అయినా అటువంటి నీచానికి ఒడిగట్టినవాడి గురించి తలచుకుని కుమిలిపోతావెందుకు? ఈ ముసలికాలంలో కృష్ణా, రామా అనుకుంటూ ప్రశాంతంగా గడపకూడదూ? నామీద ఏమాత్రం గౌరవమున్నా కొరడాని వదులు' అన్నాను

సీతయ్య తాత నామాట దక్కించాడు

కొరడాని చూరులో తోశాను

పాక బయట జనం యిల్లు తగులబడి పోతున్నట్లు చూస్తుంటె వారిని మెల్లగా పంపేశాను

నేను, తాత మిగిలాం.

అయోడిన్‌తో తాత ఒంటిమీద గాయాలు అద్దాను.

"బాబూ! ఒంటిగాయాలు మాన్పగలవు మనసుకి గాయమైంది అది మాన్పగలవా?" సూటిగా అడిగిన తాత ప్రశ్న నా గుండెని తాకి కెలుకుతుంది

తాతా! ఏ తండ్రయినా తన కొడుకు ప్రాజ్ఞుడౌతాడని, తనకి కూడు పెడతాడని ఆశించి పెంచి పెద్ద చేస్తాడు అలాగే నువ్వు చేసావు కాని నీ కెదురైందేమిటి? అడియాస అందుకే నువ్వు సహించలేక యింటినుండి గెంటేశావు యిప్పుడేమో యిలా ఒళ్లు బాదుకుంటున్నావు" అన్నాను మందలిస్తూ

బాబూ! రాత్రి ఆడు రైలుకింద బుర్రపెట్టినట్టు పీడకలొచ్చింది అందుకే నామీద నాకే కోపం వచ్చి యిలా చేసుకుంటున్నాను" అని రోదించాడు తాత

సీతయ్యతాత మనస్సు వెన్నలాంటిది అది యిట్టే కరిగిపోతుంది అందువల్ల నా మాటలకి మెల్లగా సర్దుకుంది.

తాతను పడుకో బెట్టి యింటికి చేరాను

తర్వాత సీతయ్య తాతని గురించిన చింతనలో పడ్డాను అతనికి ఒక కొడుకు రామేశం

వాడికి ఎలా అబ్బాయో కాని వాళ్ల యింట వంటలేని వ్యసనాలబ్బాయి సీతయ్య తాత మృదువైన హృదయం అది చూసి సహించలేక పోయింది.

చెప్పిచూశాడు వినలేదు అంతేకాక పెచ్చుమీరి పోయాడు ఓ తలమాసిన దాన్ని ప్రేమించానని గడపలోకి తీసుకొచ్చాడు ఓర్వలేకపోయాడు తాత. పెద్ద గొడవపెట్టాడు కులంలేని అమ్మాయిని యింటికి తీసుకు రావడం మంచి పద్ధతికాదని హెచ్చరించి ఆ అమ్మాయిని వాళ్ల వాళ్లకి అప్పగించాడు

తన జల్సాలకి అవరోధం కల్పించాడని తండ్రిపై సుడిగాలిలా రేగాడు రామేశం

కొడుకు ప్రవర్తన నచ్చని తాత తన గుమ్మంలోంచి పొమ్మన్నాడు పౌరుషంతో వెళ్లిపోయాడు వాడు

రెండు నెలలయినా తిరిగిరాని రామేశం ఏ అఘాయిత్యానికి అయినా పూనుకున్నాడేమోనని - కలవరించసాగాడు

తాను కొడుకు విషయంలో తప్పు చేసినట్లు మథనపడి తనని తాను కొరడాతో ఒళ్లు బాదుకొనే వాడు

ఇదంతా జనానికి వినోదంలా ఉన్నా - నాకు మాత్రం తాత విషయంలో ఇతమిద్ధమని చెప్పలేని జాలినిండేది

ఎన్ని తప్పులు చేసినా సహించే ఓర్పు - అలిగితే తిరిగి బుజ్జగించే నేర్పు ఆకన్న తండ్రిగుండెకి తెలుసో, కాబోలు పేలవమైన నవ్వొకటి నా పెదాలపై వెలిసి అదృశ్యమైంది

ఆ రాత్రంతా సీతయ్య తాత గురించి ఆలోచించాను.

మర్నాడుదయం బామ్మ రాద్ధాంతం ఎప్పటిలాగే మొదలైంది.



"దీని శని విరగడెప్పుడౌతుందో మన కర్మకాలి మనింట్లో నాపురించింది. పిల్లిచచ్చినముండ. బంగారంలాంటి నా బట్టని పీకలుచేసి పడేసింది ఒరే సుబ్బిగా, నానిగా ఎక్కడ చచ్చార్రా?యిలారండి' అని గావుకేకలు వేసింది

నానిగాడు, సుబ్బిగాడు హనుమంతాజ్ఞ విన్న వానరుల్లా బామ్మ ముందు వాలారు

జరిగిన సంగతంతా వివరంగా చెప్పింది

తాతమ్మా! నీకంతే కావాలి బుల్లు నిన్న రాత్రంతా నిరాహారం చేసింది దానికంతకీ కారణం నువ్వని దానికి తెలిసిపోయింది, అందుకే నీబట్టని పీలికలు చేసింది' అని సాధింపుగా కుడి పిడికిలిని ఎడం అరచేతిలో గుద్దుతూ అన్నాడు నానిగాడు

దానికి వత్తాసు పలికాడు సుబ్బిగాడు

ఒరే బుజ్జి కన్నలూ! మీ కేది కావాలంటే అది వండిపెడ్తాం నామాట వినండ్రా అని గడ్డం పుచ్చుకుని బ్రతిమలాడింది బామ్మ

సుతరాము తమ కిష్టంలేనట్లు మొహం పెట్టేశారు మా అబ్బాయిలు నానిగాడు, సుబ్బిగాడు

ఇక బామ్మ నాదగ్గరికి సిఫార్సు కొచ్చింది

ఒరే సాంబిగా! నువ్వేనా చెప్పరా! ఆ వెధవ పిల్లిని ఎలాగైనా పంపించే పూచీ నీదేరా' అని నన్ను బ్రతిమలాడింది

ఇక తప్పలేదు

మా పిల్ల లిద్దర్నీ పిలిచి ఎక్కడైనా దూరంగా వదిలేస్తే

'సింహాసనం' సినిమా చూపిస్తానని ఆశపెట్టాను

పిల్లలమీద ప్రయోగించాల్సిన అస్త్రం సినిమా. అది వాళ్లమీద ప్రయోగిస్తే చాలు ఏపనైనా క్షణాల్లో చేసి పెడతారు

సినిమా చూడాలనే తపన ముందు పిల్లిని వుంచాలన్న ప్రయత్నం వాళ్లలోంచి వుడా యించింది

నా శ్రీమతి సహకారంతో దాన్ని మెల్లగా ఓగోనె మూటలో కట్టి లాక్కెళ్లారు

# మమకారం

ఓ అరగంటకి తిరిగి వచ్చారు పిల్లలు.

నాన్నా! ఏం టయిందంటే మేంగొర్లిపేట మిల్లు దగ్గరికి వెళ్లేసరికి ఓ కుక్క వెంటపడింది పిల్లిని పసి గట్టింది కాబోలు మొరగటం ప్రారంభించింది. పిల్లిని కళ్లు కప్పి పొలాల్లో వదిలిపెట్టివచ్చేశాం' అన్నాడు నాలుగు మైళ్లు ఈదిన వాడిలా అలసిపోతూ – సుబ్బిగాడు

"ఎందుకర్రా! అలా చేశారు? నెల్లిమర్ల అవతలపారేసి రండ్రా అంటే. మీకేం పోయే కాల మ్రా!" అని గింజుకుంది బామ్మ

ఎందుకు బామ్మా! అలా పిల్లల్ని తిట్టిపోస్తావు? యింకా నయం కుక్కకి అందకుండా పొలాల్లో వదిలిపెట్టి వచ్చారు' అన్నాను చీదరింపుగా

ఈ బాగోతం యింతటితో ఆగిపోతే బాగుండేది

మర్నాడుదయం –

[1]'నాన్నా! ఏం జరిగిందో తెలుసా? మా ఫ్రెండు లేడూ సూర్యం వాడు చెప్పాడూ. గొర్లిపేట మిల్లు దగ్గర ఓ పిల్లిని నాలుగు కుక్కలు కలిసి చంపేశాయిట మన పిల్లిలాగే వుందని చెప్పాడు. ఎంత జాలేస్తోందో అని ఎంతగానో వాపోయాడు నానిగాడు

అయినా యిదంతా తాతమ్మ చేసిందే. వొద్దే వొద్దే అంటే వినకుండా పిల్లిని వెళ్లగొట్టింది ఎంత ఏడుపు వస్తోందో తెలుసా?' అని ఏడుపు మొహంపెట్టాడు సుబ్బిగాడు

పిల్లిపట్ల పిల్లలకి ఎంత పరిపూర్ణమైన అభిమానం వుందో ఉద్దీపించిందా క్షణం

"ఒరే! అబ్బీ! పిల్లిమెడక్రింద తెల్లమచ్చవుండాలి మాశాడ్రా మీ సూర్యం?అయినా మనపిల్లో కాదో." అంది అనుమానంగా బామ్మ

చచ్చిన పిల్లిని అంత శ్రద్ధగా ఎవడు గమనిస్తార్రమ్మా ఇప్పుడేమో పిల్లలకి బ్రహ్మహత్య పాతకం కాని చుట్టుకోదు కద! అని బామ్మమీద కోపం ప్రదర్శించింది మావిడ

నా మనసు బాగా అలవి కాని బాధతో మెలి తిరిగింది

ఆ రోజు అంతా పుస్తకాలు తీయకుండా సమ్మె ప్రకటించారు మా పిల్లలు

అయితే తమ బుల్లు చచ్చిపోకుండా... ఎక్కడైనా బ్రతికివుండే – యింటికి ఏ క్షణాన్నైనా తిరిగి సురక్షితంగా వస్తే ఆంజనేయస్వామికి కొబ్బరికాయ కొడ్తామని మొక్కుకున్నారు పిల్లలు.

జరగిందానికి పశ్చాత్తాపంతో మొహం ఎత్తుకోలేక పోయింది బామ్మ.

మా ఆవిడా అంతే

తిరిగి పిల్లి యింట్లో ప్రవేశించాలని హృదయ పూర్వకంగా కోరుకున్న వారిలో నేనొకణ్ణి

మరునాటి ప్రొద్దున్న గ్యాస్ స్టౌ క్రింద 'గుర్‌గుర్' అని వినిపిస్తే సుబ్బిగాడు చేయిపెట్టిలాగి చూశాడు

తీరా చూస్తే అది వాళ్ల ముద్దులపిల్లి 'బుల్లు' దాన్ని పట్టుకుని నెత్తినెక్కించుకుని. యిల్లంతా త్రిప్పేసి నానా హడావుడి చేశాడు వాడు

బామ్మ మొహంలో తేజస్సు వచ్చింది.

నేను వారి ఆనందంలో పాలుపంచుకున్నాను

సాయంత్రం పిల్లలు పిల్లితో ఎప్పటిలాగే ఆడుతుంటే వీధిలో గొడవమొదలైంది.

సీతయ్య తాత బుర్రబాదుకుంటుంటే ఎప్పటిలాగే సర్దివచ్చాను

"అబ్బ! యీ తాత పరిస్థితి మరీ చికాకెత్తిస్తోంది ఓ వెధవని కన్నందుకు విచారించక వాడు వెళ్లిపోయినందుకు తనది తప్పుగా భావించి, బుర్ర బాదుకోవడం ఎందుకో? ఆ నీచుడు వెళ్లిపోయాక మమకారంతో ఎదురుచూడ్డం శుద్ధ దండుగ " తాతమీద నాకెప్పటిలాగే జాలికల్గినా ఆ క్షణం మాత్రం ఆవేశం కల్గింది

నా మాటలు సాంతం విన్న శ్రీమతి –" ఏమండీ! అన్నీ తెలిసిన మీరే అలా అంటే ఎలాగండీ?ఉదాహరణకి మొన్న మనింట్లో జరిగిందే తీసుకోండి ముద్దుకోసం మొదట పిల్లిని పెంచాం కానీ అది మనకి అసహ్యం కల్గించే పనులు చేసింది. దానిమీద విపరీతమైన కోపం వచ్చింది. బయట పారేయ మన్నాం అంతలోనే ఏదో పిల్లిని కుక్కలు చంపాయని తెలిసి అది మన పిల్లి కాకూడదని బ్రతికుంటే తిరిగి రావాలని. దానిపై మమకారం చూపించాం అది కేవలం మూగజీవి.. అలాగే తాత కొడుకుని పెంచి పెద్ద చేశాడు వాడు వక్రంగా నడిచాడని యింట్లోంచి పొమ్మన్నాడు అలిగి వాడు వెళ్ళిపోతే రావాలని కోరుకుంటున్నాడు. దానిలో ఎంతమాత్రం అవివేకంలే దని నా అభిప్రాయం

అక్షరాలవున్న వాస్తవాన్ని కాదని ఎలా అనగలను?

అందుకే మాట్లాడే శక్తిని కోల్పోయా నా క్షణం!! □



# హైదరాబాద్ నోట్‌బుక్

## తెలుగు మణుగులు ఆవిష్కరణ:

ఒక జాతి సంస్కృతి, చరిత్రల అవగాహనకు, సాంఘిక క్రమ పరిణామావగతికి భాష ప్రధాన సాధనం. భాషలోని పదాలు ఆయా కాలాలలో పాత అర్థచ్ఛాయలను కోల్పోతూ కొత్త అర్థచ్ఛాయలను పొందుతూ విచిత్రంగా మారుతున్నా, మూలరూప భాగాలలో, మూలార్థ భాగాలతో రక్షించుకొనడం వల్ల జాతి చరిత్ర, సంస్కృతి, సాంఘిక క్రమ పరిణామాలను తెలియ పరుస్తాయి. ఈ పదాల మూలంగా మరుగు పడిన చరిత్రను పైకి తీయడానికి రెండు సంవత్సరాల క్రితం భాషా సారస్వత చరిత్ర భూగోళ, పురాతత్త్వాది రంగాలలోని ప్రముఖులతో ఏర్పడిన తెలుగు గోష్ఠి రెండు సంవత్సరాలుగా నెలనెలా రెండవ ఆదివారం సమావేశమౌతూ చర్చించిన వివిధాంశాలను తెలుగు మణుగులు (తెలుగు గోష్ఠి చర్చా సంహిత!) అనే పేర ప్రచురించింది దీనిని గోష్ఠి సభ్యులలో ఒక్కరయిన శ్రీ తిరుమల రామచంద్ర (నేను) డిసెంబర్ 14వ తేదీన తెలుగు విశ్వ విద్యాలయం ప్రాంగణంలోని విజ్ఞాన సర్వస్వం కేంద్రంలో ఆవిష్కరించారు. ఈ సందర్భంలో శ్రీ రామచంద్ర ప్రసంగిస్తూ ఈ గోష్ఠిలో నియత విద్య లేక పోయినా, స్వయం కృషితో మహా విద్వాంసులయిన వారు గోష్ఠిలో సభ్యులుగా వున్నారని, వారిలో శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి, గోష్ఠి సంగ్రాహకులు శ్రీ చేమకూరి శేషగిరిరావు ప్రముఖులని ప్రశంసించారు. ఈ గ్రంథంలో అందర్, అణపోతులు అన, అత్తు పట్టు ఆలువేలనాడు, ఇనప ఎత్తు ఎరికల్ ఎహువుల ఎలి కొట్టి శర్మ, కిలారము కూర్మ కొండ కొట్టి శర్మ కొతబలి, చాత మూల, చిత్రకవ చెన్ తలవర, తూర్తి శర్మ పన్నస, పాడి పాఱ పుణరుపుష్పంబు బృహస్పతి హార పులుమావి పెరుంపల్లి పెర్మాత పేలామతి పున్నమ మణుతుఱు ముత్తరాజు (వ్) ముహ్మాయి సానులు మున్నూరు అయ్యలు రెనాడు శాహ- అనే పదాల చర్చ, పాఠకులు విప్పు వగిన అర్థనిర్ణయమూ పొందు పరచబడినాయి పులుమావి వంటి పదాల అర్థ నిర్ణయం చాల కన్విన్సింగ్‌గా ఉంది తెలుగు పుట్టుపూర్వాలను గురించి శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి విరికొత్త దృష్టితో వ్రాసిన వ్యాసం మన ఆది కవి నన్నయకాదు, వాదావు ఎందరికి ఏమకాలికుడైన మల్లియరేచనే అని డాక్టర్ పుల్లా వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రి వ్రాసిన వ్యాసం, ధాన్యకటకం అమరావతిగా ఎప్పుడు మారెనో అని శ్రీ చేమకూరి శేషగిరి రావు వ్రాసిన వ్యాసం ఉన్నాయి. ఇది కేవలం 66 పుటలదే అయినా ఆరులక్షల విలువ గలదని శ్రీ రామచంద్ర అన్నారు తర్వాత గోష్ఠి సంచాలకులు గ్రంథ సంగ్రాహకులు శ్రీ చేమకూరి శేషగిరిరావు గారు ప్రసంగిస్తూ, పుస్తక ప్రచురణాది కాల వివరాలు తెలిపారు. ఈ గ్రంథాన్ని ప్రముఖ జర్నలిస్టు శ్రీ జి కృష్ణ ఆంగ్లంలోకి అనువదిస్తున్నారని ఆయన తెలిపారు. తెలుగు లోని పాళీ పదాలను తెలుగు గోష్ఠి చర్చా సంహిత 2వ గ్రంథంగా త్వరలో ప్రచురిస్తున్నామని ఆయన తెలిపారు

ప్రపంచంలోనే మహా చైత్యమై చైనా బౌద్ధ యాత్రికుల కాలం వరకు ఉంది. నేలమట్టమై పోయిన ధాన్యకటక మహాచైత్యం ప్రతికృతి లభించింది గనుక, అది ఆధారంగా, అమరావతిలో ప్రతిరూపాన్ని నిర్మించేందుకు ప్రచారం చేయాలని దాని ప్రతిరూప నిర్మాణాది కార్యక్రమాలకు డాక్టర్ పరబ్రహ్మశాస్త్రి అధ్యక్షతన ఒక సన్నాహక సంఘం ఏర్పాటు చేయాలని గోష్ఠి తీర్మానించి, తదనుగుణంగా ఏర్పాటు చేసింది. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల, విదేశీ బౌద్ధ సంఘాల సహాయంతో దీనిని నిర్మించాలన్న ఆశాభావాన్ని శ్రీ శేషగిరిరావు వ్యక్తం చేశారు తెలుగు గోష్ఠికి ఒక లాంఛనం రూపొందాలని శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిని కోరుతూ తీర్మానించారు. తెలుగు గోష్ఠి సభ్యులు శ్రీయుతులు జి. కృష్ణ, బి ఎన్. శాస్త్రి, పి సీతారామాంజనేయులు, బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, పుత్రేవు రాజారామదాసు, యార్లగడ్డ ఆంజనేయులు, ఎం. శంకరరెడ్డి, చింతా వేంకటేశ్వర్లు, బి. రామకృష్ణదాస్ కె వెంకటేశ్వరరావు, ఎ. ఉమామహేశ్వరశాస్త్రి, ఎస్ రాజవర్ధన్, జమ్మలమడక కామేశ్వరరావు, యామిజాల జగదీశ్, నాగాజట్ల మార్కండేయశర్మ, కారుమంచి బాదరయ్య, శ్రీమతి జె వరలక్ష్మి, డాక్టర్లు పుల్లా వాసుదేవ పరబ్రహ్మశాస్త్రి, పోణంగి శ్రీరామ అప్పారావు, సి. రామారావు, ఎం వీరభద్రశాస్త్రి, ఎన్. శివరామమూర్తి, టి. వి జి శాస్త్రి, డి వి. ఎన్. శర్మ, గుమ్మ శంకరరావు, అక్కిరాజు రమాపతిరావు, పోరంకి దక్షిణామూర్తి పి. విజయరాఘవరెడ్డి, ఎన్ ఎస్ రామచంద్రమూర్తి, పురాణం రాధాకృష్ణ ప్రసాద్, ఆచంటల విజయకుమార్‌బాబు, శ్రీ సుబ్బారావు (ఆకాశవాణి సెక్షన్) మున్నగు వారు ఈ ఆవిష్కరణోత్సవ గోష్ఠిలో పాల్గొన్నారు

## శ్రీ దాశరథికి మరొక గౌరవం :–

ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవి డాక్టర్ దాశరథి కృష్ణమాచార్యులకు మరొక మహోన్నత గౌరవం లభించింది. కేంద్ర ప్రభుత్వం సమాచార ప్రచార శాఖ ప్రచురించే ప్రముఖ రచయితల పుస్తకాలతో పాటు డాక్టర్ దాశరధి గ్రంథాలు కూడ ప్రచురింపబడుతాయి ఈ విషయాన్ని సమాచారశాఖ ప్రచురణ విభాగం డైరెక్టర్ డాక్టర్ ఎస్ ఎస్ శశి ఢిల్లీలో డిసెంబరు 18వ తేదీన పత్రికా ప్రతినిధుల ఇష్టాగోష్ఠిలో తెలియజేశారు నాలుగు దశాబ్దాల క్రితం ప్రారంభమై ఇంత వరకు 6000 మంది ప్రముఖ రచయితల జీవన చరిత్రలు ప్రచురించిన ఈ ప్రచురణ శాఖ ఇకమీదట చౌకగా, అందరికీ అందుబాటు ఉండే రీతిగా పుస్తకాలు ప్రచురించదలచిందని, భారత స్వాతంత్ర్య సమరంలోని వివిధ ఘట్టాలను ప్రచురించదలచిందని డాక్టర్ శశి తెలిపారు. తమ ప్రచురణలో పిల్లల పుస్తకాలు చాల



జనప్రియమైనవని. ఈ పుస్తకాలు చాల వివిధ భాషలలో ప్రచురించబడినవనీ అన్నారు. ప్రాంతీయ భాషలలో పుస్తకాలు ప్రచురించడంలో ప్రచురణ శాఖ మహత్తర పాత్ర నిర్వహించగలదనడం నిజమే అయినా, ఈ భాషలలో పుస్తకాల అమ్మకం చాల మందకొడిగా వున్నందున ప్రచురణ శాఖ ఆ పనికి పూనుకొనలేక పోతున్నదని అన్నారు.

## ఉపశ్రుతి :–

పత్రికా రచయితలను గురించిన చర్చ జరుగుతూంది. ఒక సుప్రసిద్ధ పత్రికా రచయిత అధికారాలను గురించి చెబుతున్నారు. మిత్రులు శ్రీ అబ్బూరి వరదరాజేశ్వరరావు అడ్డు తగిలి "ఆయన ఆ పత్రికలో ధీరోదాత్తుడండీ" అన్నారు. ధీరోదాత్తుడా? అంటే? – అని ప్రశ్నించారు ఒకరు. ధీర + ఉదాత్తుడు–అన్నారు మిత్రులు వరద. – తిరుమల రామచంద్ర

**Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.**
**Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667**




గేటు వద్ద –



తర్వాత వారు వేగంగా విమానాశ్రయం వైపు దూసుకు పోయారు

31/19

ఉన్నట్టుండి వారికి తమ ముందు సైరన్‌ల మోత వినిపించింది



విక్రమ్ కారుని పక్కకి తీసి కిందికి దిగాడు



జనరల్, ఆయన పరివారంతో కూడిన కార్లు చాలినంత దూరంలోకి రాగానే వాటి మధ్యకి విక్రమ్ చేతి బాంబుని విసిరాడు



దాని తర్వాత మరో రెండు చేతి బాంబులు విసిరి విధ్వంసకాండని పూర్తి చేశాడు

తిరిగి వారు రోడ్డు మీదికి వచ్చారు



విమానాశ్రయంలో –



© RANG REKHA FEATURES PVT. LTD 1984